RELEASE ON 20-9-68

SUNIL DUTT, NUTAN, SANJEEV KUMAR, MUMTAZ, RAJENDRA NATH, LEELA MISRA & OMPRAKASH in

*Sivaji Ganesan Presents*

# GAURI

**EASTMAN COLOR**



**NAVRANG ★ KRISHNA ★ PRAKASH**
HYDERABAD

**ALANKAR**
SECUNDERABAD

| Dialogue & Lyrics | Music | Direction |
|---|---|---|
| **RAJENDRA KRISHAN** | **RAVI** | **A. BHIM SINGH** |

— **Shinde Sarpotdar & Co. Release.**

ఈ సంచికలో



ముఖచిత్రం ధృవకాంతి
చిత్రకారుడు: వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 12-00
దీపావళి ప్రత్యేక సంచికతో రు. 17-00

యువ, పోస్ట్ బాక్స్ 216, హైదరాబాద్-1.

# ఆంధ్రప్రదేశ్ అంతటా విజయవంతంగా ప్రదర్శింపబడుతోంది.






బంకిం, టాగూర్, నీహార్ రంజన్, ారాశంకర్, వనఫూల్, పాంచ్ ఖడీ మొదలగు ప్రసిద్ధ బెంగాలీ రచయితల వలలు, ఎంతో చక్కగా అనువదించి, ంక్షిప్తం చేసి, అత్యంత ఆకర్షణీయంగా నెల నెలా 'యువ' లో ప్రచు స్తున్నందుకు మీ రెంతేనా అభినంద యులు. వీటన్నింటినీ చక్కని పుస్త ాలుగా వేయించరాదా? వేస్తే కొను క్కడానికి కుతూహల పడుతున్న నాబోటివాళ్లు ఇంకా ఎంతో మంది ఉండరంటారా? ఉంటారనే నా నమ్మకం.

కథలు ఎన్నుకోడంలో 'యువ'కు ఒక ప్రత్యేకత ఉన్నట్టు కనిపిస్తుంది. సెప్టెంబరు నెల సంచికలో కథలన్నీ, దేనికదే, రసవత్తరంగా ఉన్నాయి.

సరస్వతి, హైదరాబాదు

మీ 'సంక్షిప్త' నవలలు ఎంతో బాగుంటున్నాయి. వాటిని మీరు సంపుటాలుగా వేస్తున్నారని వింటున్నాం. నిజమేనా? ఎన్ని సంపుటాలు? ఎక్కడ దొరుకుతాయి? పూర్తిసెట్టు మాకు వీపీగా పంపగలరా?

పి. వెంకటరమణ,
విశాఖపట్నం



నవజ్యోతి పిక్చర్స్

# నడమంత్రపుసిరి

నిర్మాతలు
సాంబశివరావు, వందనం

దర్శకుడు
తాతినేని రామారావు

'యువ' సెప్టెంబరు నెల సంచికలో కథలన్నీ ఒకదాని కొకటి తీసిపోనివిగా ఉన్నాయి ఇంత మంచి కథలు ఎంచి మరీ అందిస్తున్నందుకు మా కృతజ్ఞతలు.

'సంక్షిప్త' నవలలు 'యువ' కొక ప్రత్యేకత వాటిని సంపుటాలుగా ప్రచురించవలసిందని కోరుతున్నాను.

మంగు రాజగోపాల్, శ్రీకాకుళం

సంపాదకులకు,

యువ సెప్టెంబరు సంచిక ముఖ చిత్రం బెస్తపిల్ల చాల అందంగా ఉంది. కార్టూన్లు చాల నవ్వించాయి.

గుండమళ్ళ వెంకటరామారావు,
శ్రీకాకుళం

సెప్టెంబరు యువ చదివాను, చాల బాగుంది. ముఖ్యంగా నిష్పక్షపాతంగా ఉన్న మీ సంపాదకీయం సర్వోత్తమం. మరే ఒక దినపత్రిక స్థాపించి, పక్షపాత రహితంగా విమర్శల నెందుకు చేయకూడదూ ?

ఆంధ్ర దేశంలో వున్న రమణీయమైన ప్రకృతిదృశ్యాలను ఛాయాచిత్ర రూపంలో మీ పత్రికలో ప్రచురిస్తారని తలుస్తాము

ఎస్. వి సూర్యనారాయణ, ఖిలాయ్

['యువ' సంక్షిప్త నవలలు, సంపుటాలుగా వేయవలసిందని అనేక మంది పాఠకులు కోరుతున్నారు త్వరలోనే అటువంటి ప్రయత్నాలు చేయగలమని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము. సం॥]

# యువ

## దీపావళి ప్రత్యేక సంచిక

*అనేక ఆకర్షణలతో వెలువడుతున్నది.*

విజయలక్ష్మి ఆదివిష్ణు వివేకానందమూర్తి
కొడవటిగంటి కుటుంబరావు పాలగుమ్మి పద్మరాజు
కొమ్మూరి వేణుగోపాలరావు పన్యాల రంగనాధరావు
పతంజలి పురాణం సుబ్రమణ్య శర్మ గొల్లపూడి
మారుతీరావు గార్ల కథలతో, ప్రముఖ చిత్రకారుల
చిత్రకథా, కార్టూన్లతో

*అక్టోబరు 15వ తేదీకల్లా మీ చేతుల నలంకరిస్తుంది.*

*ఈ రోజే మీ కాపీ రిజర్వు చేసుకోండి.*

వెల రూ. **5**

విజయవంతంగా నడుస్తూంది




ఈస్టమన్ కలర్

దర్శకత్వం
M.V.రామన్
సంగీతం:
R.గోవర్ధన్-K.N.రామసుబ్రహ్మణ్యం
మాటలు-పాటలు: అనిసెట్టి
కెమెరా: రవికాంత్ నాగాయిచ్

పూర్ణా రిలీజ్

SATHYAM

# యువ
## సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 18 అక్టోబరు, 1968 సంచిక 4

కేంద్ర ప్రభుత్వ రైల్వేమంత్రి, శ్రీ పూనాచ, ఆగస్టు నెలలో హైదరాబాద్‌కు వచ్చి, ఆంధ్రప్రదేశ్‌లో రైల్వే లైను అవసరాలను గురించి, రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డితో సమాలోచనలు జరిపారు.

సమాలోచనల తరువాత, శ్రీ పూనాచ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ, ఒంగోలు నుంచి నాగార్జునసాగర్ మీదుగా హైదరాబాదుకు కొత్త రైలు దారిని వెయ్యడానికి నాల్గవ పంచవర్ష ప్రణాళికలోనే యీ కార్యక్రమాన్ని చేర్చడానికి వీలుగా త్వరలోనే సర్వే జరిపించడం జరుగుతుందన్నారు అంతేకాక, బైలదిళ్ళ నుంచి భద్రాచలం మీదుగా కొవ్వూరువరకు రైల్వేలైను వెయ్యడంలో, ఇదివరలో సర్వే జరిగినప్పటికీ, అప్పటికీ ఇప్పటికీ ధరలు చాలా పెరిగినందున, మళ్ళీ ఇంకొక సర్వేకూడా జరిపించబడుతుందని పూనాచ చెప్పారు.

ఈ రెండు రైల్వే లైనులను వెయ్యడంవల్ల, రాష్ట్రావసరాల సంగతి ఎలా వున్నా రైల్వే శాఖకే ప్రయోజనం ఎక్కువగా వుంటుందని ఆయన అన్నారు

రాష్ట్రావసరాల దృష్టిలో చాలా ముఖ్యమైనవే కాక, రైల్వే శాఖకుకూడా చాలా ప్రయోజనకరమైనవై ఈ రెండు లైనులూ అనీ, ఎంతమాత్రం అశ్రద్ధ వహించకుండా త్వరగా యీ లైనులను వేయించవలసిందనీ, ఏడెనిమిదేండ్లగా మేము సూచిస్తూనే వున్నాము

రైల్వే సౌకర్యాల విషయంలో ఆంధ్రదేశపు అవసరాలను కేంద్రప్రభుత్వం ఏమాత్రమూ పరిగణించడం ఇంతవరకూ జరుగలేదు. స్వాతంత్ర్యం రాకముందు ఆంధ్రదేశంలో ఏ రైలు దార్లు వున్నాయో, యీనాడుకూడా అవే – అంతే వున్నాయి. తక్కిన రాష్ట్రాల విషయంలో, రైల్వే శాఖకు ఆదాయం చేకూర్చేవి కాకపోయినా ప్రజల సదుపాయాలకొరకు కొత్త లైనులను వెయ్యడం జరిగింది.

దక్షిణదేశంలోనే రైల్వేలైనులు కొన్ని రాష్ట్రాలలో, ఆంధ్రరాష్ట్రం కంటె చాలా ఎక్కువగా వున్నాయన్నమాట అందరికీ తెలిసిందే. ఆంధ్రప్రదేశ్‌లో ప్రతి నూరు చదరపు మైళ్ళకూ 2.7 మైళ్ళ పొడవు రైలుదారి వుంటే మదరాసు రాష్ట్రంలో ప్రతి నూరు చదరపు మైళ్ళకూ 4 2 మైళ్ళ పొడవు రైలుదారి, కేరళలో ప్రతినూరు చదరపు మైళ్ళకూ 3.6 మైళ్ళ పొడవు రైలుదారి ఉన్నాయి

ప్రజల ప్రయాణ సౌకర్యాలకే కాక, సరకుల రవాణాకు, ముఖ్యంగా పల్లెల నుంచి పాలు, కూరగాయలు, పట్టణాలకు చేరవెయ్యడానికి రైలుదారి చాలా అవసరము

ఈనాడు ఆంధ్ర రాజధానికి, ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని ప్రాంతాలనుంచీ సులువుగా, శీఘ్రంగా, చుట్టూతిరిగిపోకుండా చేరుకోవాలంటే రైలుదారిలేదు. ఒంగోలు నుంచి నాగార్జున సాగర్ మీదుగా హైదరాబాద్‌కు రైలుదారి వేస్తే, ఆంధ్రదేశంలోని దక్షిణ ప్రాంతంనుంచి రాజధానికి ఎకాఎకి ప్రయాణానికి వసతి ఏర్పడడమే కాక, మధ్యలో మూడు జిల్లాలకు రాకపోకలకూ, వ్యాపారానికీ సదుపాయం ఏర్పడుతుంది. రైలుదారివున్న ప్రాంతాలలోని ప్రజలు నిత్యావసర సామగ్రిని రాజధానికి పంపి, నాలుగు డబ్బులు సంపాదించుకోవడానికి అవకాశం వుంటుంది.

పైగా, నాగార్జున సాగర్ ఆయకట్టు వల్ల పండే ధాన్యం ఎగుమతికి ఒకపెద్ద సౌకర్యం వుంటుంది. రైలు స్టేషనులు వున్న ప్రతిఊళ్ళోనూ చిన్న చిన్న వ్యాపారాలు వృద్ధిలోకి వస్తాయి ప్రజలకు వృత్తులు దొరుకుతాయి ఎంతోమంది బాగుపడతారు ప్రజలు బాగుపడితే, ఎక్కువగా ప్రయాణాలు చేస్తారు. రైల్వేశాఖ ఆదాయంకూడా పెరుగుతుంది

ఒంగోలునుంచి హైదరాబాదుకు రైల్వేలైను వెయ్యడంలో, నెల్లూరు జిల్లాలోని ఉదయగిరిని ఒంగోలుకు కలిపే ఆలోచనకూడా పెట్టుకోవడం మంచిది. అలాగే బైలదిళ్ళ నుంచి భద్రాచలం వరకు రైలు దారిని వెయ్యడంలో, భద్రాచలంను నేరుగా కాకినాడతో కలిపే ఆలోచనకూడా పెట్టుకోవడం మంచిది, అంతేకాదు–

భద్రాచలంనుంచి గోదావరి మీదుగా హైదరాబాద్‌కు సరాసరి రైలుదారి వేస్తే, ఆ ప్రాంతంలోని మూడు జిల్లాలకు సౌకర్యం ఏర్పడుతుంది.

పెద్ద రైలుదార్ల మాట ఇది. ఈ పెద్దలైనులు కాక, నెల్లూరు నుంచి ముద్దనూరు వరకు, ఆత్మకూరు, బద్వేలు, మైదుకూరు, ప్రొద్దుటూరు, జమ్మలమడుగుల మీదుగా ఒక లైను వేసినట్లయితే, నెల్లూరు, కడప జిల్లాల అభివృద్ధికి ఎంతో అనుకూలంగా వుంటుంది.

కొత్త రైల్వే లైనులను వెయ్యడానికి వందల కోట్ల రూపాయలు ఖర్చుఅయే మాట నిజమే. కాని, యీనాడు రైల్వే లైనుల నిర్మాణానికి మనం విదేశాలనుంచి దిగుమతి చేసుకోవలసిన సామగ్రి ఎక్కువ ఏమీలేదు. ఎంత డబ్బు ఖర్చుపెట్టినా, అదంతా మన దేశంలోనే వుంటుంది. పైగాఖర్చుపెట్టినదంతా ఉత్తరోత్తరా, రైల్వే శాఖకు తిరిగి వచ్చేస్తుంది.

ఈనాడు ఆంధ్ర దేశంలోని రైలుదారులు, బ్రిటిషు ప్రభుత్వంవారు వేసినవీ, హైదరాబాదు నవాబు వేసినవే కాని, స్వతంత్ర భారత ప్రభుత్వం వేసినది ఒక్క మైలుకూడా లేదు. మూడు పంచవర్ష ప్రణాళికలను అమలుజరుపడం జరిగినా, రైల్వేల అభివృద్ధి పేరుతో 3000 కోట్ల రూపాయిలను యీ ప్రణాళికలలో ఖర్చుపెట్టినా, గత 20 ఏళ్ళలోనూ భారతదేశం మొత్తంలో సుమారు 3000 కిలోమీటర్ల కొత్త రైలుదారి వెయ్యడం జరిగినా, ఆంధ్ర దేశంలో ఒక్క కిలోమీటరు రైలుదారికూడా అదనంగా వెయ్యడం గాని, చెప్పుకోదగిన రైలు సౌకర్యాల అభివృద్ధిగాని ఏమీ జరుగలేదు.

రైలు దారుల అభివృద్ధిగాని, రోడ్ల అభివృద్ధిగాని, రేవుల అభివృద్ధిగాని, పరిశ్రమల అభివృద్ధిగాని, ఆంధ్రదేశంలో గత 20 సంవత్సరాలలోను ఏం జరిగింది అని చూస్తే, కేంద్ర ప్రభుత్వ సహాయం ఏమివచ్చింది—అని చూస్తే ఏమీ కనబడదు.

రైల్వేలైనుల విషయంలోనైనా ఏదో చేస్తామని రైల్వే మంత్రి చెప్పడం, సంతోషకరమే. కాని, చెప్పిన మాటను అంతతో పోనివ్వక, తగిన కార్యక్రమాలను వెంటనే ప్రారంభిస్తే, ఆంధ్రులు సంతోషిస్తారు.



# చిత్ర వార్తలు



సెప్టెంబరు 3 వ తేదీన రాష్ట్రపతి డా॥ జాకీర్ హుస్సేన్ ఉదకమండలం వెళ్తూ, బేగంపేట విమానాశ్రయంలో ఆగినప్పుడు రాష్ట్ర గవర్నరూ, ముఖ్యమంత్రీ స్వాగత మిచ్చారు.

---

జాతి విచక్షణ నిర్మూలించటం గురించి ఐక్యరాజ్యసమితి గోష్ఠికి హాజరయిన ప్రతినిధులు న్యూఢిల్లీలో డాక్టర్ నీలం సంజీవరెడ్డిని కలుసుకున్నప్పటి చిత్రం.





గాంధీ శత జయంతి సందర్భంలో వచ్చేయేడు ఏర్పాటయ్యే 'గాంధీ దర్శన్' ప్రదర్శనం నమూనా ప్రధాన మంత్రి తిలకిస్తున్న దృశ్యం.

---

ఉపరాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి న్యూఢిల్లీలో ఇటీవల నేతాజీ చిత్ర పటాన్ని ఆవిష్కరిస్తున్నప్పటి చిత్రం.



# బాపూజీ శతజయంతి

ప్రతీతరమూ, తనకు కావలసిన నాయకత్వాన్ని తనే సృజించుకొంటుందని పెద్దల వాక్కు. ఈ నానుడి అక్షరాలా సత్యమనిపించిన వారు పూజ్య బాపూజీ.

19వ శతాబ్ద పూర్వార్ధంలోనే ఆంగ్లేయ ప్రభుత్వం, మన దేశంలో స్థిరపడి పోయింది. పరాయి ప్రభుత్వంమీద చెదురుమదురుగా అసంతృప్తిని వెల్లడించిన సంఘటనలు కొన్ని జరిగిన మాట నిజమే! కానీ-వీటికొక మౌలికమైన ఆశయం లేదు.

బాపూజీ రాజకీయరంగంలో ప్రవేశించడంతో, అంతకాలంగా, స్పష్టాస్పష్టంగా వున్న భారతీయుల ఆశలకూ, ఆశయాలకూ, ఒక నిర్దిష్టమైన రూపం లభించింది. తొలిసారిగా ప్రపంచ చరిత్రలో, సత్యాగ్రహాన్ని ప్రారంభించినది బాపూజీ! సాత్వికవిధానం ద్వారా, అహింసద్వారా, అనూహ్యమైన, అమోఘమైన సత్ఫలితాలను సాధించింది బాపూజీ.

స్వాతంత్ర్య పోరాటం, మేధావివర్గానికీ, కులీనవర్గానికీ మాత్రమే పరిమితమయి ఉండడంవల్ల, ప్రయోజనం లేదని గ్రహించినవారు గాంధీజీ. మధ్యతరగతి ప్రజలనూ, పీడితతాడిత జనావళినీ, తన మహోద్యమంలోనికి ఆకర్షించిన వారు బాపూజీ. అంటరానితనాన్ని నిర్మూలించడానికి ప్రయత్నించిన మహామనీషి బాపూజీ.

ఒక్క భారతదేశమే కాదు, యావత్ప్రపంచమూ, మహాత్మునికి వినతులర్పించింది. ద్వేషాన్ని ద్వేషంతోగాక, ప్రేమానురాగాలతో జయించారాయన. దాస్యాంధకారంలో మునిగి, దోవ తెలియక, కొట్టుమిట్టాడుతున్న కోట్లాది ప్రజలకు దివ్వటీని చేబట్టి, మార్గదర్శకులైనారు.

అఖిల విశ్వంచేత 'మహాత్మ' లనిపించుకొన్నారు.

వారి శతజయంత్యుత్సవాలను, ఈ మాసంనుండే జరుపుకొంటూ వారిపట్లగల శ్రద్ధాభక్తులు నివేదించుకుంటున్నది భారత ప్రజానీకం.






కొత్తగా రచనా వ్యాసంగంలోకి దిగిన వంగరచయితల్లో, నగేంద్రనాధుడికి మంచి పేరూ ప్రఖ్యాతులూ వున్నవి. అతడు నవలా రచనలో కేవలం ఊహా కల్పనలమీద ఆధారపడడు. తాను విన్న, చూసిన వాస్తవ విషయాలమీద ఆధారపడే, అతడు నవలల్లో సంఘటనలనూ, పాత్రలనూ సృష్టిస్తూవుంటాడు.

ఇప్పు డతడు ఓ కొత్తనవల రాయాలనే సంకల్పంలో వున్నాడు. దానికి

అవసరం అయిన కథా వస్తువుకోసం నగేంద్రనాథుడు వారం రోజులుగా ప్రతి రాత్రీ రెండుజాములవరకూ కలకత్తా నగరంలో వీధులన్నీ తిరుగుతున్నాడు. అలా ఒకనాటిరాత్రి దాదాపు పండ్రెండు గంటలవేళ అతడు బారాబజారు పక్కన వున్న వంశతలాగల్లీ వెంటపోతూ ఒక వ్యక్తినిచూసి కొంచెంగా ఆశ్చర్యపడ్డాడు.

నగేంద్రనాథుడిదృష్టిని ఆకర్షించినవ్యక్తి మామూలు ద్వారపాలకులు - దర్వాన్‌లు ధరించే దుస్తులుధరించి వున్నాడు. అతడితలమీద పెద్ద పగిడీవున్నది, అంగారఖా ధరించాడు - యివి అందరు దర్వానులూ ధరించేవే. కాని, అతడి బవిరిగడ్డం ఏదో పెట్టుడు గడ్డంలా, మాయగడ్డంలా కనిపించింది, నగేంద్రనాథుడికి. అందువల్లనే అతడు కొంత ఆశ్చర్యపోయాడు.

ఆ బవిరిగడ్డంవాడికి అరవైయేళ్ళ వయస్సుంటుంది. అతడు అటూ యిటూ తిరిగి తిరిగి చూస్తూ నడిచే ధోరణివల్ల అతడికి ఆప్రాంతం కొత్తఅని తోస్తుంది. పైగా, ఆప్రాంతాల అత డెవరికోసమో వెతుకుతున్నట్టు, గోడలకింది చీకటి నీడలలోకి గుచ్చి గుచ్చి చూస్తున్నాడు.

నగేంద్రనాథుడు తనపనిమీద తాను పోతున్నవాడిలా నటిస్తూ, ఆవ్యక్తిని సమీపించాడు. బవిరి గడ్డంవాడు అతడు తన సమీపానికి రాగానే, ఏదో సంశ యిస్తున్న వాడిలా గొంతుపెట్టి, "రాణీగల్లీ ఎక్కడో తమకు తెలుసా?'' అని అడిగాడు.

ఆప్రశ్న వింటూనే నగేంద్రనాథుడు ఆగి, "తెలుసు. కాని, చెప్పినంత మాత్రాన మీరు అక్కడికి చేరలేరు. అటేపోతున్నాను, రండి!" అంటూ ముందుకు నడవసాగాడు.

ఈసారి నగేంద్రుడు ఆవ్యక్తిని దగ్గర్లోవుండి నఖశిఖపర్యంతం పరీక్షించి చూశాడు. అతడు దర్వాన్ వేషధారేకాని, దర్వాన్ కాదని అతడికి దృఢమైన అభిప్రాయం కలిగింది. అతడేదో ఉత్తర హిందూస్థానంవాడిలా వున్నాడు. చొక్కాజేబును చేతితో పట్టుకున్నతీరు చూస్తూవుంటే, అందులో ఏదో అమూల్య మైన వస్తువున్నదన్న అభిప్రాయం ఎవరికైనా కలుగుతుంది. అతడు నగేంద్రుడి వెనగ్గా కొంచెం దూరదూరంగా నడిచి రాసాగాడు. రాణీగల్లీ ఇంత రాత్రివేళ పెద్ద మనుషులైనవాళ్ళు తిరిగేచోటు కాదని నగేంద్రుడికి తెలుసు. ఆ కారణంగా అతడు యీ బవిరిగడ్డం పెద్దమనిషిమీద కన్నుంచాలని నిశ్చయించుకున్నాడు.

నాలుగైదు నిమిషాల తరవాత రాణీగల్లీ చేరగానే నగేంద్రుడు ఆగి, "అయ్యా, ఇదే రాణీగల్లీ!'' అని చెప్పాడు. కాని, ఆ బవిరిగడ్డంవాడు ఎడమవైపు నున్న

ఆగల్లీలోకి పోక, అప్పటివరకూ నడుస్తున్న బారాబజారు వెంట చకచకా ముందుకు పోసాగాడు. అతడి ప్రవర్తనకు నగేంద్రుడు ఆశ్చర్యపడి, "అయ్యా, గల్లీలోకి పోక అలా వీధివెంటే నడుస్తున్నారేం?'' అని ప్రశ్నించాడు.

"అవసరంలేదు," అంటూ బవిరిగడ్డంవాడు మరింత వేగంగా నడవసాగాడు. దానితో నగేంద్రుడికి అతడిమీద అనుమానం అధికమై, అతడెక్కడికి పోతాడో చూడాలన్న కౌతూహలంకొద్దీ కొంచెంవెనగ్గా అతణ్ణి అనుసరించి నడవసాగాడు.

బవిరిగడ్డంవాడు పోయి పోయి ధర్మాహాట్ ప్రాంతాన్ని సమీపించాడు. అక్కడ ఓ అడ్డరోడ్డు మూలతిరుగున మూడు టాంగాలు నిలబడివున్నవి. బవిరి గడ్డంవాడు ఆ టాంగాల్లో ఒకదాన్ని సమీపించి, టాంగావాడితో ఏమో మాట్లాడి, టాంగాలోఎక్కి కూచున్నాడు. టాంగా బయలుదేరింది. నగేంద్రుడు వేగంగా ఆప్రదేశాన్నిచేరి అక్కడున్న మరొక టాంగాలోఎక్కి కూర్చుని, టాంగావాడితో "అదుగో, ఆముందుపోతున్న టాంగావెనకనే పోవాలి. ఆ టాంగా మనదృష్టినుంచి తప్పుకుపోకుండా చూడు. నీకు మంచి బహుమానం యిస్తాను," అని చెప్పాడు.

ముందుపోతున్న టాంగా అటూ యిటూ నాలుగువీధులూ తిరిగి, చివరకు బయలుదేరినచోటుకే వచ్చింది. నగేంద్రుడి టాంగావాడు బండి ఆపుతూ, "హుజూర్, మనం బయలుదేరిన చోటుకే తిరిగివచ్చాం," అన్నాడు.

నగేంద్రుడు బండిదిగి, బవిరిగడ్డంవాడు ఎక్కిన టాంగా కొంచెం దూరంలో ఆగివుండటం చూసి, దాన్ని సమీపించి లోపలికి తొంగిచూశాడు. లోపల ఎవరూ లేరు. నగేంద్రుడు నిశ్చేష్టుడైపోయి మరోసారి బండీలోకిచూసి, టాంగావాణ్ణి, "నీ బండిలో ఎక్కిన మనిషి ఎక్కడ దిగిపోయాడు?" అని ప్రశ్నించాడు.

''ఆప్రశ్నకు జవాబు చెప్పవలసిన అవసరంలేదు,'' అన్నాడు టాంగావాడు కోపంగా

"నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుసా? పోలీస్!" అన్నాడు నగేంద్రనాథ్ అధికార స్వరంతో.

టాంగావాడు ఆజవాబుతో అదిరిపోయి, "హుజూర్! ఆమనిషి అసలు టాంగా ఎక్కలేదు,'' అని జవాబిచ్చాడు.

"టాంగా ఎక్కనేలేదా?" అన్నాడు నగేంద్రుడు ఆశ్చర్యంగా

"అవును, హుజూర్! అతను నాదగ్గిరకొచ్చి, తన నెవరో దుర్మార్గుడు వెన్నంటి వస్తున్నాడనీ, కనుక తానిచ్చే రెండు రూపాయలూ తీసుకుని ఖాళీబండిని నాలుగు వీధులూ తిప్పి యిక్కడికే తీసుకురమ్మన్నాడు. ఈ లోపల తనకేదో చిన్నపని

వున్నదనీ, ఆ పనిచూసుకుని యిక్కడికి తిరిగివచ్చి, టాంగాకోసం ఎదురు చూస్తూంటాననీ చెప్పాడు. తరవాత మరెక్కడికో పోవలసి వున్నదన్నాడు. ఈమాటలుచెప్పి, రెండు రూపాయిలూ నాకిచ్చి టాంగాలో వెనకనుంచి ఎక్కి, ముందుభాగంనుంచి దిగి, చీకట్లో ఏటో వెళ్ళిపోయాడు.'' అని చెప్పాడు టాంగావాడు.

ఇందులో ఏదో గొప్ప నిగూఢరహస్యం వున్నదని, నగేంద్రుడు భావించాడు. అతడు యింతకుముందు మొదటిసారిగా ఆప్రదేశానికి వచ్చినప్పుడు అక్కడ మూడు టాంగాలు నిలిచివున్నవి. వాటిల్లో ఒకటి తనూ, రెండవదానిని బవిరిగడ్డం వాడూ ఉపయోగించుకున్నారు. కాని, మూడవ టాంగా ఎటుపోయినట్టు?

ఈప్రశ్న మనస్సులో మెదలగానే నగేంద్రుడు టాంగావాణ్ణి, ఆ మూడోవాణ్ణి గురించి అడిగాడు. "వాడు కిరాయిదొరికితే వెళ్ళివుంటాడు, హుజూర్!" అన్నాడు టాంగావాడు.

నగేంద్రుడు ఓక్షణకాలం ఆలోచించి, "ఒరే, నీలాంతరు పట్టుకుని ఒకసారి నావెంటరా. అలా రాణీగల్లీలోకి ఒకసారి వెళ్ళివద్దాం," అన్నాడు.

టాంగావాడు బండినుంచి వేలాడుతున్న లాంతరు తీసుకుని నగేంద్రుడువెంట బయలుదేరాడు. వాళ్ళు రాణీగల్లీచేరి, గల్లీవెంట ఓ నూరడుగులదూరం పోయేసరికి, ముందు నడుస్తున్న టాంగావాడు అదిరిపడి "అయ్యో, ఇదేమిటి?" అంటూ అరిచి లాంతరును కిందికిదించాడు. నగేంద్రుడు గబాగబా రెండడుగులు ముందుకు వేసి, లాంతరు వెలుగులో రక్తసిక్తమై పడివున్న మానవాకారా నొకదాన్ని చూశాడు. బాగా పరీక్షించి చూసినమీదట ఆ మరణించినవ్యక్తి, త నెవరికోసమైతే తిరుగుతున్నాడో, అతడే అని నగేంద్రుడికి తెలిసిపోయింది. అతడి గుండెల్లో ఎవరో కత్తితో బలంగా పొడిచారు.

నగేంద్రుడు చప్పున గల్లీలోంచి పెద్దవీధిలోకి వచ్చి గస్తీపోలీసు లెవరైనా కనబడతారేమో అని చూసేంతలో, ఇద్దరు పోలీసులు అటుకేసేరావటం కంట బడింది. నగేంద్రుడు వాళ్ళను త్వరగారమ్మని కేకవేసి, గల్లీలో హతుడైన వ్యక్తి దగ్గరకు తీసుకుపోయాడు. శవాన్నిచూసి పోలీసుల్లో ఒకడు ఠాణాకు పరిగెత్తాడు

పావుగంట గడిచీ గడవకముందే ఇన్‌స్పెక్టర్ నలుగు రైదుగురు పోలీసులతో అక్కడికివచ్చి, శవాన్ని ఠాణాకు పంపించి, టాంగావాణ్ణి. నగేంద్రుణ్ణి వెంట పిలుచుకుపోయి, వారిపేర్లు నమోదు చేసుకుని, తెల్లవారి పిలుపొస్తుందని చెప్పి, పంపేశాడు.

# 2

మర్నాటి ఉదయం ఎనిమిది గంటలవేళ నగేంద్రుడు ఇంటివరండాలో కూర్చుని పత్రికలు చదువుకుంటూ వుండగా, ఓ నలుబదేళ్ళ వ్యక్తి — ఆజానుబాహువూ, బలిష్ఠుడూ అయినవాడు, అతణ్ణి సమీపించి నమస్కారం చేస్తూ, "తమరేనా, నగేంద్రనాధ్? నేను డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ అక్షయకుమార్‌ను," అన్నాడు.

నగేంద్రుడు కుర్చీలోంచి లేచి, అక్షయకుమారుణ్ణి ఆహ్వానిస్తూ, "తమ పేరు లోగడే విని వున్నాను దయచేయండి, యిలా యీ కుర్చీలో కూర్చోండి," అన్నాడు.

అక్షయకుమార్ కుర్చీలో కూర్చుని, ''తమ పేరు నేను విన్నాను. తమ నవలలు ఒకటి రెండు చదివానుకూడా. ప్రస్తుతం నేను వచ్చినపని రాత్రి రాణీగల్లీలో జరిగిన హత్య గురించి తమతో మాట్లాడేందుకు," అన్నాడు.

''నేను చూసినదంతా వివరంగా మీకు చెపుతాను. కాని, నాదొక కోర్కెఉన్నది—తమరు అంగీకరించాలి," అన్నాడు నగేంద్రుడు.

''కోర్కె... నన్ను మీరు కోరటమా? సెలవివ్వండి," అంటూ అక్షయకుమారుడు చిరునవ్వు నవ్వాడు

''నేను నవలా రచయితనని తమకు తెలుసు నన్నందుకు చాలా సంతోషం. నేనిప్పుడు ఒక డిటెక్టివ్ నవల రాయాలనుకుంటున్నాను. ఈ రాణీగల్లీ హత్య విషయంలో తమరుచేసే పరిశోధనలో నన్నుగూడా పాల్గొనవిచ్చినట్టయితే — అది నా రచనకు ఎంతగానో ఉపకరిస్తుంది," అన్నాడు నగేంద్రనాధుడు.

డిటెక్టివ్ అక్షయకుమారుడు ఆశ్చర్యపడుతున్నవాడిలా నగేంద్రుడి ముఖంకేసి ఓ క్షణకాలంచూసి కొంచెంసేపు మౌనంగా వూరుకుని, "మీ కోర్కెను తిరస్కరించే సాహసం నాకు లేదు. కాని, ఒక షరతు పెట్టబోతున్నాను. ఈ హత్యకేసు పరిశోధన విషయంలో మీరు నే చెప్పిన విధంగానే నడుచుకుంటూండాలి. అందుకు సమ్మతమేనా?" అని ప్రశ్నించాడు.

"సమ్మతమే. మీ సూచనలకు అనుగుణంగా నా చేతనైన సాయం చేస్తాను,'' అన్నాడు నగేంద్రుడు.

డిటెక్టివ్ అక్షయకుమారుడు ఒకటి రెండు నిమిషాల కాలం ఆలోచిస్తూ వుండిపోయింతరవాత, "రాణీగల్లీలో మారువేషధారిని హత్య చేసినవా శ్వెవరో నాకు తెలుసు,'' అన్నాడు.

"మీకు హంతకుడు తెలుసా? పట్టుకోవటంకూడా జరిగిందా?" అంటూ నగేంద్రు డెంతో ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"హంతకుడు కాదు, హంతకి. ఆమెకూడా హత్య చేయబడింది," అన్నాడు అక్షయకుమారుడు తాపీగా.

"అంటే రాత్రి ఒకే సమయంలో రెండు హత్యలు జరిగినై అన్నమాట!" అంటూ నగేంద్రుడు మరింత ఆశ్చర్యపోయాడు.

"దర్వాన్ వేషధారి హత్య రాణీగల్లీలో రాత్రి పంద్రెండు ఒంటిగంటల మధ్య జరిగింది. స్త్రీ హత్య ఒంటిగంటా రెండుగంటల మధ్య గంగానది ప్రక్కనున్న రోడ్డుకు సమీపంలో జరిగింది. శవం దాదాపు నీటిఒడ్డున పడివున్నది." అన్నాడు అక్షయకుమారుడు.

"అలా అయితే హంతకుడు శవాన్ని గంగానదిలో పారేసేందుకు ప్రయత్నించి వుంటాడు. కాని..."

"నేనూ అదే వూహిస్తున్నాను. హంతకుడు శవాన్ని నీటిలో వేసేందుకు తీసుకుపోతూ వుండగా, అటుకేసి ఎవరో వచ్చివుంటారు. వాడు భయపడి శవాన్ని నీటిఒడ్డునే వదిలి పారిపోయి వుంటాడు," అన్నాడు అక్షయకుమారుడు.

"ఈ రెండు హత్యలకూ సంబంధం వుందనేగా మీ అభిప్రాయం?" అన్నాడు నగేంద్రనాధుడు.

"అలాగే కనబడుతున్నది," అంటూ అక్షయకుమారుడు జేబులోంచి చీరెముక్క ఒకదాన్ని బయిటికి తీసి నగేంద్రుడిముందు పెట్టాడు. అది హిందూస్థానీ స్త్రీలు కట్టుకునే చీరెలకు సంబంధించిన చిరిగిపోయిన ముక్క.

ఈ పేలిక హత్య చేయబడిన దర్వాన్ ఎడమచేతి పిడికిలిలో వున్నది. అతడు హాత్యా సమయంలో హంతకురాలితో పెనుగులాడినప్పుడు అతడి చేత చిక్కి వుంటుంది ఇంత ముదురురంగు చీరెలు మన వంగ వనితలు ధరించరు. ఆ కారణంవల్ల హంతకురాలు హిందూస్థానీ స్త్రీయన్న నిర్ణయానికి వచ్చాను. తరువాత గంగఒడ్డున పడివున్న స్త్రీశవాన్ని చూచినప్పుడు, ఆ స్త్రీ ధరించిన చీరెలోనిదే యీ చిరిగిన ముక్క అని తెలిసిపోయింది." అన్నాడు అక్షయకుమారుడు.

"మరి ఆ హంతకిని వధించిన వాళ్లెవరై వుంటారు?" అన్నాడు నగేంద్రుడు.

"అదే మనం పరిశోధించవలసిన విషయం. శవాలను గుర్తించవలసి వున్నది. రెంటికీ ఫోటోలు తీయించాను. దర్వాన్ వేషధారి ధనికుడిలా కనిపిస్తున్నాడు. పైన తొడిగినచొక్కా దర్వాన్‌లు తొడిగేదే. కాని, లోపల విలువగల వస్త్రంతో



కుట్టించిన చొక్కా ధరించాడు దానిమీద జోరాశాంక్‌లో వున్న బోసు కంపెనీ వాళ్ళ ముద్రవున్నది. అక్కడ విచారిస్తే అతిడెవరైనదీ తెలిసే అవకాశంవున్నది. స్త్రీసంగతి తెలుసుకోవటంలోనే చాలా చిక్కులు ఎదురయేలా వున్నవి," అన్నాడు అక్షయకుమారుడు.

"ముందు బోసు కంపెనీకి పోయి ఆ పురుషుడిసంగతి తేల్చుకోవటం మంచిది. తరవాత స్త్రీ గురించి..."

నగేంద్రుడు మాట ముగించేలోపలే అక్షయకుమారుడు జేబులోంచి సింధూరం పూసిన శివలింగా న్నొకదాన్ని బయటికితీసి, టేబుల్‌మీద పెట్టాడు. దాన్నిచూసి నగేంద్రుడు నివ్వెరపోయాడు.

"ఈ శివలింగాలు ఒకటికాదు, రెండు దొరికినై. ఇదుగో, రెండోది," అంటూ అక్షయకుమారుడు జేబులోంచి మరో శివలింగాన్ని తీసి టేబిల్‌మీద పెట్టి, "ఇందులో ఒకటి పురుషశవం పక్కన దొరికింది, రెండవది హత్యఅయిన స్త్రీ కోక కొంగున కట్టబడి వున్నది" అన్నాడు.

నగేంద్రుడు కొంచెంసేపు ఆలోచించి "నా మిత్రుడొకడున్నాడు. అతడు యీ దేశపు దేవతల గురించీ, దేవుళ్ళను గురించీ చాలా పరిశోధన చేశాడు. అతడికి

వీటిని చూపితే - శవం పక్కన ఇవి వుండటంలోగల రహస్యం ఏమిటో చెప్ప గలడని నా నమ్మకం." అన్నాడు.

"అయితే, మీ మిత్రుడికి ఒక శివలింగం తీసుకుపోయి చూపెట్టండి. సరే, రాత్రి జరిగినదంతా యిప్పుడు నాకు వివరంగా చెప్పండి," అని అడిగాడు అక్షయ కుమారుడు.

నగేంద్రుడు తాను రాత్రి పదిగంటలవేళ ఇంటినుంచి బయలుదేరినప్పటి నుంచీ, రాణీగల్లీ లో హత్య చేయబడినవాణ్ని చూడటంవరకూ సవివరంగా అక్షయకుమారుడికి చెప్పాడు. అక్షయకుమారుడు, నగేంద్రుడు చెప్పినదంతా శ్రద్ధగా వింటూ మధ్యమధ్య నోట్ పుస్తకంలో కొన్నివివరాలు రాసుకుని, "నగేంద్ర మహాశయా! మీ రా ప్రాంతానికి వెళ్ళినప్పుడు అక్కడ మూడు టాంగాలున్నవిగదా? ఒకటి మీరూ, రెండవది ఆ బవిరిగడ్డం దర్వాన్ వేషధారీ ఉపయోగించారు ఆ మూడవ టాంగావాడి మాటేమిటి?" అని ప్రశ్నించాడు.

"అతణ్నేం చేసయినా విశేషాలు తెలుసుకో వచ్చుననా, మీ అభిప్రాయం?" అని అడిగాడు నగేంద్రుడు.

"అదే అనుకుంటున్నాను. దర్వాన్ వేషధారిని హత్య చేసింతరవాత ఆ స్త్రీ ఆ ప్రాంతాన్నుంచి పారిపోవాలంటే, ఆమెకు అందుబాటులో వున్నది, ఆ టాంగాయే గదా?" అన్నాడు అక్షయకుమారుడు.

"నిజమే. కాని, వాణ్ణి పట్టుకోవటం ఎలా?"

"అదేమంత కష్టంకాదులెండి. మళ్ళీ కలుసుకుంటాను," అంటూ డిటెక్టివ్ అక్షయకుమారుడు కుర్చీలోంచి లేచాడు

"మళ్ళీ మీ దర్శనం ఎప్పుడు?"

"నేనీ సాయంత్రమే వస్తాను, మీరు మాత్రం యీలోపల యీ పాకెట్లో వున్న దర్వాన్ శవంమీది చొక్కా తీసుకుని అ బోసుకంపెనీకి వెళ్ళరండి ఆ శివ లింగాలను మీ రనే ఆ పండిత మిత్రుడికి చూపించండి," అన్నాడు అక్షయకుమారుడు.

# 3

భోజనానంతరం నగేంద్రనాథుడు శివలింగాన్ని జేబులో వేసుకుని తన మిత్రుడి ఇంటికి వెళ్ళాడు. ఆ మిత్రుడు నగేంద్రుణ్ణి ప్రేమపూర్వకంగా ఆహ్వానించి, "ఏం, నగేన్! చాలా రోజులతరవాత కనిపించావ్, ఏమిటీ విశేషం?" అని అడిగాడు.

నగేంద్రనాథుడు జేబులోంచి శివలింగాన్నితీసి మిత్రుడికిచూపుతూ, "ఈ కుంకం పూసిన శివలింగాల సంగతి నీ కేమైనా తెలుసా?" అని అడిగాడు.

నగేంద్రుడి మిత్రుడు శివలింగాన్ని అందుకుని కొద్దిసేపు పరీక్షించి చూసి, "సింధూరం పూసిన యీ సాలగ్రామం నీ కెక్కడ దొరికింది?" అని ప్రశ్నించాడు.

"అదంతా తరవాత చెపుతాను, నువ్వనే యీ సాలగ్రామాలను వెంటబెట్టుకు తిరిగే మతసాంప్రదాయం కలవాళ్లు ఎక్కడున్నారో చెప్పగలవా?" అని అడిగాడు నగేంద్రుడు.

"పంజాబులో యిలాంటి ధర్మసాంప్రదాయం వున్నది. వాళ్ళు కావటానికి శైవులైనా, వాళ్ళ కార్యకలాపాలు తంతు శాక్తేయుల ధోరణిలో వుంటుంది. ఆ శాఖ వాళ్ళ దగ్గర యిలాంటి సాలగ్రామాలుంటవి. వాళ్ళల్లో ఎవరైనా గొప్పనేరం చేస్తే వాళ్ళను నిర్దయగా వధిస్తారు. శవం పక్కన యిలాంటి సాలగ్రామా న్నొకదాన్ని వదిలిపోతారు. దాని అర్థం ఏమిటంటే హతుడు సాంప్రదాయ విరుద్ధమైన కార్యమేదో చేసి, స్వమతస్థులవల్ల తగిన శిక్షపొందాడని" చెప్పాడు నగేన్ మిత్రుడు.

''ఆహాఁ, అంతా అర్థమైపోయింది,'' అంటూ నగేన్ చిన్నగా కేకపెట్టాడు.

"ఏమిటి నీ కర్థమైంది? అసలీ సాలగ్రాం నీ దగ్గర కెలా వచ్చింది?" అని ప్రశ్నించాడు మిత్రుడు.

నగేంద్రుడు తన మిత్రుడికి రాత్రి జరిగిన రెండు హత్యలను గురించీ చెప్పి, శవాల దగ్గర యీ శివలింగాలు దొరికినట్టు తెలియబరిచాడు. తరవాత తను యీ హత్యాపరిశోధనల్లో డిటెక్టివ్ అక్షయకుమారుడికి సహాయపడుతున్నట్టు చెప్పి, మళ్ళీ త్వరలోనే కలుసుకుంటానని మిత్రుడికి మాట యిచ్చి, అక్కణ్ణించి సరాసరి బోసు కంపెనీకి వెళ్ళాడు.

సమయానికి బోసు కంపెనీ యజమాని షాపులోనే వున్నాడు. నగేంద్రు డాయనకు అక్షయకుమారు డిచ్చిన చొక్కా చూపించి, "ఒక హత్యాకేసు విషయంలో ఎంక్వయిరీ పనిమీద వచ్చాను. ఈ చొక్కా మీ రెవరికి కుట్టించి యిచ్చారో చెప్పగలరా?" అని అడిగాడు.

"ఈ రకం వస్త్రం మా ఖాతాదారులలో ఒకరే తరుచుగా కొంటూంటారు గనక, యీ చొక్కా ఎవరికి కుట్టామో చెప్పగలను. ఇది యిక్కడ కుట్టించిన వారు బారాబజారులోని హుజారీ మల్లుబాబు. ఆయనకు అక్కడ ఒక పెద్ద కొట్టున్నది, కాపరం మాత్రం చందననగరంలో,'' అన్నాడు షాపు యజమాని.

"థాంక్స్! తమర్ని మరోసారి కలుసుకుంటాను," అని చెప్పి నగేంద్రనాథుడు షాపునుంచి బయటకు రాగానే, డిటెక్టివ్ అక్షయకుమారుడు అటువేపే రావటం కనిపించింది, నగేంద్రుడు షాపుముందే నిలబడ్డాడు.

అక్షయకుమారుడు అతణ్ణి సమీపిస్తూనే, "హంతకులు ఒకరుకాదు, ఇద్దరు," అన్నాడు.

"ఇద్దరా? ఎలా తెలిసింది?" అన్నాడు నగేంద్రుడు.

"ఇంతకుముందే ఆ మూడవ టాంగావాణ్ణి పట్టుకున్నాను. రెండు టాంగాలూ అక్కణ్ణించి వెళ్ళిపోగానే, వాడు బాడుగేమైనా దొరుకుతుందేమోనని అక్కడే వుండిపోయాడట. కొంత సేపటికి ఒక పురుషుడూ, ఒక స్త్రీ రాణీగల్లీ వైపునుంచి వచ్చి, అతడి టాంగా ఎక్కి, హౌరాస్టేషనుకు పొమ్మని-అక్కడ బండి దిగి పోయారట," అన్నాడు అక్షయకుమారుడు.

"టాంగావాడు వాళ్ళ ముఖాలను బాగా చూశాడా? గుర్తుపట్టగలడా?" అని అడిగాడు నగేంద్రుడు.

"చీకటివల్ల బాగా గుర్తించలేకపోయాననీ, ఆడదానికన్న మగవాడే ఎక్కువ తత్తరపడుతున్నట్టు కనబడ్డాడనీ, వాడు చెపుతున్నాడు."

"అయితే, దర్వాను వేషధారిని కత్తితో పొడిచినవాడు పురుషుడే అయి ఉంటాడు," అన్నాడు నగేంద్రుడు.

"కావచ్చు. ఆ చొక్కాచూసి బోసు కంపెనీవాళ్ళు ఏమన్నారు?"

"దానిని బారాబజారులో గొప్ప వ్యాపారస్థుడైన హుజూరీమల్లుకు కుట్టిచ్చామని వాళ్ళంటున్నారు. అంతగొప్ప వ్యాపారి దర్వాన్ వేషం వేసుకుని అంత రాత్రివేళ రాణీగల్లీకిపోయి హత్య కావలసిన అవసరం ఏం కలిగిందో నా కర్థం కావటం లేదు" అన్నాడు నగేంద్రుడు.

"హుజూరీమల్లు గొప్ప ధనికుడనే కాదు, ధర్మాత్ముడూ, పుణ్యాత్ముడూ అన్న పేరు కూడా వుంది. పుణ్యాత్ములకు బలవన్మరణం అన్నారు. సరే, అతడి హుజూరీ మల్ గణేశమల్ కంపెనీ ఉన్నచోటు నాకు తెలుసు. పోదాం పదండి," అంటూ డిటెక్టివ్ అక్షయకుమారుడు బయలుదేరాడు.

ఇద్దరూ హుజూరీమల్లు షాపుదగ్గిరకు వచ్చేసరికి, అక్కడ వ్యాపారం యథా ప్రకారం సాగిపోతూ ఉండటం కనిపించింది. హత్య చేయబడినవాడు ఒకవేళ హుజూరీమల్లు కాదేమో అన్న సంశయం నగేంద్రుడికి కలిగింది. అతడు తన సంశయం గురించి అక్షయకుమారుణ్ణి ప్రశ్నించబోయేంతలో అక్షయుడు సరాసరి షాపులోకి దారితీసి, ఒకక్కడ ఒక టేబిల్ ముందు కూర్చుని, సరుకు అమ్మకం తాలూకూ డబ్బులు తీసుకుంటున్న ఒక యువకుణ్ణి సమీపించి, "మేం గంగామల్లు బాబును చూడాలి? వా రెక్కడున్నారు?" అని ప్రశ్నించాడు.

"నాయనగారు వారంరోజుల క్రితం కాశీవెళ్ళారు. హుజూరీమల్‌జీ కూడా లేరు. వారు పనిమీద రాత్రి ఆగ్రా వెళ్ళారు. అక్కడా మాకు ఒక షాపు ఉన్నది." అన్నాడు యువకుడు.

"హుజూరీమల్లుజీ ఆగ్రా వెళ్ళలేదు, రాత్రి యీ నగరంలోనే హత్య అయారు" అన్నాడు అక్షయకుమారుడు గంభీరంగా.

"మల్లుజీ ఖూనీ అయాడా?" అంటూ ఆ యువకుడు నివ్వెరపోయి, "తమ రెవరు?'' అని ప్రశ్నించాడు.

"డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ అక్షయకుమార్‌దత్తు"

ఆ పేరు వింటూనే యువకుడి ముఖం వెలవెల పోయింది. అక్షయకుమారుడు అతణ్ణి చేయిపట్టుకుని కుర్చీలోంచి లేపి, పక్కనేవున్న ఒక ఖాళీ గదిలోకి నడుపుతూ, ''తమ పేరేమిటి?'' అని ప్రశ్నించాడు.

యువకుడు వణుకుతున్న గొంతుతో, "లలితాప్రసాదు,'' అని చెప్పి, "మల్లుజీని ఖూనీ చేసినవాడు దొరికాడా?'' అని అడిగాడు.

"ఆయనను హత్యచేసినది స్త్రీ," అన్నాడు అక్షయకుమారుడు.

''స్త్రీయా? అసంభవం! నా అభిప్రాయం–" అంటూ ఏమో చెప్పబోయిన వాడల్లా ఆగి, "ఆ స్త్రీ పట్టుబడిందా?" అని ప్రశ్నించాడు లలితాప్రసాదు.

"లేదు. ఆమె కూడా హత్య చేయబడింది."

ఆ జవాబుకు లలితాప్రసాదు గడగడవణకటం, అక్షయకుమారుడూ, నగేంద్రుడూ గమనించారు. అక్షయకుమారుడు ఓ క్షణకాలం లలితాప్రసాదును ఆపాదమస్తకం పరీక్షగా చూసి, ''హుజూరీమల్లుకు భార్య వున్నదా?'' అని ప్రశ్నించాడు.

"వున్నది. మొదటి భార్య పోయింతరవాత, మూడు నాలుగు సంవత్సరాల క్రితం పంజాబు వెళ్ళి మరో వివాహం చేసుకువచ్చాడు"

పంజాబు పేరు వింటూనే అక్షయ నగేంద్రులు ముఖముఖాలు చూసుకున్నారు. "ఆయనకు పిల్లలెందరు?" అని ప్రశ్నించాడు అక్షయకుమారుడు.

పిల్లలు లేరు. ఆయన తన వదినె కూతుర్ని పెంచుకుంటున్నాడు."

"మల్లుజీ రెండవభార్య వయస్సెపాటి?"

''ముప్పదీ ముప్పదిరెండు.''

"పెంపుడు కుమార్తెకు?"

"పదిహేడు"

"వివాహం అయిందా?"

"లేదు "

"వివాహం కాలేదా ?'' అంటూ అక్షయకుమారుడు ఆశ్చర్యంగా లలితాప్రసాదు ముఖంలోకి గుచ్చి గుచ్చి చూస్తూ. "ఎందువల్ల వివాహంకాలేదు ?" అని అడిగాడు.

ఈప్రశ్న వింటూనే లలితాప్రసాదు ముఖం కందగడ్డలా చేసుకుని, "ఇలాంటి ప్రశ్నకు నేనెలా జవాబుఛెప్పగలను ? అడుగో, వారిగుమాస్తా ఉమాచందే వస్తున్నాడు. ఆయ న్నడగండి," అంటూ గదినుంచి బయటికిపోయాడు.

అక్షయకుమారుడు అతణ్ణి ఆగమని హెచ్చరించి. "మీరు మావెంట రావలసి వున్నది. శవాన్ని గుర్తించాలి,'' అన్నాడు

అంతలో ఉమాచంద్ అక్కడికి వచ్చాడు అతడు పాతికేళ్ళ వయసువాడు, బలిష్ఠుడు, స్ఫురద్రూపి. అక్షయకుమారు డతడితో, ''రాత్రి మీయజమాని రాణీ గల్లీలో హత్యచేయబడిన సంగతి మీకు తెలుసా ?" అని ప్రశ్నించాడు.

''హత్యా '' అదేమిటి ? ఆయన రాత్రి ఆగ్రావెళ్ళారు." అన్నాడు ఉమాచంద్, కళ్ళలోకి చూస్తూ.

అక్షయకుమారుడు అతడికేసి అనుమానంగా చూస్తూ, "మీరిప్పుడు విచారించి లాభంలేదు. మీ యజమానిని చంపిన హంతకుణ్ణి పట్టుకోవాలంటే, ఆయన్ని గురించి మీకు తెలిసినదంతా నాకు చెప్పవలసివుంటుంది," అన్నాడు. ఉమాచంద్ అడగండి అన్నట్టుచూశాడు.

"హుజూరీమల్లుగారి కుటుంబంలో వున్న వ్యక్తు లెందరు ?'' అని ప్రశ్నించాడు అక్షయకుమారుడు.

"ఆయనభార్య. ఆయన పెంచుకుంటున్న వదినెకూతురు యమునాబాయి – ఆమె పంజాబునుంచి వెంటబెట్టుకువచ్చిన ఒక స్త్రీ – గంగాబాయి.''

"ఆమె వయ సేపాటివుంటుంది ?''

''ఇరవై ఏళ్ళ వయసుండొచ్చు.''

"మల్లుజీ ఇంటికి తరుచు వచ్చిపోయేవాళ్ళెవరు ?''

"అలాంటి పరిచయస్తులు ఆయనకు యిద్దరే వున్నారు ఒకరు యీమధ్యనే పంజాబునుంచి వచ్చిన, గురుగోవిందసింగు, రెండవతను; యమునాదాసు ''

ఇంతవరకూ నిశ్శబ్దంగా నిలబడి అంతా శ్రద్ధగావింటున్న నగేంద్రుడు ముందుకో అడుగువేసి, ''నే నో ప్రశ్న అడగవచ్చునా ?'' అన్నాడు.

డిటెక్టివ్ అక్షయకుమారుడు అడగవచ్చునన్నట్టు తలాడించాడు.

"వారి రాకపోకల్లో ప్రేమవ్యవహారం ఏమీ లేదుగదా ?" అని అతడు ఉమాచంద్‌ను ప్రశ్నించాడు.

ఉమాచంద్, నగేంద్రుడికేసి కోపంగాచూస్తూ, "మీ ప్రశ్న నా కర్థంకాలేదు," అన్నాడు.

అక్షయకుమారుడు కల్పించుకుని, "ఇందులో అర్థం కాందేమీలేదు; హుజూరీ మల్లుజీయింట్లో ఇద్దరు కన్యలున్నారు – ఆ ఇంటికి యిద్దరు యువకులు తరుచుగా వస్తూంటారు – ఇప్పుడర్థమైందా ?" అన్నాడు.

"మల్లుజీ పెంచుకుంటున్న యమునాబాయికీ, గురుగోవిందసింగుకూ వివాహం జరిగే అవకాశంవున్నదని ఆనోటా యీనోటా విన్నాను ఒకవేళ సింగు పంజాబు నుంచి ఇందుకోసమే కలకత్తావచ్చాడేమో నేను చెప్పలేను," అన్నాడు ఉమాచంద్.

"అదిసరే, మల్లుజీ సకుటుంబంగా చందననగరంలో వుండటానికి కారణం ఏమిటి ?" అని అడిగాడు అక్షయకుమారుడు

"బహుశా, యిక్కడ షాపువెనక వున్న ఇల్లు అంత ప్రశాంతంగా వుండదని అయన భావించి వుండవచ్చు."

"ఇక్కడ ఇంట్లో ఎవరుంటున్నారు ?"

"కాపరం అంటూ ఎవరూలేరు. ఇంటికావలికి ఒక జవానుమాత్రం వుంటాడు," అన్నాడు ఉమాచంద్.

డిటెక్టివ్ అక్షయకుమారుడు అతణ్ణి మరేదో ప్రశ్నించబోయేంతలో, నగేంద్రనాధుడు జేబునుంచి శివలింగాన్నితీసి అతడికిచూపుతూ, "దీన్ని లోగడ ఎప్పుడైనా చూశారా ?" అని అడిగాడు.

శివలింగాన్ని చూస్తూనే ఉమాచంద్ ఆపాదమస్తకం వణికిపోతూ, వున్న చోటనే కుప్పలా కూలిపోయాడు.

## 4

డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ అక్షయకుమారుడు మరసటిరోజున నగేంద్రుడి ఇంటికి వచ్చి, "నగేశ్ మహాశయా ! ఈ హత్యకేసులగురించి నా పాతఅభిప్రాయాలన్నీ మార్చుకోవలసివచ్చింది," అన్నాడు.

"ఏవైనా కొత్త సాక్ష్యాధారాలు బయటపడినవా ?" అని అడిగాడు నగేంద్రుడు ఆశ్చర్యపడుతూ.

"అలాంటిదే జరిగింది. హుజూరీమల్లును హత్యచేసింది స్త్రీకాదని యిప్పుడు నేనభిప్రాయపడుతున్నాను. గంగఒడ్డున స్త్రీశవం దొరికినచోటనే, నీటిఒడ్డున ఒక

కత్తి బయటపడింది. అది పంజాబులో తయారైనది. శవం చేతిగుప్పెటలో దొరికిన చీరముక్కను, దానిపైవున్న చాకలిగుర్తుల ఆధారంగా, అది ఎవరిదో తెలుసుకున్నాను. అది చందననగరంలోవుండే హుజూరీమల్లుభార్యదని బయటపడింది. నాకు లలితా ప్రసాదుమీదా, ఉమాచంద్ మీదా కొన్ని అనుమానాలున్నవి. శివలింగాన్ని చూసి ఉమాచంద్ మూర్ఛపోవటం వింతగాలేదా ? ఈ శివలింగం పంజాబులోని ఒక సాంప్రదాయంవారిది, కత్తి ఆక్రమించి వచ్చింది. హుజూరీమల్లుభార్య పంజాబుది. ఆ పంజాబువాడే ఆయన గురుగోవిందసింగు కొంతకాలంగా హుజూరీమల్లు ఇంటికి రాకపోకలు జరుపుతున్నాడు," అన్నాడు అక్షయకుమారుడు.

"అంతా బాగానేవుంది. మీరు హుజూరీమల్లు భార్యను కలుసుకుని, ఆమెను ప్రశ్నించి కొంతభోగట్టా సంపాయించవచ్చుగదా ?" అన్నాడు నగేంద్రుడు.

"ఆపని తరవాతచేద్దాం. ముందు మనం బారాబజారుకుపోయి, హుజూరీమల్లు షాపువెనకవున్న అతడి ఇంటినౌకరును కొన్ని ప్రశ్న లడగవలసివున్నది.

అక్షయకుమార నగేంద్రులు వెళ్ళేసరికి ఇంటినౌకరు వరండాలో కూచుని కునికిపాట్లు పడుతున్నాడు. అక్షయకుమారుడు అతడికి తామెవరోచెప్పి, "మొన్న- అదే శనివారంరాత్రి మీ యజమానిని ఇంటినుంచి బయలుదేరి వెళ్ళేముందు అతణ్ణి చూడటానికెవరైనా వచ్చారా ?" అని అడిగాడు.

"తొమ్మిదిన్నరా - పదీప్రాంతాల్లో గురుగోవిందసింగు వచ్చాడు," అన్నాడు నౌకరు.

''వాళ్ళేమి మాట్లాడుకున్నారో నీకుతెలుసా ?''

''ఉహుం, నేను వినలేదు."

"సింగు వెళ్ళింతరవాత మరెవరైనా వచ్చారా ?"

"ఒక స్త్రీవచ్చింది.''

''స్త్రీయా ?" అంటూ అక్షయకుమారుడు ఆశ్చర్యపోయి, "ఎవరామె ?'' అని ప్రశ్నించాడు.

"ఆమె ఎవరో నాకు తెలియదు. మల్లుజీ ఒకోరాత్రి చందననగరంపోక, యిక్కడే వుండిపోతారు. అలాంటి సమయాల్లో ఆ స్త్రీ యిక్కడికి వస్తుంది ఆమె ముఖమైనా నే నెన్నడూ చూడలేదు. ముసుగుధరించి వస్తుంది," అన్నాడు నౌకరు.

"ముఖం చూడకపోయినా, ఆమె ఒడ్డుపొడుగులనుబట్టి యిప్పుడు కనిపిస్తే గుర్తించగలవా ?''

"చెప్పలేను. కాని, మూడు నీలపురాళ్ళు చెక్కిన వింతఉంగరం ఒకటి ఆమె ధరిస్తూవుంటుంది."

అక్షయకుమారుడు నీలపురాళ్ళ వుంగరంసంగతి తన నోటుపుస్తకంలో రాసుకుని, ఇక నౌకరునేమీ ప్రశ్నించక ఇంటిలోని గదులన్నీ పరీక్షించిచూస్తూ, ఒక గదిలోని బల్లమీద పడివున్న రైల్వేటిక్కెట్లను తీసుకుని జేబులో వేసుకున్నాడు.

తరవాత అక్షయకుమారుడూ, నగేంద్రుడూ షాపులోకి వెళ్ళేసరికి అక్కడ వారికి లలితాప్రసాదు కనిపించాడు. అక్షయకుమారుడు అతన్ని షాపులోని ఓ మూల ప్రదేశానికి తీసుకుపోయి, "లలితాప్రసాద్‌బాబూ! హుజూరీమల్లుజీ మీ అందరితో ఆగ్రా పోతున్నట్టు చెప్పి, బొంబాయి ప్రయాణం కట్టాడు. ఇవిగో, రైల్వే టిక్కెట్లు, ఒకటికాదు — రెండు!" అని చెప్పి టిక్కెట్లు నతనికి చూపాడు.

లలితాప్రసాదు నిర్విణ్ణు డయిపోయాడు. అతడినోట మాటపెలువడలేదు. అక్షయకుమారుడు చిరునవ్వు నవ్వుతూ, "మీరంత ఆశ్చర్యపడకండి. మల్లుజీ వ్యక్తిగత జీవితం ఏమంత గౌరవప్రదమైనది కాదని నా అనుమానం మీ వ్యాపారముకూడా లోపల డొల్ల యిపోయిందన్న సంశయం నాకు కలుగుతున్నది. ఆయనను రాత్రివేళల చూసేందుకు ఒక స్త్రీ యిక్కడికి వస్తూవుంటుంది. మల్లుజీ ఆమెతో మొన్న శనివారం లేచిపోయేందుకే, యీ రెండు రైల్వే టిక్కెట్లు రహస్యంగా కొన్నాడు. కాని, పాపం మృత్యువు హఠాత్తుగా ఆయన్ని పొట్టన పెట్టుకున్నది,'' అన్నాడు.

లలితాప్రసాదు తలాడిస్తూ ఓ క్షణకాలం ఆగి, తరవాత అక్షయకుమారుడికేసి దీనంగా చూస్తూ, ఏమో చెప్పబోయేంతలో. ఒకపంజాబీ — దాదాపు ముప్ఫై ఏళ్ళవాడు అక్కడికి హడావిడిగా వస్తూ, "ఏం, లలితాప్రసాదుబాబూ!" అని అతణ్ణి పలకరించాడు.

అక్షయ నగేంద్రులు ఆ పంజాబీకేసి తలతిప్పేంతలో అతడు, లలితాప్రసాదుకు మరింత దగ్గరగావెళ్ళి, "నేను హుజూరీమల్లుబాబు దగ్గరవుంచిన పదివేలరూపాయిలనోట్లూ, మీ ఇనప్పెట్టెలోంచి దొంగిలించబడినవా?" అంటూ కోపంగా ప్రశ్నించాడు

లలితాప్రసాదు పెదాలు కదిపేలోపలే, ఉమాచందు పిచ్చివాడివలె తలపీక్కుంటూ అక్కడికి పరిగెత్తుకువచ్చి, "కొంపమునిగింది!" అంటూ చిన్న కేక పెట్టాడు.

పంజాబీ లలితాప్రసాదుకేసీ, ఉమాచందుకేసీ గుడ్లురుముతూ చూసి," మల్లుజీకి దాచమని పదిహేను రోజులక్రితం పదివేలరూపాయిలనోట్లిచ్చాను. ఇవ్వాళ

వాటితో అవసరంపడి కొట్టుకువస్తే, చోరీ జరిగిందని చెపుతున్నారు. ఏమిటీ ఘోరం?'' అన్నాడు.

ఆఖరికి అక్షయకుమారుడికి అతడు గురుగోవిందసింగని స్పష్టమైంది. అతడు రహస్యం చెపుతున్నట్టు చిన్నగొంతుతో, "సింగ్‌జీ! హుజూరీమల్లుజీ ఖూనీ అయిన సంగతి విన్నారా?'' అన్నాడు.

"అవును, విన్నాను. ఆయనతోపాటు నా డబ్బుకూడా పోయింది," అంటూ సింగ్ లలితాప్రసాదుకేసి తలతిప్పి, "ప్రస్తుతం యీ కొట్టుకు కామందులు నా డబ్బిస్తారా?" అని ప్రశ్నించాడు.

లలితాప్రసాదు మాట్లాడలేదు. ఉమాచందు కల్పించుకుని, "ఆ నోట్లు మల్లుజీ చందననగరంలోని తమయింటనే దాచారు. కాని, శనివారంనాడు ఆగ్రా ప్రయాణం అవుతున్నట్టు చెప్పి, యిక్కడికి తెచ్చి నాకు చూపి ఇనప్పెట్టెలో పెట్టారు," అన్నాడు.

"ఆ డబ్బు నా దనేందుకు ఉమాచందుబాబు సాక్ష్యం వుంది,'' అన్నాడు గురుగోవిందసింగు.

"ఇది అబద్ధ సాక్ష్యంకాదు. ఆ పదివేలరూపాయిలూ పంజాబులోని ఏవో మతసాంప్రదాయం వారిపని మల్లుజీ నాతోచెప్పారు," అన్నాడు ఉమాచందు.

''అలాగా;" అంటూ నగేంద్రుడు ఉలిక్కిపడ్డాడు. అందరూ అతడికేసి తలలు తిప్పిచూశారు.

గురుగోవిందసింగు, "చోరీసంగతి మీ నాయనగారు తిరిగి వచ్చిం తరవాత వారే చూసుకుంటారు," అన్నాడు కోపంగా.

గురుగోవిందసింగు అక్కడికి వచ్చినప్పటినుంచీ కోపంతో యీసడిస్తూ మాట్లాడుతూండటం లలితాప్రసాదుకు అవమానకరంగా తోచింది అతడు సింగు ముఖంలోకి సూటిగాచూస్తూ, ''డబ్బు డబ్బు అంటూ అంత రుసరుస లాడతారేం? నే నివ్వను – అంటే మీరేం చేయగలరు?'' అన్నాడు.

"అప్పుడు మా మతసంప్రాదాయం సంగతి మీకు బాగా అర్థమవుతుంది," అంటూ గురుగోవిందసింగు గిరున వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

ఆశ్చర్యం, అంతకన్న భయంతో తబ్బిబ్బయిపోతూ సింగు పోయినవైపుకు చూస్తున్న లలితాప్రసాదు, ఉమాచందులతో డిటెక్టివ్ అక్షయకుమారుడు యిలా అన్నాడు; "ఆ సాంప్రదాయం వాళ్ళు హత్యచేసేందుకు జంకరు. హుజూరీ మల్లుజీ ఆ డబ్బుతోపాటు ఒకస్త్రీనికూడా వెంటబెట్టుకుని పలాయనం కా ప్రయత్నిం



చాడు. ఈ పంజాబు సాంప్రదాయికులు ఇద్దర్నీ హత్యచేశారు – ప్రస్తుతానికి ఇది నా ఊహ మాత్రమే "

"ఆ నోట్లనంబర్లు గురుగోవిందసింగుదగ్గర వున్నవి. వాటిని మార్చుకోగలగటం చాలాకష్టం," అన్నాడు ఉమాచందు.

"అది సరే. ఇనప్పెట్టె తాళంచెవి ఎవరిదగ్గిరుంటుంది?" అని ప్రశ్నించాడు అక్షయకుమారుడు.

నా దగ్గి రుంటుంది, డూప్లికేటు మల్లుజీ అన్ని వేళలా తనదగ్గ రుంచుకుంటారు," అంటూ ఉమాచందు జేబులోంచి తాళంచెవి తీసి అక్షయకుమారుడికి చూపించాడు.

"అలా అయితే, మల్లుజీ దగ్గిరవుండవలసిన తాళంచెవి లేదు. శవాన్ని బాగా పరీక్షించాం,'' అన్నాడు అక్షయకుమారుడు.

''అయితే దా న్నెవరో దొంగిలించారు. అయినా వాళ్లు ఇనప్పెట్టెను తెరిచే అవకాశంలేదు అ పెట్టెవున్న గదిదగ్గిర పహరా జవా నుంటాడు." అన్నాడు ఉమాచందు.

"ఇదంతా ఏదో గందరగోళంగావుంది. సరే, ముందు మీరూ, లలితాప్రసాదు బాబూ పోలీసు రాణాకు వచ్చి మల్లుజీ శవాన్ని గుర్తించాలి, పదండి,'' అంటూ వాళ్ళను రాణాకు తీసుకుపోయి. ఆ పని ముగించగానే అక్షయకుమారుడు నగేంద్రుణ్ణి వెంటబెట్టుకుని హౌరాస్టేషనుకు పోయాడు

పావుగంట తరవాత వాళ్ళిద్దరూ చందననగరం స్టేషన్లోదిగి, హుజూరీమల్లు ఇంటికి వెళ్ళారు. ఆయన నివసించే భవనం ఒక పెద్దతోటమధ్య వున్నది. అనేక మంది పరిచారకులూ, పరిచారికలతో మల్లు చాలా ఆడంబరంగా జీవించేవాడు.

అక్షయకుమారుడు భవనం ముందు కనిపించిన ఒక నౌకరుతో తాను డిటెక్టివ్ ఇన్ స్పెక్టర్ నని చెప్పి హుజూరీ మల్లు భార్యతో మాట్లాడవలసి వున్నదని అన్నాడు. నౌకరు భవనంలోకిపోయి రెండు మూడు నిమిషాల్లో తిరిగివచ్చి "ఆమెకు ఒంట్లో బావోలేదట ఎవరితోనూ మాట్లాడే అవకాశం లేదని చెప్పారు," అని అక్షయకుమారిడికి తెలియపరిచాడు.

'ఏమి చేయటమా అని అక్షయకుమారుడు ఆలోచించేంతలో, అతడికి ఒక చెట్టుకింద ఒక స్త్రీ పురుషుడూ మాట్లాడుకుంటూ ఉండటం కనిపించింది అతడు వారిని నగేంద్రుడకి చూపాడు. నగేంద్రుడు అనుమానిస్తున్న వాడిలా, "ఆమె యమునాబాయి కాదు గదా ?'' అన్నాడు.

అక్షయకుమారుడు జవాబిచ్చేలోపలే ఒక యువతి వారి వెనకనుంచి ముందుకు వచ్చి, "నేనే యమునాబాయిని. తమ రేంపనిమీద వచ్చారు ?'' అని ప్రశ్నించింది. ఆమె ముఖంలో విచారం ప్రస్ఫుటమవుతున్నది.

అక్షయకుమారుడు హత్యచేయబడిన స్త్రీ చీరెముక్కను ఆమెకు చూపుతూ, "దీనిమీద మీ చాకలి గుర్తున్నది. దీన్ని ఆనవాలు పట్టగలరా ?" అని ప్రశ్నించాడు.

యమునాబాయి ఆముక్కను నిదానించి చూసి, "అవును, ఇది మాపిన్ని చీరలోది. ఆచీరెను తనదాసీ రంగియాకు ఇచ్చింది," అన్నది.



"ఆమె ఇంట్లో వున్నదా ?"

"లేదు. ఏడెనిమిది రోజులక్రితం స్వస్థలానికి వెళ్ళివస్తానని బయలుదే పోయింది"

"ఎక్కడికీ పోలేదు. శనివారంరాత్రి ఖూనీ అయింది," అన్నాడు అక్షయ కుమారుడు తాపీగా.

"ఖూనీయా ?" అంటూ యమునాబాయి వణికిపోసాగింది.

"ఆహా, పిల్లా ! నీకు చాలా రహస్యాలు తెలుసు !" అని అక్షయుడు మనసులోనే అనుకని, జేబులోంచి శివలింగాన్ని తీసి, "దీన్నిగురించి మీకేమైనా తెలుసునా ?" అని ప్రశ్నించాడు.

యమునాబాయి భయంతో చిన్న కేక వేసింది. ఆమె ఏదో చెప్పబోయిందిగాని నోరు పెగలలేదు. అక్షయు డామెను కన్నార్పకుండా చూస్తూ, "శివలింగాన్ని చూసి అంత బెదురుతున్నారేం ?" అని అడిగాడు.

"అలాంటి దొకటి నా పెంపుడుతండ్రి హుజూరీమల్లుజీవద్ద వుండేది," అన్నది యమునాబాయి తడబడుతూ.

"ఆయన పంజాబులోని ఒక మత సంప్రదాయానికి చెందినవారని మీకూ తెలుసుననుకుంటాను. దాసి అన్నారే - రంగియా - ఆమెకు మల్లుజీకీ మధ్య ఎలాంటి అన్యోన్యత వుండేదో మీరెప్పుడైనా గమనించారా ?" అన్నాడు అక్షయుడు.

"అది దాసీది ! అన్యోన్యత ఏమిటి ?" అన్నది యమునాబాయి కోపంగా.

"సరే, ఆసంగతి అలా వుంచుదాం. మీరు శనివారం రాత్రి బారాబజారులోని మీ పెంపుడు తండ్రిగారి షాపుకువెళ్ళారా ?" అన్నాడు అక్షయకుమారుడు.

"వెళ్ళలేదు."

అక్షయకుమారుడు ఆమె చేతికేసి, వేలిన మూడు నీలపురాళ్ళ వుంగరం లేకపోవటం గమనించాడు. బహుశా ఆ స్త్రీ యీమె అయివుండదు అన్న నిశ్చయానికి వచ్చి, "ప్రస్తుతానికి మిమ్మల్ని యిక ప్రశ్నించదలచలేదు. అవసరంపడినప్పుడు మరోసారి కలుసుకుంటాను," అన్నాడు.

యమునాబాయి అక్కణ్ణించి వెళ్ళిపోయింది. అంతలో అక్కడికి, యిప్పటివరకూ చెట్టుకింద నిలబడి మాట్లాడుకుంటున్న స్త్రీ పురుషులు వచ్చారు. అందులో పురుషుడు నగేంద్రుడికేసి గుచ్చి గుచ్చి చూస్తూ, "ఎవరూ ? నగేంద్రుడు కాదూ ?" అని ప్రశ్నించాడు.

నగేంద్రుడు ఆ వ్యక్తికేసి నిదానించి చూసి, "ఏమిటీ, యమునాదాసా !" అన్నాడు ఆశ్చర్యంగా.

"నువ్వు గుర్తుపట్టగల వనుకోలేదు, నగేన్ ! మనం ఒకర్నొకరు చూసి చాలా ఏళ్ళయిపోయింది," అంటూ యమునాదాసు చిరునవ్వు నవ్వి, తనపక్కన వున్న స్త్రీని అతడికి పరిచయంచేస్తూ, "ఈమె గంగాబాయి. హుజూరీమల్లు బాబుగారి పెంపుడుకుమార్తె యమునాబాయికి దాసి. ఈ దాసీరత్నాన్ని ఆమె కొద్ది



రోజుల్లోనే తనవెంట పంజాబుకు తీసుకుపోతుంది," అనిచెప్పి, "ఒక్కమాట, నగేన్!" అంటూ నగేంద్రుడి భుజం పట్టుకు అతణ్ణి దూరంగా తీసుకుపోయి, "ఆయనెవరు? ఏం పనిమీద యిక్కడికొచ్చావు?" అని ప్రశ్నించాడు.

నగేంద్రుడు, డిటెక్టివ్ అక్షయకుమారుడి పేరుచెప్పి తామిద్దరూ అక్కడి కెందుకు రావలసి వచ్చిందో యమునాదాసుకు తెలియబరిచాడు. అంతావిన్న యమునాదాసు గొంతులో ఎక్కడాలేని ఆపుర్దా కనబరుస్తూ. "నగేన్! నన్నుకూడా నీలాగే డిటెక్టివ్ అక్షయకుమారుడు యీకేసు పరిశోధనలో వెంట తీసుకుపోయేట్టు అనుమతించేలా చేయి. హుజూరీమల్లు బాబంటే నాకెంత గౌరవం, భక్తి అనుకున్నావు? ఆయన్ని అంత దారుణంగా చంపిన హంతకుణ్ణి పట్టుకునేందుకు నాచేతనైనసాయం నేనూ చేయదలిచాను." అన్నాడు.

"నీ సంగతి అక్షయబాబుకు అలాగే చెప్పిచూస్తాను," అన్నాడు నగేంద్రుడు.

ఈవిధంగా ఆమిత్రులిద్దరూ అంతదూరంలో సంభాషించే సమయంలో అక్షయ కుమారుడు తనకు అల్లంత దూరంలో నిలబడివున్న గంగాబాయిని జాగ్రత్తగా పరీక్షించి చూడసాగాడు అతడిదృష్టి ఆమెను నఖశిఖ పర్యంతం పరీక్షించి చూసింది. హఠాత్తుగా అతడికళ్ళు మిరుమిట్లు కొల్పినై. ఆమెవేలికి మూడు నీలాలుచెక్కిన వుంగరం వున్నది.

# 5

డిటెక్టివ్ అక్షయకుమారుడు, నగేంద్రుడూ తిరిగి రైల్వేస్టేషనుకు వచ్చి హౌరాకుపోయే బండెక్కారు. అక్షయకుమారుడు ఏవో దీర్ఘంగా ఆలోచిస్తూండటం గమనించిన నగేంద్రుడు, "అక్షయబాబూ! హుజూరీమల్లు ఇంటివద్ద హత్యకు సంబంధించిన రహస్యం ఏమైనా మీరు కనిపెట్టారా?" అని అడిగాడు.

"రహస్యం ఒకటి తెలిసింది చెప్తాను యమునాదాసు సంగతేమిటి?" అని అడిగాడు అక్షయకుమారుడు.

"హుజూరీమల్లుకూ అతడికీ చాలా స్నేహం వుండేదిట ఈ హత్యకేసు పరిశోధనలో తననూ మీ వెంట రానిస్తారేమో కనుక్కోమన్నాడు." అని చెప్పాడు నగేంద్రుడు

"అతడు గంగాబాయిని పెళ్ళాడే ధోరణి కనబడుతున్నదే!"

"అవును, అదీ సూచనగా అన్నాడు"

"ఈ గంగాబాయి అప్పుడప్పుడూ రాత్రుల్లో హుజూరీమల్లు షాపుకు వస్తూంటుంది. నీలాలు చెక్కిన ఉంగరం వేలికి పెట్టుకున్న ఒక స్త్రీ ఆలా వస్తూంటుందని ఆ ఇంటి నౌకరు చెప్పాడు గంగాబాయి వేలికి ఆ ఉంగరం ఉన్నది," అన్నాడు అక్షయుడు,

"కావచ్చు. అయినా గంగాబాయికి హత్యతో ఎలాంటి సంబంధం ఉన్నదో నా కర్థం కావటంలేదు." అన్నాడు నగేంద్రుడు నిస్పృహగా

"ఇవన్నీ అనుమానాలే అతణ్ణి యమునాబాయి చంపివుండవచ్చు-శివలింగాన్ని చూసి ఎంత తత్తరపడిందో చూడలేదా? దాసీ రంగియా చంపివుండవచ్చు దాసీ దానితో సంబంధం కలిగివున్నాడని ఈర్ష్యతో అతడి భార్యే యీ హత్య చేసివుండవచ్చు. లలితాప్రసాదూ, ఉమాచందూ వుండనే ఉన్నారు," అంటూ అక్షయకుమారుడు కొంచెం ఆగి, "మీ మిత్రుడు యమునాదాసును మన పరిశోధనలో వెంట తీసుకుపోవచ్చు ఆ మాట అతడికి చెప్పండి అతడి ద్వారా గంగాబాయికి తెలిసిన రహస్యాలు కొన్ని మనం గ్రహించవచ్చు" అన్నాడు

నగేంద్రుడు సరే అని తల వూపాడు. ఆ మరుసటిరోజు ఉదయం యమునాదాసు హడావిడిగా అతడి ఇంటికి వచ్చి ఇల్లు దద్దరిల్లేలా నవ్వుతూ చిన్ననాటి సంగతులు అనేకం మాట్లాడసాగాడు ఆ విధంగా ఓ పావుగంట గడిచింతరవాత నగేంద్రుడతణ్ణి "దాసూ, ప్రస్తుతం ఏం చేస్తున్నావు?" అని ప్రశ్నించాడు

"ఏమీ చేయటంలేదు," అన్నాడు యమునాదాసు పెద్దగా నవ్వుతూ.



''ఆలా అయితే రోజులు గడవటం ఎట్లా?" అన్నాడు నగేంద్రుడు.

"మహ చక్కగా గడుస్తయి. వివాహం చేసుకోబోతున్నాను. ఇక దేశాలు పట్టుకు తిరిగే అవసరపడదు,'' అన్నాడు యమునాదాసు.

"అంటే, ఇప్పటికే చాలా దేశాలు తిరిగావన్నమాట?"

"తిరగటమా? ప్రపంచం ఓ చుట్టు చుట్టాను"

'పంజాబు ప్రాంతం ఎరుగుదువా?''

"పంజాబులో నేను చూడని గ్రామం లేదు. అమృత్‌సర్‌లో నాలుగునెల లున్నాను,'' అన్నాడు యమునాదాసు గర్వంగా

నగేంద్రుడు టేబిల్ సొరుగులోంచి శివలింగాన్ని బయిటికితీసి, టేబిల్‌మీద పెడుతూ, "ఈ సిందూరం పూసిన శివలింగాల సంగతేమైనా ఎరుగుదువా?" అని ప్రశ్నించాడు.

శివలింగాన్ని చూస్తూనే, యమునాదాసు, "ఆరెరె!" అంటూ నాలుగడుగులు వెనక్కు వేశాడు. అతడి ముఖం వాడిపోయింది, కళ్ళు విచ్చుకున్నవి.

"అంత భయపడిపోతున్నావేం?'' అన్నాడు నగేంద్రుడు

"కొంపారింది. ఇది నీ కెక్కడ దొరికింది? లేకపోతే, నువ్వు ఆ సాంప్రదాయంలోని వాడివా?" అని ఆడిగాడు యమునాదాసు.

''ఏ సాంప్రదాయం?''

''ఇది పంజాబులో ఒక వింత సాంప్రదాయస్థుల చిహ్నం. వాళ్లు హత్యచేసిన

మనిషి పక్కన వీటిని పెడుతూంటారు," అన్నాడు యమునాదాసు.

"ఇది, హుజూరీమల్లు మృతశరీరం దగ్గిర దొరికింది ''

"బహుశా ఆయన ఆ సాంప్రదాయంవాళ్ళ డబ్బు హరించివుంటాడు. వాళ్లు తమ ఉమ్మడిసొమ్మును ఏ ఒక్క వ్యక్తి దగ్గిరా వుంచక, నమ్మకస్తు లనుకున్నవా ళ్ళందరి దగ్గిరా దాచబెడుతూంటారు," అన్నాడు యమునాదాసు.

"గురుగోవిందసింగు ఈ సాంప్రదాయంలోని వాడేనా ?''

"కావచ్చు, కాకపోవచ్చు. కాని, హుజూరీమల్లుతో అత దొకసారి మాట్లాడిన ధోరణినిబట్టి ఆ సాంప్రదాయస్తుల ధనం కొంత అతడి దగ్గిర ఉన్నదేమో అన్న అనుమానం నా క్కలిగింది," అన్నాడు యమునాదాసు.

"అనుమానం కాదు, గురుగోవిందసింగు పదివేల రూపాయలనోట్లను హుజూరీమల్లు దగ్గిర దాచాడు. అవి చోరీ అయిపోయినై. డిటెక్టివ్ అక్షయబాబు హత్యకేసుల్తోపాటు, దీన్ని గురించీ పరిశోధిస్తున్నారు. నిన్ను మా వెంట తీసుకు పోవటానికి ఆయన సమ్మతించారు,'' అన్నాడు నగేంద్రుడు.

"ఆయన చాలా పెద్దమనిషిలా ఉన్నాడు, చాలా కృతజ్ఞుణ్ణి."

"ఈ హత్యలవిషయంలో యింతవరకూ, మాకు తెలిసిన సంగతులు నీవు వినటం మంచిది," అని నగేంద్రుడు అప్పటివరకూ కేసుల్లో తమకు తెలిసిన విషయాలన్నీ అతడికి వివరించాడు

యమునాదాసు నిశ్శబ్దంగా అంతా విని, "రెండు శవాలవద్దా శివలింగాలు దొరికినై. పంజాబు సాంప్రదాయంవాళ్ళే హంతకులని తెలుస్తూనే ఉంది. గురు గోవిందసింగు దాచుకున్న డబ్బు హుజూరీమల్లు అపహరించాడు. వాళ్ళ సాంప్ర దాయ నియమాల ప్రకారం అతడు మల్లును హత్యచేశాడు," అన్నాడు.

నగేంద్రుడు, యమునాదాసును మరింతగా ప్రశ్నించి ఆ పంజాబు సాంప్రదాయం వాళ్ళ యితర నియమాలూ, రహస్యంగా వాళ్ళుజరిపే పూజాపునస్కారాలను గురించి తెలుసుకోసాగాడు.

ఈ విధంగా మిత్రులిద్దరూ సంభాషిస్తున్న సమయంలోనే, డిటెక్టివ్ అక్షయ కుమారు డింటికి ఒక గొప్పింటి స్త్రీ, ఆమె దాసీ వచ్చారు. అక్షయు దామెను వచ్చిన పని ఏమిటని ప్రశ్నించాడు-ఆమె నిండుగా ముసుగు ధరించి ఉన్నది

"శనివారం రాత్రి హత్య అయినవారు మావారే,'' అన్నదా స్త్రీ గాద్గదికంగా.

"హుజూరీమల్లుబాబు తమ భర్తగారా ?'' అని అడిగాడు అక్షయకుమారుడు ఆ ముసుగుస్త్రీ అవునన్నట్లు తలాడించింది.



''తమరు వచ్చిన పనేమిటో శెలవివ్వండి,'' అన్నాడు అక్షయకుమారుడు.

''నా భర్తను హత్య చేసినవా శ్శెవరో చెప్పేందుకు వచ్చాను. హంతకి గంగాబాయి ఆ పిశాచి మా వారిని వలలో వేసుకున్నది రాత్రిళ్ళు అప్పుడప్పుడూ అది షాపువెనక వున్న ఇంటికి పోతూవుంటుందని నాకు తెలుసు '' అన్నది మల్లుభార్య తీవ్ర ధోరణిలో.

''ఈ సంగతులన్నీ తెలిసి ఆమె నెలా ఇంట్లో ఉండనిచ్చారు ?''

"వెళ్ళకొట్టే శక్తి నా కెక్కడిది? ఆ పిశాచి శనివారంరాత్రి నా భర్తతో ఎక్కడికో లేచిపోవటానికి పథకం వేసింది దానికి వారిమీద ప్రేమ లేదు, ధనం హరించాలనే ఆ దుర్మార్గురాలి పన్నాగం. అది తన ప్రియుడిచేత నా భర్తను చంపించింది.'' అన్నది మల్లుభార్య.

''ఎవరా ప్రియుడు? యమునాదాసా ?''

''కాదు, లలితాప్రసాదు దానికి అతడంటే ఎక్కడలేని అనురాగం వుంది. అతడికోసం ప్రాణాలైనా యిస్తుంది ఆ మూర్ఖుడైన యమునాదాసుమీద ఆ దౌర్భాగ్యురాలికి నిజమైన ప్రేమ లేదు అంతా మాటలతో వాణ్ణి బుట్టలో వేసుకున్నది యమునాదాసులో హత్య చేయగలిగేంత గుండె నిబ్బరం లేదు," అన్నది మల్లుభార్య

"మీరు చెప్పిందంతా గుర్తు పెట్టుకుంటాను హంతకుడు ఫలానా అని తెలిస్తే చాలదు-అందుకు తగిన సాక్షాధారాలు కావాలి," అన్నాడు అక్షయకుమారుడు.

"ఆ సాక్ష్యం ఏదో సంపాయించండి. ఆ రాక్షసి తప్పించుకుపోతే, ఆ పాపం మిమ్మల్ని చుట్టుకుంటుంది, ఇది నా శాపం!" అంటూ హుజూరీమల్లుభార్య గబగబా అక్కణ్నించి వెళ్ళిపోయింది

అక్షయకుమారుడు ఓ పావుగంటకాలం యిప్పుడేమి చేయటమూ అని ఆలోచించి చందననగరం పోయి గంగాబాయిని ఓసారి ప్రశ్నించిరావటంవల్ల ప్రయోజనం ఉంటుందన్న నిశ్చయానికి వచ్చాడు. ఆ వెంటనే అతడు హౌరా స్టేషనుకు పోయి అక్కణ్నించి రైలుమీద చందననగరంలో దిగాడు.

ఈసారి హుజూరీమల్లు నౌకర్లు అతిణ్ని చూసి ఒకటిరెండుసార్లు నమస్కారాలు చేసి, ఆహ్వానించి ఇంట్లోకి తీసుకుపోయి, అక్కడున్న పెద్దహాలులో కూర్చోబెట్టారు. అక్షయుడు తాను గంగాబాయిని చూడవచ్చినట్టు చెప్పాడు. నౌకరొకడు పోయి రెండు మూడు నిమిషాలు గడిచీ గడవకముందే గంగాబాయిని అక్కడికి తీసుకువచ్చాడు.

అక్షయకుమారుడు ఆమెను చూస్తూనే చిరునవ్వు నవ్వి, "హుజూరీమల్లుజీ హత్య అయిన రాత్రి, ఆయనను చూసేందుకు ఒక స్త్రీ బారాబజారులోని ఆయన ఇంటికి వెళ్ళింది. ఆమె వేలికి నీలాలు తాపివున్న ఉంగరం ఉన్నది. అది ఆయన నౌకరు గుర్తించాడు. మీరే గదా ఆ స్త్రీ?" అని అడిగాడు.

గంగాబాయి తన వేలినున్న ఉంగరం కేసి ఓ మారు చూసుకొని, "దీన్ని రెండు రోజులనుంచే నేను పెట్టుకుంటున్నాను. యమునాబాయి నడిగితే నిజం తెలుస్తుంది," అని దాసీ నౌకదాన్ని ఆమెకోసం పంపింది. కొద్దిక్షణాల్లోనే యమునాబాయి అక్కడికొచ్చింది.

"శనివారంనాటి రాత్రి మీరు మీ పెంపుడు తండ్రిగార్ని చూసేందుకు బారాబజారులోని షాపుకు వెళ్ళారుగదా?" అని అడిగాడు అక్షయకుమారుడు.

యమునాబాయి ఏదో జవాబు చెప్పబోయేంతలో గంగాబాయి జడ్డుతగిలి, "ఈ ఉంగరం విషయమై డిటెక్టివ్ ఇన్‌స్పెక్టరుగారి కేదో అనుమానం వున్నది. దీన్ని పదీ పదిహేను రోజులుగా నీవే పెట్టుకున్నావుగదా? నాకు నువ్వు దీన్నిచ్చింది మొన్న సాయంత్రం, అవునా?" అని ప్రశ్నించింది.

యమునాబాయి చీదరించుకున్నట్టు గంగాబాయి ముఖంలోకి చూసి, తరవాత అక్షయకుమారుడికేసి తలతిప్పి, "ఈ ఒక్క విషయంలో మాత్రం గంగ చెప్పేది నిజం! ఉంగరం ఆ మధ్య ఆవిడ వేలినుంచి జారి తోటలో పడిపోయి, ఆ తరవాత నాకు దొరికింది కొద్దిరోజులపాటు నేను పెట్టుకుని, రెండు మూడు రోజులక్రితమే

ఆవిడకు తిరిగి యిచ్చాను. కాని, ఇప్పు డాలోచిస్తూంటే, ఆ పదీ పన్నెండు రోజులకాలం ఉంగరాన్ని నా దగ్గిర వుంచటంలో ఆవిడ చేసిన మోసం అర్థమవు తున్నది,'' అన్నది.

"అలా అయితే శనివారం రాత్రి షాపు వెనకవున్న యింటికి వెళ్ళినది మీరే నన్నమాట!'' అన్నాడు అక్షయకుమారుడు

"అవును. నేనే!" అన్నది యమునాబాయి. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

''గంగాబాయి ఎత్తుగడ ఏమిటో నాకు సూచనప్రాయంగా తెలుస్తున్నది." అంటూ అక్షయకుమారుడు ఆమెకేసి గుచ్చిచూస్తూ "లలితాప్రసాదుకూ, మీకూ వున్న అన్యోన్యత ఎలాంటిదో చాలా మందికి తెలుసు నేను అతడినుంచి సేకరించిన భోగట్టావల్ల హుజూరీమల్లబాబును హత్యచేసిన దెవరో మీకు తెలుసనని గట్టినమ్మకం కలిగింది," అన్నాడు.

"మీది కేవలం అపోహ " అన్నది గంగాబాయి రోషంగా.

"అపోహ కాదు," అంటూ యమునాబాయి, గంగాబాయికేసి తలతిప్పి పళ్ళు కొరికింది.

"యమునా! నీ కేమన్నా మతిపోయిందా?" అంటూ గంగాబాయి అరిచింది.

''నోరుముయ్యి, అంత దురుసుగా మాట్లాడకు నా పెంపుడు తండ్రి నీ తండ్రి వయసువాడు. నీ వాయనతో___"

"ఇంక నోరుముయ్యి!" అంటూ బెబ్బులిలా లేచింది గంగాబాయి.

'గంగా! జాగర్తగా మాట్లాడు నీ వా రాత్రి ఏదో తంత్రం ఆలోచించే, నీవు పోక రంగియాను పంపావు — అక్కడికి!" అన్నది యమునాబాయి.

"నీకు పిచ్చెత్తింది," అంటూ గంగాబాయి అక్కణ్ణించి చరచరా వెళ్ళిపోయింది. అక్షయు డామెను ఆప ప్రయత్నించబోయి వూరుకుని, యమునాబాయిని, "రంగియాను, గంగాబాయి అక్కడికి పంపినట్టు మీ రెలా తెలుసుకో గలిగారు?" అని అడిగాడు.

"ఆ రాత్రి రంగియా ధరించినచీరె గంగాబాయిది. గంగ కావాలనే రంగియాను ఆ వేషంలో పంపింది," అన్నది యమునాబాయి.

అక్షయకుమారుడు ఓ క్షణకాలం ఆలోచించి తృప్తిగా తలాడిస్తూ, "ఈ హత్యల వెనకవున్న రహస్యం చాలావరకు బోధపడింది. ఆ రాత్రి గంగాబాయే, మల్లుజీని రాణీగల్లీలో కలుసుకోవలసి వున్నది వాళ్ళిద్దరూ బొంబాయి పారిపోయేందుకు రైలు టిక్కెట్లుకూడా మల్లుజీకొని సిద్ధంగా వుంచాడు కాని, ఆఖరిక్షణంలో గంగా

బాయి మనస్సు మార్చుకుని, తాను పోక దాసీ రంగియాకు తన వేషం వేసి పంపింది ఏ కారణంవల్ల?" అంటూ ఆగి, యమునాబాయిని, "అది అలా వుంచుదాం. మీ రా రాత్రి మీ పెంపుడు తండ్రిని చూసేందుకు వెళ్ళారు. ఎందుకు వెళ్ళారు?" అని అడిగాడు.

"ఆ సంగతి చెప్పే వీలులేదు," అన్నది యమునాబాయి.

"హత్యకేసు మీ మీద ఆరోపించి అరెస్టు చేయగలను—కావాలంటే," అన్నాడు అక్షయకుమారుడు కోపంగా.

"చేయండి. కాని, నానుంచిమాత్రం ఆ ప్రశ్నకు జవాబు రాదు," అన్నది యమునాబాయి మొండికెత్తినట్టు.

"అదీ చూస్తాను!'' అని అక్షయకుమారుడు అక్కణ్ణించి బయలుదేరాడు.

# 6

ఆనాటి సాయంకాలంవరకూ డిటెక్టివ్ అక్షయకుమారుడు కేసు విషయంలో తాను మరోసారి కలుసుకుని ప్రశ్నించవలసిన వారిని ప్రశ్నించాడు. లలితాప్రసాద్ ఉమాచంద్‌లనుంచి అతడికి కొన్ని కొత్త విషయాలు తెలిసినై. గురుగోవిందసింగు బారాబజారులో అతడికి కనిపించి, ఆశ్చర్యం కలిగించే విషయం ఒకటిచెప్పి, పెద్దగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఒంటిగంటవరకూ అక్షయకుమారుడు శనివారం జరిగిన రెండు హత్యల తాలూకూ లానింతవరకూ సేకరించిన సాక్షధారాలను గురించి ఆలోచించి ఒక గట్టి నిర్ణయానికి వచ్చి హాయిగా నిద్రపోయాడు

మర్నాడు సూర్యోదయంతో నేలేచి కాలకృత్యాలు తీర్చుకుని నగేంద్రుణ్ని చూడ టానికి అతడింటికి పోయాడు, అక్షయకుమారుడు. నగేంద్రుడు అతణ్ని సోదరంగా ఆహ్వానించి, "హంతకుల ఆచూకీ తెలిసిపోయిందా, అక్షయబాబూ?'' అని ప్రశ్నించాడు

''అలాగే కనబడుతున్నది. కాని, ఓ గట్టి నిర్ణయానికి రావటానికి సాక్ష్యధా రాల్లో కొన్ని చిన్నచిన్న లొసుగులు కనిపిస్తున్నవి,'' అన్నాడు అక్షయకుమారుడు కుర్చీలో కూర్చుంటూ.

"నా కలా అనిపించటంలేదు. రెండు హత్యలకూ కారకుడు గురుగోవిందసింగు. అతడు పంజాబు సాంప్రదాయికుల డబ్బు పదివేలు — హుజూరీమల్లు దగ్గర దాచాడు మల్లు ఆ డబ్బూ, గంగాబాయినీ తీసుకుని పరారీ అయేందుకు ప్రయత్నిం చాడు గురుగోవిందసింగు యీ సంగతి పసికట్టి, హుజూరీమల్లును వెంటదగిలి

రాణీగల్లీలో హత్యచేసి డబ్బు గుంజుకున్నాడు. ఆ సమయంలో అతడికి గంగా బాయి చీర ధరించివున్న రంగియా తటస్థపడింది. సాక్ష్యం మాఫీ చేసేందుకు ఆమెనుకూడా వధించాడు. రెండు శవాలదగ్గిరా సిందూరంపూసిన శివలింగాలు పెట్టాడు. ఇదీ నేననుకునేది. మీ అభిప్రాయం ఏమిటి?'' అని ఒడిగాడు నగేంద్రుడు.

''మీరు రచయితలు గనక, మీరు రాయబోయే డిటెక్టివ్ నవలలకు యీ ప్లాట్ బాగానే వుంటుంది దీనిచుట్టూ కొన్ని సంఘటనలు కల్పించి, మరికొన్ని సన్ని వేశాలు అల్లుకుపోతే మంచి నవలే అవుతుంది,'' అంటూ అక్షయకుమారుడు నవ్వి "అయితే, నగేన్‌బాబూ! యీ సంగతి చెప్పండి. గురుగోవిందసింగు హత్యలు చేసి తన డబ్బు తాను తిరిగి సంపాయించుకుంటున్నాడంటున్నారే — మరి, ఆ తర వాత అతడు తనడబ్బు హుజూరీమల్లు షాపులో దొంగిలించబడిందని విన్నప్పుడు, అది నమ్మినవాడిలా ప్రవర్తిస్తూ, లలితాప్రసాదును డబ్బు తెమ్మని ఎందుకు దబా యిస్తున్నాడు?'' అని ప్రశ్నించాడు.

"లోకం కళ్ళల్లో యింత దుమ్ము చల్లేందుకు,'' అన్నాడు నగేంద్రుడు.

"నాకు మాత్రం అలా కనబడటంలేదు. నేను మరోసారి లలితాప్రసాదునూ, ఉమాచందునూ కలుసుకున్నాను. బజార్లో గురుగోవిందసింగు ఎదురుపడి తన పది వేలరూపాయిలూ దొరికినట్టు చెప్పాడు," అన్నాడు అక్షయకుమారుడు.

నగేంద్రుడు ఎక్కడలేని ఆశ్చర్యం కనబరుస్తూ, "ఎలా దొరికింది?" అని అడిగాడు

"నిన్న ఉదయం ఎవరో దర్వాన్ ఒకడు వచ్చి, సింగు ఇంటలేని సమయంలో అతడి నౌకరుకు ఒకసంచీ యిచ్చి, దాన్ని యజమానికివ్వమనిచెప్పి పోయాడట. గంటతర్వాత సింగు యింటికి వచ్చి, నౌకరిచ్చిన ఆ సంచీతీసుకుని లోపల చూస్తే, పదివేలరూపాయిల నోట్లూ రెండు మూడు పాకెట్లుగా కట్టబడి వున్నవట. ఇప్పుడేమంటారు?" అన్నాడు అక్షయకుమారుడు.

"నేనేమీ అనను. నా ఊహలన్నీ తారుమారై పోయినై," అన్నాడు నగేంద్రుడు నిస్పృహగా.

"అంత నిస్పృహపడకు నగేంద్రబాబూ! గురుగోవిందసింగుకు రూపాయిల నోట్లు నిచ్చినవాడు దర్వాన్ వేషంలో వున్న బవిరిగడ్డం వాడంట బహుశా అది మారువేషం అయివుంటుందని సింగు చెప్పాడు. పైగా, అతడికి తిరిగివచ్చిన నోట్లు, హుజూరీమల్లుకు అతడు దాచనిచ్చినవికావు. వాటి నంబర్లు సింగుదగ్గిర

వున్నవి ఈ వచ్చినవన్నీ కొత్తనోట్లు. మనం ఆలోచనల్తో బుర్ర పాడుచేసు కోవటానికి అవసరం అయినంత సరంజామా యిందులోవుంది," అన్నాడు అక్షయకుమారుడు.

"నాకూ అలానే తోస్తున్నది,'' అన్నాడు నగేంద్రుడు నంగిగా.

"నగేన్ బాబూ! గురుగోవిందసింగు నాకు యిచ్చిన పాత, కొత్తనోట్ల నంబర్లు మీ కిస్తాను. హుజూరీమల్లు ఇనప్పెట్టెలోవున్న నోట్లు చోరీ అయిన సంగతి బయటపడక పూర్వమే, వాటి నెవరో మార్చారు. ఆ నంబర్లు బయటపడిన తరవాత మార్చటం కష్టం, అందువల్ల ఆ నోట్లు ఎక్కడ ఎవరు మార్చారో మీరు తెలుసుకునే ప్రయత్నం చేయాలి. ఏమంటారు?" అన్నాడు అక్షయ కుమారుడు.

''గట్టిగా ప్రయత్నిస్తాను," అన్నాడు నగేంద్రుడు.

అక్షయకుమారుడు నాలుగైదు నిమిషాలపాటు కళ్లుమూసుకుని కుర్చీకి చేరగిల బడి కూర్చుని, హఠాత్తుగా ఏదో ఆలోచన వచ్చినవాడిలా ఎగిరి లేచినిలబడి, "నగేన్ బాబూ! ఈ నోట్ల రహస్యం తెలుసుకోవటానికి మనం ఎక్కువ శ్రమ పడవలసిన అవసరం లేదని, నా కనిపిస్తున్నది హుజూరీమల్లుకు, లలితాప్రసాదు తండ్రి వ్యాపారంలో భాగస్వామి. లలితాప్రసాదు మల్లుకు నమ్మినవ్యక్తి మనం లలితాప్రసాదును అడగవలసిన విధంగా అడిగితే, ఈ రహస్యం బయటపడుతుం దని నా నమ్మకం, బయలుదేరండి!'' అన్నాడు.

ఇద్దరూ అరగంట తరవాత బారాబజారులోని షాపులో లలితాప్రసాదును కలుసు కున్నారు. లలితాప్రసాదు మొదట అక్షయకుమారుడి ప్రశ్నలకు అందీ అందని జవాబు లిచ్చినా, డిటెక్టివ్ సింగు చెప్పినదంతా అతడికి చెప్పి దబాయించేసరికి, ఆ నోట్లు హుజూరీమల్లు మార్చమంటే తనేమార్చి తెచ్చానని ఒప్పుకున్నాడు. ఇది, మల్లు హత్యకు వారం రోజులముందు జరిగిందని తెలియబరిచాడు

"హుజూరీమల్లుకు ఆనోట్లనుమార్చి మరో నంబర్లుగల నోట్లు తెప్పించవలసిన అవసరం ఏం కలిగింది?'' అని ప్రశ్నించాడు అక్షయుడు

''మేమంతా పంజాబులోని రహస్యసాలిగ్రామ సాంప్రదాయస్థులం బయట పడకుండా ఆ సాంప్రదాయాన్ని అనుసరించేవారు యీ కలకత్తాలో కొందరు పెద్ద ధనికులున్నారు. చందాకింద వా ళ్ళిచ్చిన పెద్దనోట్ల నంబర్లు యితర్లు గ్రహించటం తేలిక. అప్పుడు వా రెవరో అందరికీ తెలిసిపోతుంది. అందుకని హుజూరీమల్లుజీ ఆ నోట్లన్నీ మార్పించి, కొత్తనంబర్లుగల నోట్లు తెప్పించారు - ఇదీ ఆయన నాకు



చెప్పిన కారణం. ఇందులోవున్న సత్యాసత్యాలకు నేను బాధ్యుణ్ణికాను," అన్నాడు లలితాప్రసాదు.

''ఆ సత్యాసత్యాల సంగతి నేను చూసుకుంటాను. మీరు వెళ్ళి, మీ షాపు గుమాస్తా - ఆ ఉమాచందను ఇక్కడికి పంపండి," అన్నాడు అక్షయకుమారుడు.

లలితాప్రసాదు గదివించి పోగానే అక్షయుడు, నగేంద్రుడి చెవిలో, ''ఈ ఉమా చందు మీద పెద్ద రస్సావేయబోతున్నాను వాడి వాలకంచూస్తే చౌకబారు రౌడీలు జ్ఞాపకం వస్తారు," అన్నాడు.

"ఏమిటా, రస్సా?'' అని ప్రశ్నించాడు నగేంద్రుడు ఆశ్చర్యపోతూ, అక్షయ కుమారుడు జవా బిచ్చేంతలో ఉమాచందు గదిలోకి వచ్చాడు. అక్షయు డతణ్ణి ఉరిమిచూస్తూ, "ఉమాచందు! నీ రహస్యాలన్నీ బయటపడిపోయినై. ఖూనీకేసు సందర్భంలో నిన్ను అరెస్టు చేయబోతున్నాను," అన్నాడు.

ఉమాచందు విలువెల్లా వణికిపోతూ, "ఇన్‌స్పెక్టర్ బాబూ! ఖూనీలా? నేను ఎవర్నీ ఖూనీ చేయలేదు,'' అన్నాడు తడబడుతూ.

"మా దగ్గిర తగిన సాక్ష్యాధారం వుంది. నువ్వు వట్టిరౌడీవేకాదు, స్త్రీలోలుడివి అంతా నేను గ్రహించాను,'' అన్నాడు అక్షయుడు పళ్ళుకొరుకుతూ.

'స్త్రీలోలుడు' అన్నమాట వింటూనే ఉమాచందు అక్షయుడి పాదాలమీద పడి

పోతూ,' నన్ను రక్షించండి! నేను హంతకుణ్ణికాదు - కావాలంటే నన్ను అవినీతిపరు డనండి - హంతకుణ్ణి మాత్రంకాదు,'' అన్నాడు కళ్ళ నీళ్ళతో.

అక్షయకుమారు డతణ్ణి లేచినిలబడమని ఆజ్ఞాపించి, "నీ అవినీతే నిన్ను హత్యలకు ప్రోత్సహించింది. సరే, నువ్వు హుజూరీమల్లును హత్యచేయలేదని ఎలా నిరూపిస్తావో నిరూపించు. రంగియా హత్యసంగతికి తరువాత వద్దాం,'' అన్నాడు.

రంగియా పేరు వింటూనే, ఉమాచందు బావురుమన్నాడు. అక్షయు డతణ్ణి గట్టిగాకసిరి, ''ఈ హత్యల విషయంలో నీకు తెలిసినదంతా చెప్పి - నిర్దోషివని రుజువుచేసుకో. లేకపోతే నీకు అరెస్టు తప్పదు,'' అన్నాడు.

ఉమాచందు చేతులు జోడించి, ''ఇన్‌స్పెక్టర్ బాబూ! నేను నిజం చెపుతున్నాను, నమ్మండి నేను హంతకుణ్ణికాదు. హుజూరీమల్లుజీ ఇంటికి నేను తరుచుగా పోతూంటాను - ఆ విధంగా నాకూ రంగియాకూ ప్రేమ కలిసింది. రంగియాకు ఆ ఇంటి వ్యవహారాలన్నీ తెలుసు. హుజూరీమల్లుజీ గంగాబాయితో రహస్యంగా లేచిపోతున్నాడనీ, అందుకు ఒప్పుకున్నందుకు అతడు గంగాబాయికి పదివేల రూపాయిలు యివ్వ నున్నాడనీ రంగియా నాకు చెప్పింది. ఆ పదివేల రూపాయిలూ గురుగోవిందసింగు అతడిదగ్గిర దాచుకున్న మొత్తం అని నాకు తెలుసు. ఆ డబ్బును మల్లుజీ లలితాప్రసాదుద్వారా మార్పించి కొత్తనోట్లు తెప్పించాడు. ఆ నోట్లను శనివారంరాత్రి యమునాబాయి యిక్కడి కొచ్చినప్పుడు ఎవరూ చూడటం లేదనుకుని ఇనప్పెట్టెనుంచి తీసి, తన పెంపుడుతండ్రి కిచ్చింది. మల్లుజీ, లలితాప్రసాదూ వేరేగదిలోవున్నా రప్పుడు నేను తలుపుచాటున వుండి యమునాబాయి చేస్తున్నపని చూశాను ఆవిడకు తాళంచెవి యిచ్చినవాడు మల్లుజీ. లలితాప్రసాదుకు యీ సంగతి తెలియక డబ్బు ఎవరో చోరీ చేశారని నమ్మాడు..."

అక్షయకుమారుడు అతడి వాక్ప్రవాహానికి అడ్డుపడుతూ నగేంద్రుడితో, "చూశావా, నగేన్‌బాబూ? యమునాబాయి ఎంత ప్రశ్నించినా, శనివారం రాత్రి తానిక్కడి కెందుకొచ్చిందో చెప్ప నిరాకరించింది తండ్రే తనకూతుర్ని యీ చోరీపనికి నియోగించాడన్నమాట. ఆ హుజూరీమల్లు ఎంత నీచుడు," అన్నాడు.

''హుజూరీ మల్లుకు జూదం పెద్ద వ్యసనంలాంటిది. అతడు అందులో చాలాధనం పోగొట్టుకుని పూర్తిగా దివాళాదశలో వున్నాడు. ఈ సంగతి అతడి భాగస్థుడి కూడా తెలియదు," అన్నాడు ఉమాచంద్.

"సరే, నీ ప్రియురాలు రంగియాను మల్లజీ హత్యకు ఉపయోగించావన్న మాట!" అన్నాడు అక్షయకుమారుడు.

"నామాట నమ్మండి. చచ్చి ఎక్కడున్నదోగాని రంగియా అంత క్రూరురాలు కాదు. శనివారం రాత్రి గంగాబాయీ, మల్లజీ రాణీగల్లీలో కలుసుకునేట్టు ఏర్పాటు జరిగింది. అక్కడే అతడు ఆమెకు పదివేలరూపాయలు యిస్తాడు. అడబు ముట్టగానే ఆమె అతడితో కలిసి బొంబాయి పారిపోతుంది. కాని, ఆఖరి నిమిషంలో గంగాబాయికి గుండెధైర్యం చాలక రాణీగల్లీలో మల్లజీని కలుసుకునేందుకు రంగియాకు తనచీర కట్టబెట్టి పంపగలిగింది. రంగియా గల్లీచీకట్లో మల్లజీని కలుసుకుని అతడు గుర్తించేలోపలే అతణ్ణించి పదివేలూ గుంజుకుని పారిపోయి హౌరాస్టేషనుకు వచ్చేట్టూ ఏర్పాటు జరిగింది."

"బహుమంచి ఏర్పాటు! తరవాత?" అన్నాడు అక్షయుడు ఉత్సాహంగా.

"రంగియానుంచి యీ సమాచారం అంతా విన్నతరవాత నే నామెకు ఒక సలహా యిచ్చాను మల్లజీనుంచి డబ్బు గుంజుకుని ఆమె హౌరాస్టేషనుకు పోయి గంగాబాయికి యివ్వకుండా, సరాసరి నావద్దకు రమ్మన్నాను – నేను గంగఒడ్డునే వేచి వుంటానని చెప్పాను. ఆ తరవాత ఇద్దరంకలిసి ఢిల్లీపోయి, ఆధనంతో ఏ వ్యాపారమో ప్రారంభించి సుఖంగా బతకవచ్చునని సలహా యిచ్చాను. రంగియా ఒప్పుకున్నది," అన్నాడు ఉమాచంద్.

"అందుకే ఘోరమైన చావు చచ్చింది తరవాత!" అన్నాడు మరింత ఉత్సాహంగా.

"ఆరాత్రి నేను గంగఒడ్డున ఆమెకోసం ఎదురుచూస్తూ నిలబడ్డాను. రంగియా నోట్లకట్టతో పరిగెత్తుకుంటూవచ్చి, నా కిచ్చింది. కాని, భయంతో వణికిపోతూ సరిగా మాట్లాడలేకపోయింది. మాటల ధోరణినిబట్టి హుజూరీమల్లజీ హత్యచేయబడ్డాడని గ్రహించాను."

"అతణ్ణి ఎవరు హత్యచేశారని చెప్పింది?" అని ప్రశ్నించాడు అక్షయుడు.

"రంగియా, ఆసంగతే చెప్పబోతుండగా. ఒక పొడవాటి గడ్డంవాడు తళతళ మెరిసే కత్తితో పరిగెత్తుకుంటూవచ్చి ఆమెమీది కురికాడు. ప్రాణభయంతో నేను అక్కణ్ణించి పారిపోయాను," అన్నాడు ఉమాచంద్

"గొప్ప ప్రియుడివి! సరే, ఆధనం యిప్పుడు నీదగ్గిరేవున్నదా?" అని అడిగాడు అక్షయకుమారుడు.

"లేదు. ఆతరవాత జరిగిన గొడవంతాచూసి, ఆనోట్లు మార్చబోతే పట్టు
బడితానని భయపడి ఆపదివేల రూపాయల నోట్లనూ గురుగోవిందసింగుకు
మారువేషంలోవెళ్ళి యిచ్చేశాను." అన్నాడు ఉమాచంద్ ఎంతో విచారంగా.

"ఆమహానుభావుడివి నీవేనా. మంచిపని చేశావు. ప్రస్తుతానికి నీమాటలు
సత్యమనినమ్మి నిన్ను అరెస్టుచేయకుండా వదులుతున్నాను. ఈ సంగతులు నాతో
చెప్పినట్టు ఎవరికీ తెలియకూడదు. అర్థమైందా?" అన్నాడు అక్షయకుమారుడు.

ఉమాచంద్ చేతులుజోడించి అతడికి నమస్కరిస్తూ, తలవూపాడు. తరవాత
అక్షయ నగేంద్రులు షాపునుంచి బయటికి వచ్చారు. వాళ్ళు బజారువెంట ఓ నూరు
గజాలు పోయారోలేదో, వారికి యమునాదాసు ఎదురయ్యాడు అతడి వాలకం
చూస్తుంటే చాలా రోషంగావున్నట్టు కనిపించాడు.

యమునాదాసు, అక్షయుడికి నమస్కరించి, "ఇన్‌స్పెక్టరుగారూ, మీరు
నే వివాహం ఆడబోతున్న గంగాబాయిని హంతకురాలన్నట్టు ప్రశ్న లడిగారట.
ఇదేం బావులేదు." అన్నాడు కోపాన్ని దిగమింగుతూ.

"హంతకుణ్ణి పట్టే ప్రయత్నంలో నేను అనేకుల్ని అనేకవిధాల ప్రశ్నించవలసి
వస్తుంది. అందులోని బాగోగులతో నాకు పనిలేదు. మీరు నగేన్‌బాబు మిత్రులు
గదా? ఈ హత్యలవిషయంలో మాకు తోడ్పడతా రనుకున్నాను." అన్నాడు
అక్షయకుమారుడు

ఆ మాటల్తో యమునాదాసు మెత్తబడిపోయి, "అక్షయబాబూ, నా తొందర
పాటుకు విచారిస్తున్నాను. గంగాబాయి నాకాబోయేభార్య. ఆమెను మీరు శంకించారని
విని ఉద్రేకపడిపోయాను. ఇప్పుడు మీకు ఒక వాగ్దానంచేస్తున్నాను. హంజూరీమల్లు,
గంగియాలను హత్యచేసిన వ్యక్తిని పట్టుకునేందుకు నాశక్తికొలదీ మీకు తోడ్పడ
తాను," అన్నాడు.

"చాలా సంతోషం," అన్నాడు అక్షయకుమారుడు.

"ప్రస్తుతానికి శలవు. తొందరపనిమీద పోతున్నాను, మళ్ళీ తమను కలుసు
కుంటాను," అంటూ యమునాదాసు చరచరా అక్కణ్ణించి నడిచిపోయాడు.

"మీ మిత్రుడు మనకు తోడ్పడతానని ప్రతిజ్ఞ చేశాడు. ఇంకేం మనం హాయిగా
ఇంట్లో కూర్చోవచ్చు." అంటూ అక్షయుడు వ్యంగ్యంగా నవ్వాడు. నగేంద్రుడి
క్కూడా యమునాదాసు బీరాలకు నవ్వు వచ్చింది.



# 7

రెండురోజుల తరవాత ఒకనాటి ఉదయం పదిగంటల వేళ నగేంద్రుడికి డిటె క్టివ్ అక్షయకుమారుడినుంచి వెంటనే రావలసిందిగా పిలుపువచ్చింది. ఆ వార్త తెచ్చిన పోలీసుజవానుతో కలిసి నగేంద్రుడు హడావిడిగా అక్షయుడింటికి వెళ్ళాడు అక్కడ అక్షయుడితో మాట్లాడుతూ ఉమచంద్ వుండటం చూసిన నగేంద్రుడికి చాలా ఆశ్చర్యం కలిగింది

"నగేన్‌బాబూ! ఈ ఉత్తరం చదవండి ఇది యీ ఉదయమే పోష్టులో ఉమచంద్‌కు వచ్చింది," అంటూ అక్షయకుమారుడు కవర్లోనుంచి ఒక కాయితం తీసి నగేంద్రుడికిచ్చాడు. నగేంద్రుడు ఉత్తరం సాంతం చదివాడు. అందులోని విషయం ఏమిటంటే – ఆ రోజు రాత్రి పదకొండు గంటల వేళ ఉమచంద్ ఆ వుత్తరం రాసినవ్యక్తిని ఏడన్‌గార్డెన్స్‌లోని ఆగ్నేయ మూలనున్న సిమెంటు బెంచీదగ్గర కలుసుకోవాలి ఒంటరిగా మాత్రం రావాలి ఉత్తరం రాసినవాడు అతడికి హజూరీమల్లు, రంగియాలను చంపిన వాడెవడైనదీ చెపుతాడు ఉమచంద్ ఆ బెంచీదగ్గిర వుంటే ఒక పెద్దమనిషి వచ్చి చుట్ట ముట్టించుకునేందుకు అగ్గిపుల్ల అడుగుతాడు. అతడే యీ వుత్తరంరాసిన వ్యక్తి అని ఉమాచంద్ గ్రహించవచ్చు....

"ఏం చేయబోతున్నారు, అక్షయకుమారబాబూ?" అని ప్రశ్నించాడు నగేంద్రుడు ఆవేశపడుతూ.

"ఉమాచంద్ అతణ్ని చూడబోతున్నాడు మనంకూడా రహస్యంగా ఆ పొంతాలవున్న పొదలచాటున వుండి, ఏం జరుగుతుందో చూడబోతున్నాం. హంతకుడు వీడే అని నా అభిప్రాయం," అన్నాడు అక్షయకుమారుడు

"నాకూ అలాగే తోస్తున్నది. ఉమాచంద్ తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవటమేగాక, తన ప్రియురాల్ని హత్యచేసిన వాడిమీద పగకూడా తీర్చుకునే అవకాశం వచ్చింది," అన్నాడు నగేంద్రుడు

ఉమాచంద్ కళ్ళు నిప్పులు చెరుగుతున్నవి అతడు గుప్పెళ్ళు గట్టిగాబిగించి, 'నిజంగా వాడే హంతకుడైతే వాడిమెడ యీ చేతులతో పట్టి మెలవేసి చంపుతాను," అన్నాడు పళ్ళుకొరుకుతూ

"అంతపని చెయ్యకు; వాడిమెడకు ఉరితాడు తగిలించేట్టు చూడవలసిన బాధ్యత నామీద చాలావుంది," అన్నాడు అక్షయకుమారుడు.

ఆతరవాత రాత్రి ఏడన్ గార్డెన్స్‌లో ఉమాచంద్ ఆ ఉత్తరం రాసినవాణ్ణి కలుసుకున్నప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి అతడికి అక్షయకుమారుడు బోధపరిచాడు. అంతా శ్రద్ధగావిని ఉమాచంద్ సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు. అక్షయ నగేంద్రులు హత్యకేసుల్లో యింతవరకూ దొరికిన సాక్ష్యాధారాలూ, అనుమానాల్ని గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు రంగియాను హత్య చేసేటప్పుడు, కబ్బుతో పారిపోయిన ఉమాచందును హంతకుడు గుర్తించాడనీ, ఇప్పుడు అతణ్ణించి డబ్బు లాగేందుకే యీ ఎత్తువేసి అతణ్ణి ఏడన్ గార్డెన్స్‌లో కలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాననీ వాళ్ళు నిర్ణయించుకున్నారు.

---

రాత్రి పదిగంటల వేళకే అక్షయ నగేంద్రులు ఇద్దరు పోలీసులతో ఏడన్ గార్డెన్స్‌లోని ఆగ్నేయ మూలనున్న సిమెంటు బెంచీకి అల్లంత దూరంలోవున్న పెట్లపొదల్లో దాగారు. పదకొండుకు యింకా పావుగంట వున్నదనగా ఉమాచంద్ అక్కడికి వచ్చాడు. గార్డెన్స్‌లో అప్పటివరకూ పలచ పలచగావున్న జనం మొంతం బయటికి వెళ్ళిపోయారు. గార్డెన్స్ గోడ అవతలవున్న రావుబహద్దర్ మల్లికబాబు భవనంలోనుంచి గోడ గడియారం రంగు రంగున పదకొండు గంటలు కొట్టింది. ఆవెంటనే ఒక బారుగడ్డంవాడు, గార్డెన్స్ తూర్పువైపునుంచి గబగబా



ఉమాచంద్ దగ్గరకు నడిచివచ్చి అగ్గిపెట్టెకోసం అడిగాడు. ఉమాచంద్ అతడికి మౌనంగా అగ్గిపెట్టె యిచ్చాడు.

గడ్డంవాడు చుట్ట ముట్టించుకోవటం పూర్తికాగానే, ఉమాచంద్ వణుకుతున్న స్వరంతో, "నన్నెందుకు యిక్కడికి రమ్మని రాశారు?'' అని ప్రశ్నించాడు.

గడ్డంవాడు చిన్నగా నవ్వి ' వేయి మాట లెందుకు, రంగియా నీకిచ్చిన డబ్బు నా కిచ్చెయ్యి.'' అన్నాడు.

''ఆ డబ్బు నా దగ్గర లేదు,'' అన్నాడు ఉమాచంద్.

"ఆరకం మోసపు మాటలు నా దగ్గిర పనిచెయ్యవు. ఆ డబ్బు నా కివ్వక పోయావో, నీవే హంతకుడివని అరెస్టు చేయిస్తాను,'' అన్నాడు గడ్డంవాడు కోపంగా

"నేను ఖూనీ చేశానా? నువ్వు రంగియాను కత్తితో పొడవటం యీ కళ్ళతో చూశాను నీవు నా జీవితం నాశనం చేశావు," అంటూ ఉమాచంద్ ఆక్రోశించాడు.

''రంగియాను పొడిచి చంపినదాని కంటే ఘోరంగా...నిన్ను చిత్రవధ చేస్తాను. ఆ డబ్బు ఎక్కడ దాచావు? నేనే హంతకుణ్ణయినా నువ్వు నన్ను గుర్తించలేవు. రంగియా, నీవూ పన్నిన పన్నాగం తెలిసే ఆ రాత్రి నేను

రంగియాను అనుసరించిపోయి, ఆమె హుజూరీమల్లు నుంచి డబ్బుసంచీ గుంజుకో లేక అవస్థపడుతున్నప్పుడు, మల్లుగుండెల్లో కత్తిగుచ్చి ఆమెకు సాయపడ్డాను; కాని, యింతలో రంగియా ఆ చీకట్లో లేడిలా పరిగెత్తిపోయింది. వెంటబడి గంగ ఒడ్డున పట్టుకుంటే, నువ్వు ఆ డబ్బుతో పారిపోయావు. సరే, జరిగిందేదో జరిగి పోయింది ఆ డబ్బు నా కిస్తావా, లేక, అంటూ గడ్డంవాడు బొడ్లోనుంచి కత్తి చప్రున దూశాడు. కత్తి చూస్తూనే ఉమాచంద్ కెవ్వుమన్నాడు. అదే క్షణంలో బెంచీ వెనకవున్న పొదల్లోనుంచి అక్షయుడు బయిటికి దూకి గడ్డంవాడి మీద పడి, కత్తి లాక్కున్నాడు. గడ్డంవాడు పారిపోయేందుకు పెనుగులాడసాగాడు, కాని పోలీసులు వాణ్ని పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు.

"నగేన్‌బాబూ! ఈ మహానుభావు డెవడో తెలియటం లేదు. కాని స్టేబిల్స్ యిద్దరూ వాడు పారిపోకుండా పట్టుకుని ఉన్నారు. మీరు కొంచెం వెళ్ళి ఆ పొదల్లో వున్న లాంతరు తెండి," అన్నాడు డిటెక్టివ్ అక్షయకుమారుడు.

నగేంద్రుడు మినుకుమినుకు మంటున్న లాంతరు తీసుకువచ్చి, హంతకుడి ముఖందగ్గర దాన్ని పెడుతూ వత్తి పైకెత్తాడు. ఇంతలో అక్షయకుమారుడు హంత కుడి గడ్డం పట్టుకుని గట్టిగా గుంజాడు. గడ్డం వూడివచ్చింది. అందరూ హంత కుడి ముఖం చూస్తూనే నిర్విణ్ణు లయిపోయారు.

''యమునా దాసూ! నువ్వా హంతకుడివి?'' అన్నాడు నగేంద్రుడు అమి తాశ్చర్యంగా

"అవును, నగేన్! డబ్బాసే నన్ను మీ చేతికి పట్టిచ్చింది. హుజూరీమల్లు ఇంటవున్న ఇద్దరు స్త్రీలనూ: రంగియా, గంగాబాయిలను చెరొకరం వాడుకో జూశాం. వా ళ్ళిద్దరికీ ఆ ఇంటి రహస్యాలన్నీ తెలుసు ఆ పదివేల రూపాయిల నోట్లూ తన ప్రియురాలైన రంగియా సాయంతో ఉమాచందు కాజేయా లనుకు న్నాడు. నా ప్రియురాలైన గంగాబాయి సాయంతో నేను గుంజుకోవాలనున్నాను, నేను ఓడిపోయి, హంతకుణ్ణయి మీకు పట్టుబడ్డాను - ఇంతకీ ఉమాచందు అదృష్ట వంతుడు ప్రియురాలు పోయినా డబ్బు మిగిలింది,'' అన్నాడు యమునాదాసు కటువుగా

"ఆ పదివేలనోట్లూ ఉమాచందు, గురుగోవిందసింగుకు యిచ్చేశాడు," అన్నాడ అక్షయకుమారుడు.

"ఇచ్చేశాడా ? ఎప్పుడు ? ఆ సంగతి తెలిస్తే, అత ణ్ణిక్కడికి పిలిచి, యి ప్రమాదంలో చిక్కుకునేవాణ్ణి కాదే!'' అన్నాడు యమునాదాసు విచారిస్తున్నట్లు

''ఇప్పుడే అంతదిగులుపడకు యమునాదాసూ, న్యాయవిచారణ పూర్తయి, నీవ ఉరికంబం ఎక్కేలోపల విచారించవలసినవీ, దుఃఖించవలసినవీ నీకు చాలా తటస్థ పడతై,'' అన్నాడు డిటెక్టివ్ అక్షయకుమారుడు

"ఇది నే రాద్దామనుకునే నవలకన్నాకూడా అద్భుతంగా వుంది!'' అంటు ఆశ్చర్యపోయాడు నగేంద్రుడు

డిటెక్టివ్ అక్షయకుమారుడు నగేంద్రుడికేసి చిరునవ్వు నవ్వి, జేబులోనుం అరదండాలుతీసి, యమునాదాసు చేతులకు తగిలించాడు. తరువాత అందరూ అక్క ణ్ణించి పోలీసురాణాకు బయలుదేరారు



# ఒంటరి- ఎర్రగులాబి

*

మారేమండ సీతారామయ్య

ఆకాశం విలపిస్తున్నది
మేఘాలలో దాచుకున్న కన్నీటితో భూమాతను అభిషేకం చేస్తోంది!

నా గదిలోకి ఓ మెరుపు వచ్చి పలకరించిపోయింది. లేదు...లేదు...నా పరిస్థితిని చూసి పరిహసించి పారిపోయింది.

అవును! నా పరిస్థితిపై నాకే జాలి వేస్తోంది

దూరంగా ఎక్కడో రిక్షామోత!

దగ్గరలో-ఎదలో ఘోష!

బల్లమీద మూర్తి, శాంతి వ్రాసిన ఉత్తరాలు గాలికి రెపరెపలాడుతున్నాయి.

ఒకేరోజు ఇద్దరు ఆత్మీయుల వద్ద నుంచి ఉత్తరాలు.

ఆ ఉత్తరాలలో ఇద్దరి ఆక్రోశం ఒకటే! ఒకటే ఒక ప్రధాన విషయం!

నా మీద వారి కెందు కింత శ్రద్ధ?

తెగిన గాలిపటం దూరంగా వెళ్ళిపోతుంది!

గాలిపటం లాంటిదే నా జీవితం కూడా!

కాని ఎంత ప్రయత్నించినా దూరంగా పోవటం లేదు! ప్రాపంచిక ప్రభావం ప్రయత్నించినా పోవటం లేదు!

ఇంత నిరాశా చీకటిలోనూ ఎక్కడో ఓ చిన్న ఆశా మిణుగురుపురుగు

గతాన్ని మరచిపోయి, గడవబోయే కాలాన్ని గురించి ఆశాభావన!



టేబుల్ మీద బుద్ధ భగవానుని విగ్రహం ప్రశాంతతలో ప్రకాశిస్తోంది

అర్ధనిమీలితమైన ఆ మూర్తిలో ఏదో సందేశం! ఏదో తేజస్సు!!

కాంతిలేని జీవితాలకు ప్రశాంతి చేకూర్చే సందేశం! కాంతిలేని జీవితాలకు వెలుగుబాట ఆ తేజస్సు!

"నువ్వు కాదనటానికి వీల్లేదు! నే చెప్పినట్టు జరిగితీరవల్సిందే లేకపోతే ఈ జన్మకి నీకూ నాకూ సంబంధం లేదు!" ప్రక్క ఇంటిలో తండ్రీ కొడుకుల కీచులాట!

కీచులాటా? కాదు! రాజీకి హెచ్చరిక!

గాలి గట్టిగా వీచింది.

టేబుల్ మీద పుస్తకంలోంచి ఓ కాగితం ఎగిరి కాళ్ళకు చుట్టివేసింది!

శాంతి ఇచ్చిన కడసారి బహుమానం!

బాలభాస్కరుడు రెండుకొండల నడుమునుంచి తొంగిచూస్తూ పసిడి పంట చేలోకి కిరణాలు ప్రసరింప చేస్తున్నాడు. ఆ ప్రశాంత ప్రకృతిలో మర్రిచెట్టు క్రింద ఓ యువకుడు అర్ధ నిమీలితుడై గానం చేస్తున్నాడు!!

క్రింద "హృదయపూర్వకంగా - శాంతి!"

ఓనాడు ఆ చిత్తరువు నా ఆరాధ్య దైవం!

కాని నేడు......

కిటికీ తలుపులు బాధగా కిర్రు మన్నాయి!

మదిలోని తలపులతో మనస్సు చివుక్కుమంటోంది!

"రాముడూ! ఎడారిలో మన అడుగుజాడ లుండాలి! మన తర్వాత మన సంతానం ఆ జాడల్లో నడవాలి!"

మూర్తి ఉత్తరంలో మాటలు—

"ఒక స్త్రీ నుండి నువ్వు ఆశించేది ప్రేమేనా? ఆ ప్రేమ సోదర ప్రేమ కాకూడదా?" శాంతి సూటి ప్రశ్న.

మూర్తి ఉత్తరం ఎందుకో మళ్ళా చదవాలనిపించింది!

"రాముడూ!"

ఎంత చల్లని సంబోధన! ఆప్యాయతకీ, అనురాగ స్రవంతికీ ప్రతిబింబం, ఆ చల్లని పిలుపు.

"మొన్న మీనాన్నగారి వద్దనుంచి ఉత్తరం వచ్చింది. నీ గురించి చాలా వ్రాశారు నేను ఆ మాటలు వ్రాయలేక నీకు పంపుతున్నాను. ఒక్కసారి చదువుకో! కాని ముందు ఓ మాట!

"తెగిన వీణె రాగాలు పలికించలేదు! ఎడారిలో మొక్కలు పుష్పించలేవు!! మోడువారిన మనస్సులలోను, బండబారిన మనస్సులలోను, మమతా, అనురాగాలు ఉండవు!" అని నాకో ఉత్తరం వ్రాశావు. అంత నిరాశగా ఎందుకు వ్రాశావు? జీవితంలో ప్రేమించవచ్చు కాని దాని ఫలితం వివాహం అవవచ్చు! కాకపోవచ్చు తెగిన వీణకు తీగలు వేయవచ్చు. ఎడారిలోకూడా ఒయాసిస్సులుంటాయి కదూ! నీ హృదయం బండగా మారి ఉండచ్చుగాని, స్వతహాగా బండ కాదుగా! ఐనా అమావాస్య తరువాత పౌర్ణమి రాకుండా ఉంటుందా? రాత్రి అంతమై పగలు రాజ్యం ఏలదూ? హేమంతం ప్రవేశిస్తే వసంతకాలం దూరంగా ఉండగలదా?

మన జీవితాలలో విచిత్రమైన సంఘటనలు అనేకం జరగవచ్చు. అందులో నీ ప్రేమ ఒకటి! గతం మరచి భవిష్యత్తుకు బంగారు బాట నిర్మించు! మార్గంలోని ముళ్ళను ఏరి నీ మార్గం ప్రయాణదాయకం చేసుకో! ఎడారిలో మన అడుగుజాడలుండాలి! మనతరువాత మనసంతానం వాటిల్లో

నడవాలి! పెళ్ళిలేని జీవితానికి అర్థం లేదు! జన్మసార్థకతకు అవకాశంలేదు! ప్రేమ త్యాగాన్ని, కామం ఫలాన్ని కోరుతుందట! నువ్వు ప్రేమించావు కాని కామించలేదుగా? నీవు పెళ్ళి చేసుకోపోటానికి నీ భగ్న ప్రేమ కారణం కాకూడదు! ఉత్తరం వెంటనే వ్రాయి!''

దానిలోనే నాన్నగారి ఉత్తరం ''మూర్తీ!

నీవు క్షేమమని తలుస్తాను మా రాముడు దగ్గరనుంచి ఉత్తరాలు రావటంలేదా! ఏ నెల్లాళ్ళ కొకసారో వ్రాస్తున్నాడు. మొన్న పెళ్ళి విషయం గురించి వ్రాస్తే ఇప్పటిలో చేసుకునే ఉద్దేశ్యంలేదని వ్రాశాడు వృద్ధాప్యంలో వాడి పిల్లలను చూస్తూ కాలం గడపాలని, వారితో ఆడుకోవాలని కోరికలు మాకు ఉండటం సహజమే! మాకు పుట్టిన ఆడపిల్లకు ఆరేండ్ల ప్రాయంలోనే నూరేండ్లు తీరిపోయాయి! ఇకవీడు చూస్తే పెడముఖం. మా వంశవృక్షానికి, కాయలు పండ్లు వేరేలేవు! ఆ వృక్షం ఇంక చిగురించబోదేమో! నువ్వు ఈ విషయంలో కొంచెం ప్రయత్నించు! మండే మా వృద్ధ దంపతుల ఎదకు, కొంత శాంతి ప్రసాదించే యత్నం చేయి!'' నాకు ''శాంతి'' లేకపోవటం వల్ల మీరుకూడా శాంతిరహితులయ్యారు!......''

పాపం!

కన్నీటిని కడుపులో, బాధలు ఎదలో దాచుకొని, పైకి నా సుఖం కోసం ఏమీ అనలేని పుణ్యమూర్తులు! శాంతికవరు!

అర్ధముకుళితమైన ఎఱ్ఱగులాబి కుసుమండి మాలగా చిత్రించబడి ఉంటుంది సిగ్గుతో తలదించుకుని నేలను బొటనవ్రేలుతో వ్రాసే ఆమె జ్ఞాపకం వస్తోంది ఆ గులాబీని చూడగానే! తన నైపుణ్యాన్ని మూర్తీభవింప చేసి చిత్రించిందికామోను!

కవరుమీద పొందికగా అక్షరాలు!

''డియర్ రామ్''

మూర్తిగారి ద్వారా నీ అడ్రస్ తెలుసుకున్నాను. ''నీవు ఈ ఊరు నుండి ఎప్పుడు వెళ్ళిపోతావు, నాకు తెలియపరచగోరెదను'' అని వ్రాసిన నా ఉత్తరానికి జాబులేదు! సరికదా మనిషివి కనిపించకుండా వెళ్ళిపోయావు. ఆఫీసులో వాకబుచేస్తే ట్రాన్స్ ఫర్ అయిపోయిందని చెప్పారు. నా నుంచి అంతదూరంగా వుంటావెందుకు నా పేరు శాంతిగాని, నీ పాలిటి అశాంతినయ్యాను నీ ఎదలో ఎన్నో ఆశలు పెంచాననుకుంటాను. పెంచుకున్న ఆ ఆశలతోనే నీ హృదయంలో ఓ మందిరం నిర్మించి పూజారివై

అక్కడ నా గురించి నిరీక్షించావు! కాని తప్పంతా నాది. నేను నా బావ గురించి పుట్టాను. ఆయన చాలా సోష ల్‌గా ఉంటారు. అందుకే నా ఈ మేనరికం మరుగుపరిచి, నీతో స్నేహం చేశాను! కాని నా స్నేహాన్ని నీవు అపార్థం చేసుకున్నావు. ఒక స్త్రీనుండి నువ్వు ఆశించేది ప్రేమేనా? అది సోదరప్రేమ కాకూడదా? నువ్వు లోకంలో చాలా తెల్సుకోవాలి. ప్రయత్నించు! నా ప్రవర్తనవల్ల నీకు దురభిప్రాయం కలిగించంటే అది నా దురదృష్టం. మనుషులను అర్థం చేసు కోవటం నేర్చుకో! రాబోయే నీ భార్య చాలా అదృష్టవంతురా లౌతుంది స్నేహితురాలుగా నా సహాయసంపత్తులు నీకు ఎప్పుడూ వుంటాయి. ఇష్టం ఉండి, వీలు చిక్కితే జాబు వ్రాయి! నా గురించి ఆలో చించి మనస్సు పాడుచేసుకోకు! త్వరలో నీ పెండ్లి శుభలేఖకు ఎదురు చూసే నీ స్నేహితురాలు,

—శాంతి"

అవును! నిజంగానే నేను తెల్సుకో వలసింది ఈ లోకంలో చాలా ఉంది. ప్రయత్నించాలి!

ఎడారిలో మన అడుగు జాడ లుండాలి.

మన సంతానం ఆ జాడల్లో అడు గులువేయాలి!

మూర్తి వ్రాసిన విషయం సర్వదా సత్యం!

నాన్నగారి ఆందోళన!

మూర్తి పరితాపన!!

శాంతి ఆక్రోశం!!!

ఎందుకు?

నా వివాహ విషయమైకదూ?

నా జన్మదాతలసుఖం, నా ప్రాణ మిత్రుని కోరిక తీర్చటాని కంటే నాకేం కావాలి?

హృదయం తేలికపడింది.

బుద్ధ భగవానుని విగ్రహంలో తేజస్సు పెరిగింది!

ఆకాశం ప్రశాంతంగా ఉంది!

శోకించిన జాడ లున్నాయి కాని, ఆ కన్నీరు ఇంకిపోయింది! మొయిలు లోని నలుపు మాయమై, భూమిలో కల్సిపోయి, స్వచ్ఛంగా ఉంది!

ప్రక్కవాటాలోని తండ్రీ కొడు కులు సినిమాకు పోవటానికి రిక్షా పిలుస్తున్నారు.




"పంతులింకా రాలేదా ?" అంటూ, సాహెబ్ వచ్చి నాయుడికి ప్రక్క కొంచెం దూరంగా కూచున్నాడు. నాయుడు వూరికే తలవూపాడు.

"ఇవ్వాళ నేనే ఆలస్యంగా వచ్చా ననుకుంటున్నాను అందరికన్నా ముందు వచ్చేపంతులు ఇంకా రాకపోవడం, ఏదో విశేషం వుందన్నమాటే" అని సాహెబ్, గడ్డం నిమురుకుంటూ అన్నాడు

"మీరూ రాక. పంతులూ రాక ఒక్కణ్ణే ఎందుకు వచ్చానా. ఇక పోదాం అని ఏమీతోచక కూచున్నాను" అని, తెల్లబడిపోయిన మీసాలను కొనవేలితో సవరిస్తూ నాయుడు అన్నాడు.

"ఏదో పెద్దపనిమీద వుండిపోయి వుంటాడు. కాని అసలు రాకుండా వుండడు" అంటూ సాహెబ్, మామూలుగా పంతులువచ్చే వైపుచూశాడు. నాయుడిదృష్టికూడా అటువైపే మళ్ళింది. సాయంత్రం ఐదున్నరగంటలు అవుతుంది. సముద్రంవైపునుంచి చల్లటిగాలి వీస్తోంది. బీచిలో, ఇసకలో ఎంతోమంది కూచున్నారు. ఇంకా ఎంతోమంది

వస్తున్నారు. తారురోడ్డుపక్కనే వున్న పేవ్‌మెంటుమీద, వరసగా అంతులేని ప్రవాహంలాగా జనం నడుస్తున్నారు కాబట్టి సరిపోయిందికాని లేకపోతే, చెన్నపట్టణంలోవున్న జనమంతా ఒక మూలనుంచి ఇంకొకమూలకి చేరుకుంటున్నారా అని సందేహం కలిగేదే

యూనివర్సిటీ ఎగ్జామినేషన్ హాలుకు ఎదురుగా, సిమెంటుబల్లమీద నాయుడూ. సాహెబూ కూచున్నారు. వారిద్దరికీ మధ్య ఒక మనిషికి చోటు వుంది అది పంతులు కూచునేచోటు.

రోజూ వాళ్ళు ముగ్గురూ అక్కడే కూచుంటారు. ఈనాటి మాటకాదు. ఆరుసంవత్సరాలనుంచి. ప్రతిరోజూ వాళ్ళు ముగ్గురూ, అదే వరసలో - నాయుడూ, పంతులూ, సాహెబూ - అక్కడ కూచుంటున్నారు. మొదట్లో అక్కడ సిమెంటుబల్ల లేదు. నాగమల్లి చెట్టు వుండేది. ఆ చెట్టుక్రింద కూచునేవారు. కార్పొరేషనువారు సిమెంటుబల్ల కట్టించాక, మొదటి రోజునే, యీ ముగ్గురూ దానిమీద కూచున్నారు. అప్పటికీ ఇప్పటికీ అలా కూచుంటూనే వున్నారు.

* * *

నాయుడి స్వస్థలం వెంకటగిరి, ఎక్సైజు డిపార్టుమెంటులో ఇనస్పెక్టరుగా రిటైరయాడు. రిటైరవడానికి నాలుగేళ్ళపూర్వమే, అతడు చెన్నపట్టణానికి బదిలీ అయివచ్చాడు. అతడికి ఒక్కడే కొడుకు. అతడికి ఏదో కంపెనీలో వుద్యోగం దొరికింది. అంచేత నాయుడు చెన్నపట్టణంలోనే వుండిపోవడానికి నిశ్చయించుకున్నాడు ఉద్యోగపు రోజుల్లో సంపాదించుకున్న డబ్బుతో నయితేనేం, రిటైరయినప్పుడు వచ్చిన ప్రావిడెంటుఫండుతో నైతేనేం, రాయపేటలో ఒక చక్కని యిల్లు కొనుకున్నాడు. ఉద్యోగపురోజుల్లో దేవుడనీ, దయ్యమనీ, ఆట్టే తాపత్రయపడలేదు కాని, రిటైరయిన తరవాత మాత్రం, కొంచెం కొంచెంగా దైవభక్తి కలిగింది. సన్‌లైట్‌సోప్ కంపెనీవారు అచ్చువేసిన లక్ష్మీ సరస్వతుల బొమ్మలకూ, శ్రీకృష్ణుడి బొమ్మకూ అద్దాలుకట్టించి, ప్రొద్దుటిపూట శుచిగా ఆ బొమ్మలముందు నిలబడి అరగంటసేపు ప్రార్థనచెయ్యడం ఒకవిధిగా పెట్టుకున్నాడు. సాయంత్రంపూట చల్లగాలికి బీచికి రావడం అలవాటు చేసుకున్నాడు. కొత్తలో ఒక చివరినుంచి మరొక చివరికి బీచిపొడుగునా పచారుచేసేవాడు. కాని, ఏళ్ళు జరిగినకొద్దీ ఓపికతగ్గి అక్కడక్కడ చతికిలపడేవాడు. ఓరోజు, పంతులుకూచునే నాగమల్లి చెట్టుదగ్గర చతికిలపడ్డాడు ఆ యిద్దరికీ మాటలు కలిశాయి

* * *

పంతులు గోదావరిజిల్లావాడు. చాలాకాలం కలెక్టరాఫీసులో పనిచేశాడు.



అదృష్టం తిరిగి, పదేళ్ళ వ్యవధిలో గబగబా ప్రమోషను పొంది తాసిల్దా రయాడు. తాసిల్దా రయేటప్పటికి, ఉద్యోగపరిమితి ముగిసి, అంత కన్న ఎక్కువ ప్రమోషను పొంద టానికి వ్యవధి లేకపోయింది. రిటై రయాడు. కొంతకాలం స్వగ్రామమైన రామచంద్రపురంలో వున్నాడు. కాని, తన ఒక్కగా నొక్కకూతురూ చెన్న పట్టణంలో వుండటంచేత, తనుకూడా అక్కడికి చేరాడు. అల్లుడు ప్లీడరు. తాను సంపాదించిన ఆస్తి అంతా తన కూతురికి అప్పజెప్పవలసిందే. తన ఫించను డబ్బులు తానూ, తన భార్యా తినగా, ఇంకా నలుగురికి పెట్టడానికి కూడా పనికివస్తాయి. అంచేత తను, అల్లుడి ఇంట్లో ఎన్నాళ్లు వున్నా అభ్యంతరంలేదు. కంటకపడేవాళ్ళు ఎవరూ లేరు. కొత్తలో తను అల్లుడికి అతిథిగానే వున్నా, కొంతకాలం గడిచే టప్పటికి, ఇంటి సద్దుబాటు అంతా పంతులుమీదనే పడింది. అల్లుడి సంపాదన అంత పెద్దది కాకపోవడం వల్లా, తనకూతురి కడుపు పండి నాలుగు కాయలు కాయడంవల్లా, ఎలాగయితేనేం, అల్లుడే తన ఇంట ఇల్లరికం వున్నట్టుగా స్థితిగతులు చక్కపడ్డాయి. చెన్నపట్టణం వచ్చినప్పటినుంచీ పంతులు బీచికి రోజూ వెడుతూనే వున్నాడు. మొట్టమొదటి రోజునే, ఆ నాగమల్లిచెట్టు అతణ్ణి ఆక ర్షించింది. దానిక్రింద కూచున్నాడు. అప్పటినుంచీ అక్కడే కూచుంటున్నాడు. కార్పొరేషనువారు, సిమెంటుబల్లను కట్టించడానికి ఆ చెట్టును కొట్టివేయించి నప్పుడు పంతులుకు చాలా కష్టం కలి గింది.

* * *

సాహెబ్ చెన్నపట్టణంలోనే

పుట్టాడు. అక్కడే పెరిగాడు. పోలీసు డిపార్టుమెంటులో చేరాడు. పట్టుదలతో పని చెయ్యడంవల్లా, ఆ రోజుల్లో ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళు పోలీసు డిపార్టుమెంటులో తక్కువగా వున్నందు వల్లా త్వరగా సర్కిల్ అయాడు తరువాత డిప్యూటీ సూపరింటెండెంటు అయాడు. చాలారోజులు తెలుగుజిల్లాలలో పనిచెయ్యడంవల్ల, తెలుగు బాగా వచ్చింది. తనభార్య చిత్తూరుజిల్లా మనిషి కావడంవల్ల ఇంట్లోకూడా హిందుస్తానీ మాట్లాడని సందార్భాలలో తెలుగే మాట్లాడుకుంటూ, వుండేవారు సాహేబుకు నలుగురు కొడుకులు. నలుగురూ కూడా గవర్నమెంటు ఉద్యోగాలలో వున్నారు పెద్దకొడుకు చెన్నపట్నంలోనే పోస్టుమేస్టరుగా ఉన్నాడు. అంచేత, తన జన్మస్థలమైన చెన్నపట్టణంలోనే సాహెబ్‌కూడా నివాసం ఏర్పరచుకొన్నాడు. ఓరోజున సాహెబు ఆడవాళ్ళను బీచికి తీసుకు వచ్చాడు. నాయుడూ, పంతులూ కూచున్నచోటనే, ఆడవాళ్ళు పరదాకట్టిన రిక్షాలోనుంచి దిగి, సముద్రపు ఒడ్డుకు వెళ్ళారు. సాహెబు అటూ, ఇటూ తిరిగి, ఆడవాళ్ళతోటిపాటు సముద్రపు ఒడ్డుకు వెళ్ళడం ఇష్టంలేక, పంతులు పక్కన వచ్చి కూచున్నాడు. నాయుడూ, పంతులూ మాట్లాడుకుంటుంటే, మెల్లిగా తానుకూడా కబుర్లలోకి దిగాడు. సాహెబు కుటుంబం, సముద్రపు ఒడ్డునుంచి మళ్ళీ రిక్షాల దగ్గరకు వచ్చేటప్పటికి సాహేబు సంగతి నాయుడికీ, పంతుళ్ళకీ, వాళ్ళిద్దరిసంగతీ సాహేబుకూ కొంతవరకు అవగతమైంది. మరునాటినుంచీ సాహేబుకూడా రోజూ బీచికి పోవడం సాగించాడు.

ముగ్గురూ ఉద్యోగాలనుంచి రిటైరయినవాళ్ళే; ఒకటి రెండు సంవత్సరాల తేడాలో, ముగ్గురూకూడా అరవయ్యో పడికి సమీపంలోనివారే. అంచేతనో ముగ్గురి హృదయాలూ కలుసుకున్నై. ప్రతిరోజూ ముగ్గురూ బీచికి వస్తారు. అక్కడే కూచుంటారు. ఏదో సంగతులు. చెప్పుకుంటారు. ముగ్గురూ మూడు డిపార్టుమెంటుల్లో పనిచేసినవాళ్ళు. ఎన్నో అనుభవాలు వుంటాయి. అవన్నీ ఒకరికొకరు చెప్పుకుంటారు. హృదయాలు కలిసిన తరువాత, ఒక వ్యక్తివద్దనుంచి మరొకవ్యక్తి స్వార్థాన్ని ఏమీ కోరనప్పుడు, ఒకరికొకరు కష్టసుఖాలను, ఇంటిసంగతుల్నికూడా మర్మం విడిచి చెప్పుకుంటారు. వాళ్ళకి ఒకవిధమైన ఆత్మీయత ఏర్పడుతుంది. ఈ ముగ్గురిలోనూ అలాటి నిష్కల్మషమైన ఆత్మీయత కలిగింది.

బీచికి రోజూ వచ్చేవాళ్ళందరూ, యీ ముగ్గుర్నీ చూడకపోలేదు. విడువకుండా ప్రతిరోజూ అలా అక్కడే కూచునే యీ త్రిమూర్తులు ఎవర్రా అని కొంతమందికి అనిపించకపోలేదు.



ఎప్పుడూ ఆ బల్లను ఆక్రమించుకుని, మన మెవరం కూచోకుండా చేస్తున్నారే అని కొందరు విసుక్కోకపోలేదు.

కాని, యీ ముగ్గురుమిత్రులూ, ఇతరుల భావాలనూ, ఇతరుల ఆలోచనలనూ ఊహించలేదు. తమ ప్రపంచం తమది. పగలంతా ఏ పనుల్లో, ఎలా కాలం గడిపినా, సాయంత్రం ఆ బీచిలో ముగ్గురూ కలుసుకునేటప్పటికి, వారికి మిగతా ప్రపంచం ఎందుకూ అక్కరకు వచ్చేదికాదు. తమ ధోరణే తమది. ఆ ముగ్గురూకూడా, ఒకరినుండి మరొకరు లాభా న్నేమీ పొందగోరలేదు. ఒక్కొక్కరిది ఒక్కొక్క ఒంటరితనం. ముగ్గురూ కలిసినప్పుడు, వారిది ఒక ప్రత్యేకమైన, సంయుక్తమైన ఒంటరితనం ఎవరి ఒంటరితనాన్ని వారు మరచిపోయేవారు.

పంతులు రాకపోవడంవల్ల, నాయుడికీ, సాహెబ్‌కీకూడా ఏమీ తోచలేదు. వాళ్ళిద్దరికీ మధ్య పంతులు కూచునే జాగా ఖాళీగా వుంది. రోజూ వీళ్ళని చూస్తూ, పేవ్‌మెంటుమీద నడిచేవాళ్ళు ఇవ్వాళ్ళ వీళ్ళిద్దరిమధ్యా ఏర్పడిన ఖాళీని గమనించకపోలేదు.

చీకటి పడవస్తోంది. ఇంకా పంతులు రాలేదు.

"ఏంచేత నంటారు?" అని నాయుణ్ణి ప్రశ్నించాడు సాహెబ్. నాయుడు మాత్రం ఏం చెప్పగలడు?

"ఏమైనా జబ్బు చేసిందేమో?" అని అనబోయాడు కాని, అంతమాట అనడానికి అతడికి మనస్సు ఒప్పలేదు.

"ఏమో సార్, ఆశ్చర్యంగా వుంది," అనేసి వూరుకున్నాడు.

ఇంతలో నలుగురు కుర్రాళ్ళు ఆ

సమీపంలోకి వచ్చారు. వాళ్ళు కొంచెం అల్లరిబాపతు. అవతలివాళ్ళ మనస్సు ఎలా వుంటుందో, ఏం బాధపడుతుందో ఆలోచించకుండా, ఎవరినిబడితే వారిని, తమకు ఏ మాటతోస్తే ఆమాట అనేసే రకం. వాళ్ళు రోజూ యీ ముగ్గురు మిత్రుల్నీ చూస్తూనే వున్నారు. కాని, కట్టుగా కూచునే ఆ ముగ్గుర్నీ ఏమీ అన లేకపోయేవారు. ఇవ్వాళ, వీరి లో ఒకరు తక్కువ అయేసరికి, వాళ్ళకి ధైర్యం వచ్చినట్టుంది; వీరి లోకువ కన పడినట్టుంది.

"మధ్యవాడు రాలేదే ఇవ్వాళ!" అని ఒక డన్నాడు.

"చాలారోజులు బ్రతికాడులే, ఎగిరి పోంటాడు," అని మరొక డన్నాడు. కాలేజీ చదువును ఇంత గొప్పహాస్యా నికి వినియోగించినందుకు, మిగిలిన ఇద్దరూ గొప్ప ఆనందంతో నవ్వారు. ఈ కాస్తపని చేసి వాళ్ళదారిన వాళ్ళు వెళ్ళి పోయారు.

ఈ మాటలు నాయుడికీ, సాహే బుకూ వినిపించాయి. వారి మనసులు చివుక్కుమన్నాయి. గుండెలు అది రాయి.

తమ వయస్సూ, మరణానికీ తమకూ గల సామీప్యమూ, ఈనాటి తరానికీ, తమ తరానికీ గల దూరమూ, అన్నిటి కన్నా ముఖ్యంగా తమ ఒంటరితనమూ, చప్పున అతి కఠోరంగా, అతి దారు ణంగా వారి మనస్సుల్లో గోచరించాయి.

ఒకరి మోహం ఒకరు అతిదీనంగా చూసుకున్నారు. భయంకరమైన ఒంటరి తనాన్ని మరిచిపోవడానికి ఒకరిదగ్గరకు మరొకరు జరిగారు. పంతులు జ్ఞాపకం వచ్చాడు. పంతులు చోటును పంతులికి అట్టేపెట్టాలని వా రిద్దరి అంతరాత్మ ల్లోనూ తట్టింది. మళ్ళీ యధాస్థానాలకు జరిగారు.

చీకటి పడిపోయింది. పంతులు రాలేదు. ఇక వా రిద్దరూ అక్కడ కూచోలేకపోయారు. మనస్సులు వేడెక్కి పోయాయి. గుండెలు బరువెక్కి పోయాయి.

'గుడ్‌నైట్' అని చెప్పుకొని ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు.

నాయుడికీ, సాహెబుకూ ఆరాత్రంతా నిద్రపట్టలేదు. మనస్సంతా కలవరపడి పోయింది. తమ వృద్ధాప్యపు బరువంతా ఒక్కసారిగా వారిని క్రుంగదీసింది. ఇన్నాళ్ళూ వారు ఎన్నడూ ఆలోచించని మృత్యువు వారి కళ్ళముందు నాట్యమాడ సాగింది. అరవయ్యేళ్ళపాటు బ్రతికేవారు చాలా తక్కువమందికదా! తమకు కూడా రోజులు దగ్గరికి వచ్చివుంటాయి. పంతులు బీచికి రాకపోవడం చూస్తే అతనికి ఏదో జబ్బు చేసినట్టే వుంది. ఇంత వయస్సులో జబ్బు చెయ్యడం, బ్రతకడమూనా? తమ సంగతీ అంతే.




ఆ రాత్రంతా వారికి మరణాన్ని గురించిన ఆలోచన తప్ప మరొకటి లేదు

మరునాడు ప్రొద్దున నాయిుడుగాని, సాహెబ్‌గాని మంచాలమీదనుంచి లేవలేదు. వారి కుమారులు వెళ్ళి డాక్టర్లను పిలుచుకువచ్చారు. డాక్టర్లు థర్మామీటర్లు పెట్టి శరీరంలోని వేడిని కొలిచారు. మనస్సులలో వున్న ఆఘాతాన్ని చూచాయగానైనా గ్రహించలేకపోయారు. డాక్టర్లు మందు పంపించారు. సాయంత్రం బీచికి వెళ్ళేవేళ అయింది. నాయుడుగాని సాహెబ్‌గాని బీచికి వెళ్ళలేకపోయాడు. దానివల్ల వారి మనస్సులు మరింత కలవరపడ్డాయి; జ్వరం మరింత హెచ్చింది.

పంతులు ఆనాడు బీచికి వచ్చాడు. అంతకుముందునాడు తాను బీచికి రాకపోవడానికి కారణం తన కూతురూ,

అల్లుడూ బలవంతపెట్టడంవల్ల సినిమాకు వెళ్ళడమేనని, తన మిత్రులకు క్షమాపణ చెప్పుకుందామని వచ్చాడు. కాని, మిత్రులు రాలేదు. ఒక్కడూ ఎంతో సేపు కూచున్నాడు. మిత్రులు రాలేదు.

అల్లరికుర్రాళ్ళు నలుగురూ అతణ్ణి ఒక్కణ్ణే చూశారు.

"నిన్న ఈయన చచ్చాడనుకుంటే, ఇవ్వాళ వాళ్ళిద్దరూ చచ్చినట్టున్నారే!" అని చెప్పుకుంటూ, పగలబడి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు. పంతులు మనస్సు చివుక్కుమన్నది. తాము ముగ్గురుకూడా ఇక చచ్చిపోవలసినవాళ్ళ లిస్టులోని వారన్నమాట. ముగ్గురూ చచ్చిపోతే, సహజంగా జరగవలసిందేదో జరిగిందని అంతా అనుకుంటున్నారన్నమాట. అంటే తాము చావకపోవడంలో ప్రకృతివిరుద్ధమైన దేదో వుందన్నమాట. ఒంటరితనంలో, చావులోని ఒంటరితనం కళ్ళయెదుట కట్టగా పంతులు అక్కడ కూచోలేకపోయాడు. నడిచి వెళ్ళలేక రిక్షాలో ఇంటికి వెళ్లాడు.

* * *

మరునాడు, యూనివర్సిటీ ఎగ్జామినేషన్ హాలుకు ఎదురుగావున్న బల్ల ఖాళీఅయింది. దానిమీద ఎవరూ కూచోలేదు. అల్లరికుర్రాళ్ళు నలుగురూ దానివంక చూసి, కూచుందాం అంటే కూచుందాం అనుకొని, 'ఆ ముసలాళ్ళు ముగ్గురూ వస్తారేమో' అనుకొని తమదారిని తాము వెళ్ళిపొయ్యారు.

ముసలివాళ్ళు ముగ్గురూ రాలేదు. మళ్ళీ మరునాడు, ఆ కుర్రాళ్ళు ఆ బల్లమీద కూచోకుండా వుండలేకపోయారు. ముగ్గురు ముసలివాళ్ళ స్థానాన్ని నలుగురు కుర్రాళ్ళు ఆక్రమించారు. ముసలివాళ్ళ స్థానం కుర్రవాళ్ళదే నన్నట్టు, ఆ బల్ల నలుగురికీ సరిపోయింది.

కుర్రాళ్ళకి ముసలాళ్ళ ఆలోచన అనవసరం. అంచేత వాళ్ళు ఆ ముగ్గుర్ని గురించీ ఆలోచించనేలేదు. ఆనాడు సాయంత్రం ట్రిప్లికేన్ లోని సాహెబుల సమాధిస్థలంలో మరొక సమాధి ఏర్పడింది.

ట్రిప్లికేన్ శ్మశానానికి రెండు శవాలు చేరాయి. ఒకటి నాయుడు, ఒకటి పంతులు.

ఈ ఇద్దరు మిత్రులకైనా, కడసారి కూడా సామీప్యం లేకపోయింది. కులం అడ్డువచ్చింది. బ్రాహ్మణులను దహించడానికి ఘట్టం వేరు, బ్రాహ్మణేతరులను దహించడానికి ఘట్టం వేరు.

కాని, ఈ రెండు శవాల పొగలూ ఒకదానితో మరొకటి కలుసుకోకపోలేదు. గాలివాలులో, సాహెబు సమాధులమీదుగా విస్తరిల్లుకోకపోలేదు. బహుశా, సాహెబ్ సమాధిమీదుగా వ్యాపించి, 'చనిపోయినా మనం వేరుకాదు సుమా!' అని సమాధి చెవిలో చెప్పివుంటాయేమోకూడా!






"క్రుడి ఎడ మైతే పొరబాటు కాదోయ్..
ఓడిపోయానోయ్ ... నేనూ ...
ఓడి ... వాడిపోయానోయ్ ..." స్వాధీనంలేని నాలుకమీద దేవదాసు విషాదగీతం విభిన్నతీర్ల విరిగి మరింత విషాదాన్ని పింపుకొంటోంది.

'పోర్టికో' లో ఆగిన కారుదిగి డ్రైవరు యిచ్చే 'సలాం' స్వీకరించకుండా తూలుతూ ఇంట్లోకి నడుస్తూ 'సత్యమూర్తి' ఆలపిస్తున్న గానం అది: ముఖద్వారందగ్గర 'దర్వాన్' సలాం చేసి తలుపు తీసాడు. నోరు తెరుచుకున్న కొండచిలువలా ఉన్న ఆ సింహద్వారం లోంచి ముందర హాల్లోకి నడిచాడు.

అక్కడ ఒక నిముషం నిల్చొని అయోమయంగా చుట్టూ కలయజూశాడు.

"ఏయ్ ... మెట్లెక్కడ ?" అంటూ అరిచాడు దర్వాన్ ఆశ్చర్యపోయి గబగబా యజమానివద్దకు పరుగెత్తికెళ్ళి "నేను మేడ ఎక్కిస్తా పదండి బాబూ!" అన్నాడు వినయంగా.

"అసలు మెట్లేవీ ?" అన్నాడు. గప్పున వాసనకొడుతున్న నోటిని ఆశ్చర్యంగా వెళ్ళబెట్టి.

"అవేంటి బాబూ ..." అన్నాడు వేలితో కుడివైపు చూపుతూ.

దగ్గరసా వెళ్ళి, చేత్తో తడిమి "ఆ... అవును ... యివి మెట్లే!" అంటూ చతికిలపడ్డాడు. మళ్ళీ ఏదో కూనిరాగం తీస్తూ సిగిరెట్టు వెలిగించుకున్నాడు

"పైకెల్లండి బాబూ ... అమ్మగారు సాయంత్రంనుండీ మీకోసం ఎదురు సూస్తున్నారు." అన్నాడు.యజమానివద్ద తనకున్న చనువు పురస్కరించుకుంటూ.

వింతగా ఓమాటు చూసి, అంతలోనే నవ్వుతూ "ఓ...అమ్మగారు! ఔ...ను, సాయంత్రం మీ అమ్మగారి పుట్టినరోజు పండుగకదూ ?" అంటూ గబగబా అడుగులు వేసుకుంటూ మెట్లెక్కసాగేడు. ఆ తూలుడులో, తొందరలో ఎక్కడ కాలుజారి క్రిందకు దొర్లుతాడోనని ఊపిరి బిగపట్టి చూడసాగేడు దర్వాన్.

అదృష్టవశాత్తు క్షేమంగానే మెట్లన్నీ ఎక్కి గదిలోకి వెళ్ళేడు సత్యమూర్తి.

దర్వాన్ నిట్టూర్చి సింహద్వారం తలుపులు జేరవేసి, తన స్థానంలో కూర్చున్నాడు.

భర్త అడుగుల శబ్దానికి ఉలిక్కిపడి, కొంగుతో కన్నీరద్దుకుంది సరోజ. ఆమెకు అంతదాకా సత్యమూర్తి క్రింది భాగంలో అన్న మాటలన్నీ వినిపిస్తూనే ఉన్నాయి.

కోటు భుజంమీదనుంచి తీసి, సోఫా మీదికి విసిరేస్తూ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సత్యమూర్తి

"ఏడుస్తున్నావా సరోజా! అరే... ఇంతవరకూ నే నొక్కడినే అనుకున్నానే! వెరీగుడ్. అయితే యిద్దరమూ కలిసి ఉమ్మడిగా ఏడుద్దాం–ఏం ?" ప్రక్కన చతికిలపడ్డాడు.

భర్త నోటినుండి వెలువడుతున్న దుర్గంధాన్ని అతిసహనంతో భరిస్తూ మౌనం వహించింది సరోజ.

"ఊఁ... యిప్పుడు చెప్పు ... నా చిన్నతనంలోనే మా తాతయ్య చచ్చిపోయాడు. నేను ఆయన్ని చూడలేదులే. ఆయన్ని తల్చుకుని నేను ఆరంభిస్తాను. నువ్వెవర్ని తల్చుకుంటావ్ ? మొన్న మీ ముసలి అమ్మమ్మ చచ్చిపోయింది కదూ ? ఇంకేం ఆరంభించు," అంటూ గొంతు సవరించుకుని "ఓయ్ ... మా తాతయ్యోవ్! నన్ను చూడకుండా చచ్చావేఁరోయ్ ... నీకో వెండి మీసం, గడ్డం ఉండేవని మా నాన్న అనేవా




డోయ్..." అని ఆగి, "ప్రారంభించవేం?" అన్నాడు

ఆమెకు ఏడవాలో, నవ్వాలో అర్థం కాలేదు

"భోజనం పట్టుకురానా?" అంది లేచి నిల్చుని.

"భోజనమా? మనదంతా 'అక్కడే అయిపోయింది బేగం సాయిబా' అక్కడే ... ఓహ్! నిజం చెప్పొద్దూ. ఆ 'రజియా' చేతి పరోటాలు తింటుంటే, ప్రక్కనే రజితపాత్రలోని పానీయం సేవిస్తుంటే, స్వర్గం స్థానభ్రంశం చెంది నా ముందు కొచ్చినట్లుంటుంది. పాత రంభ ఉద్యోగం పీకేసి ఆ స్థానే నా 'రజియా' ని నియమించాను నేనే!

"ఆహో...ఏమా నాట్యం! ఆ జిగి నలుసులా నా కనురెప్పల క్రింద దాగి ఉందింకా..."

స్త్రీకి విష మిచ్చినా ఆరగిస్తుందేమో గానీ, తనవా డనుకున్న పురుషుడు తన ఎదుటే పరాయి స్త్రీని పొగడటం భరించ లేదు. ఆమె యింకా భోజనం చెయ్య లేదు. ఇంతవరకూ ఉన్న ఆకలి చచ్చి పోయింది లేచినచోటే మళ్ళీ కూర్చుంది.

"సరోజా! ఈరోజు నీ పుట్టినరోజు పండుగ కదూ? సారీ డార్లింగ్! నువ్వు కోరిన బ్లూ షిఫాన్ చీర కొన్నాను. వస్తూ వస్తూ రజియాని చూట్టానికి వెళ్ళేను. దాన్ని చూసి ఎంతో మెచ్చుకుంది. ఆఫ్టరాల్ అంతేకద? తీసుకోమన్నాను. పోనీయ్ ... ఆమె కెంత యిచ్చినా స్వల్పమే!

"అయినా - నేను మొదటి వివాహ వార్షికోత్సవ దినంనాడు తెచ్చిన గులాబీ రంగు నైలెక్సుచీర కట్టుకోకపోయినావా?

"ఆహ్! నీకు గులాబీరంగు నచ్చదు కదూ? గులాబీలంటే అయిష్టం! నువ్వా ఆడదానివే సరోజా! నీలాంటి ఆడవాళ్లుంటే ఈ లోకంలో మహిళాభ్యుదయం ఎంతత్వరగా జరుగును!"

"చాలా రాత్రయింది. ఇహ పడుకోకూడదూ?" అంది.

"ఏం? నా మాటలు విసుగు తెప్పిస్తున్నాయా? అందుకే నేను రజియాతో తప్ప ఇంకెవరితోనూ ఎక్కువగా మాట్లాడను. పడుకుంటాను దేవీ.. పడుకుంటాను. తమరి ఆజ్ఞ!" అంటూ అలాగే వెళ్ళి పక్కమీద బోర్లా పడుకున్నాడు.

భర్త పాదాలకున్న బూట్లు విప్పదీసి గదిలో ఒకమూలగా పెట్టి, లైటు తీసివేసి కలతబారిన మనస్సుతో అశాంతిగా పడుంవాల్చింది సరోజ

* * *

"ఎవరక్కడ? సరోజా..." అధికారయుతంగా ధ్వనించింది సత్యమూర్తి గొంతు.

"ఏమిటీ!" అంటూ మరునిమిషములో ముందు ప్రత్యక్షమైందామె.

"ఇపుడు టైమెంతయిందీ?" తీక్షణంగా అడిగాడు.

"ఎనిమిది!" ఆ కోపానికి కారణం అర్థంగాక నిలబడిపోయింది

"ఈరోజు ఎనిమిదింటికల్లా ఆఫీసు కెళ్ళాలని చెప్పేనా లేదా?"

ఆశ్చర్యంగా చూసింది.

"మాట్లాడవేం?" గద్దించాడు

"ఎ...ప్పు...డు...?" అంది కూడబలుక్కుంటున్నట్లు.

వెంటనే ఆమెచెంప చెళ్ళుమంది ... బుగ్గ ఎర్రగా పొంగింది!

"ఎప్పుడా? రాస్కెల్...బుకాయించడంకూడా నేర్చుకుంటున్నావన్నమాట. నిన్న రాత్రి పడుకునేముందు కాదూ చెప్పింది నీతో?"

ఆ అబద్ధానికీ, నీలాపనిందకీ తెల్లబోయింది. కందిపోయిన కపోలాన్ని నిమురుకుంటూ "అవును ... చెప్పారు. నాదే పొరబాటు..." అంది జీరపోయిన గొంతుతో, బలవంతాన కన్నీరు నిగ్రహిస్తూ.

"ఉదయాన్నే ఏడుపు మోహం నువ్వా ప్రత్యక్ష్యం! గెటవుట్ ... నీ మొహం చూపించకు..." అంటూ విసుక్కుని గబ గబా, బాత్ రూంకేసి వెళ్ళేడు.

అతను అన్నీ ముగించుకుని సిద్ధమయేలోగా కాఫీ కలుపుకొచ్చి, శాండ్విచ్ లతోబాటు బ్రేక్ ఫాస్టు సిద్ధం చేసింది సరోజ. దానివంక కన్నెత్తి అయినా చూడకుండా చరచరా బయటికి వెళ్ళి

పోయాడు సత్యమూర్తి. కారు స్టార్టయిన శబ్దం విన్పించి, క్రమశః దూరమైంది. ఆమె హృదయం చివుక్కుమంది. అలాగే కూర్చుండిపోయింది

"అమ్మా!'' అన్న పిలుపుకి తేరుకుంది.

వంటతాతకేసి చూసింది - ఏమిటీ అన్నట్లు

''అమ్మా! అన్నంలోకి ఏం చెయ్యమంటారు?"

"అన్నంలోకా?" ఆమె కంఠం రుద్ధపోయింది. కన్నీరు జలజల బుగ్గల మీదకి జారింది."నిన్నరాత్రి వండినవన్నీ ఏం చేశావు తాతా?"

''అలాగే ఉన్నాయి తల్లీ! ఏం చెయ్యమంటారో మీరే చెప్పండి,'' అన్నాడు వినయంగా. ఆ వృద్ధుని హృదయం ఆ అబలమీది సానుభూతితో కొట్టుమిట్టాడింది.

"అవన్నీ మీయింటికి తీసుకెళ్ళి పిల్లకి పెట్టు"

అభిమానంతో కుంచించుకుపోయాడు తాత. "ఎందుకులేమ్మా! బోలెడు కర్చు చేసి తీపిపదార్థాలు వండించారు. అన్నీ అట్లాగే ఉండిపోయినాయి."

"నేను చెప్పినట్లు చెయ్యి తాతా! వాటి నింటికి తీసుకువెళ్ళు." అంది స్థిరంగా.

''అలాగే తల్లీ'' అన్నాడామాటను ఆజ్ఞగా తలదాల్చి. ఇంకా అలాగే నిలుచున్న తాత నుద్దేశించి "అన్నంలోకి నీకు తోచిందేదో ఒకటి చెయ్యి తాతా!" అంది. అంగీకారంగా తలూపి, వెళ్ళబోతున్న తాతని మళ్ళీ వెనక్కి పిలిచింది.

"నీకు రజియా నివాసం తెలుసా?"

ఆ ప్రశ్న వింటూనే ఆశ్చర్యంతో పదిరంగులు మార్చుకుందతని మొహం. సందిగ్ధావస్థలోంచి తేరుకుంటూ, సంశయంగా "కానీ, అది మంచిచోటు కాదు తల్లీ! తమలాంటి కుటుంబపు స్త్రీలు అడుగు పెట్టకూడని చోటు." అన్నాడు.

"నాకు తెలుసు! - అయినా సరే, నేను వెళ్ళితీరాలి. ఒక్కమాటు ఆమె ఎవరో చూడాలి తాతా! నిన్ను వేడుకుంటున్నాను; న న్నొకమాటక్కడికి తీసుకెళ్ళుదూ?"

ఆ అభ్యర్ధనతో చలించిపోయాడుతాత. "తప్పమ్మా అలాంటిమాట లనకూడదు. నేను మీ నౌకర్ని. మీ రిచ్చేవి ఆజ్ఞలే గానీ, అభ్యర్ధనలు కాకూడదు తల్లీ! ఆ రజియా ఎవరో యింతవరకూ నేను చూడలేదుగానీ, మెహందీలోవి ఒక మేడలోకి అయ్యగారు తరుచూ వెళ్ళటం ఎరుగుదును. అక్కడ నివసించే ఏ వేశ్యపేరో 'రజియా' కావొచ్చును. కానీ, ఈ విషయం అయ్యగారి చెవిన బడితే నా ప్రాణాలు నిలవవు తల్లీ!"

"నా ప్రాణాలుకూడా నిలువవు తాతా! అన్నీ తెలిసే ఈ ధైర్యం చేయబూనాను. సాయంత్రం నాలుగ్గంటలవేళ

టాక్సీలో వెళదాం. తిరిగి టాక్సీలోనే వద్దాం."

''అలాగే తల్లీ" అంటూ వంటింటి వైపు వెళ్ళేడు 'తాత.

* * *

"ఇదే మేడ... కారాపు బాబూ!" అన్నాడు తాత బ్రేకులు కీచుమంటూ అరిచాయి; ఒక్క కుదుపుతో ఆగింది కారు. మీటరు డబ్బులు చెల్లించి ఆ మేడవైపు నడిచింది, సరోజ.

అదో పెద్ద మేడ. బయట కాలింగ్ బెల్' ఉన్నందువల్ల కాబోలు తలుపులు బంధించి ఉన్నాయి! బటన్ మీద వేలుంచి రెండుమార్లు నొక్కింది సరోజ.

లోపల ఎక్కడ్నుంచో 'ఆయీ' అంటూ సన్నని గొంతు జవాబిచ్చింది. కొద్ది క్షణాల తర్వాత తలుపు తెరుచుకుంది. ఆమెను చూసి సరోజ నిర్ఘాంత పోయింది. ఈ అపరిచితురాలిని చూసి ఆమెకూడా ఆశ్చర్యపోయినట్లు అగుపించింది

"ఆప్ కౌన్ హై," అంది కుతూహలంగా చూస్తూ.

"చెబుతాను – లోపలికి రానిస్తారా?" అంది సరోజ.

ఆమె గుమ్మానికి అడ్డం తొలగి ఎంతో నొచ్చుకుంటూ "క్షమించండి. బయటే నిలబెట్టి మాట్లాడేను. లోపలికి రండి," అంటూ ఆహ్వానించింది.

"మరేం ఫర్వాలేదులెండి," అని తాత కేసి తిరిగి "నువ్వెళ్ళు తాతా! నేను వస్తాను.'' అంది.

"అట్లాగే తల్లీ!'' అంటూ నిష్క్రమించాడు. సరోజ లోపలికి అడుగు పెట్టిన తర్వాత తలుపు మూసింది ఆమె. ఇద్దరూ సందులాటి ఓవరండా దాటి మెట్ల వైపు నడిచేరు. అవి సరాసరి మేడ మీదకి తీసికెళ్ళాయి. అచటి అలంకారానికి విస్తుబోయింది సరోజ.

గోడలకు ఆకుపచ్చని రంగు వేయబడిఉంది. వాటికి చక్కటి తైలవర్ణ చిత్రాలు తగిలించబడిఉన్నాయి. విద్యుద్దీపాలు కూడ ఎంతో అందంగా అమర్చబడిఉన్నాయి. ఆ గదిలో నేలంతా పరచబడిన మెత్తని తివాచీ కాళ్ళకు మృదువుగా తగులుతోంది.

ఒక మెత్తటి సోఫాలో ఆసీనురాల్ని చేసి, చల్లని పానీయం అందించింది ఆమె. సరోజ మౌనంగా దాన్ని స్వీకరించింది.

ఆమెకూడ మరో పానీయం పుచ్చుకుంటూ యింకొక సోఫాలో ఆసీనురాలయింది.

"ఇప్పుడు చెప్పండి," అం దామె.

"ఈ ఇంట్లో మీరొక్కరేనా లేక యింకెవరన్నా ఉంటున్నారా?" అంది సరోజ. ఆమె ఆశ్చర్యంగా చూసి, "అదేం, అలా అడుగుతున్నారు? ఈ ఇంట్లో నేను, మా అమ్మ ఉంటున్నాం. అంతే!" అన్నది.




"మరోలా అనుకోకండి, ఊరికేనే అడిగాను! మీ పేరు...'' అంటూ ఆగిపోయింది.

"నా పేరు రజియాబేగం..."

సరోజ నేత్రాలు ఆశ్చర్యంతో విస్తృతమయ్యాయి. ఈ స్ఫోటకం మచ్చలసుందరీ — తన భర్త రంభ, ఊర్వశి అంటూ పొగిడే రజియా—ఒక్కరేనా?? ఇదెలా సాధ్యం?

ఈవిడ అందగత్తె అని ఎవరన్నా పొగిడారంటే వారికి నిస్సందేహంగా మతి చాంచల్యం అనుకోవలసిందే! 'రజ్జుసర్పభ్రాంతి' అయిందా తన పరిస్థితి ఆఖరికి? ఈ అతిసాధారణవ్యక్తిని అతిలోకపు వ్యక్తిగా వర్ణించిన భర్త — తాడునుచూపి పాముఅని భయపెట్టారన్న మాట!!

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అంది రజియా.

సరోజ తడబడింది. "ఏమిలేదు. మీకు సత్యమూర్తిగారు తెలుసా?''

"స...త్య...మూ...ర్తి!!" ఆమె ఆశ్చర్యంతో బొమ్మైపోయింది. అంతలోనే తేరుకుని, "కొంపతీసి మీ రతని భార్య కాదుగదా!" అన్నది.

"మీ ఊహ నిజమే!"

"యా ఖుదా!" అనుకుంది చిన్నగా. ఆందోళనస్వరంతో రజియా యధాస్థితికి తిరిగివచ్చి "నాకు తెలుసు... నేను ఏనాడో ఊహించాను; మీరిలా వస్తారని! ఊఁ... చెప్పండి మిమ్మల్నిచూస్తుంటే ఏదో చెప్పలేనిఅభిమానం కలుగుతోంది. ఇలా రావటానికి ఏదో కారణం ఉండాలి'' అన్నది తమాషాగా చూస్తూ.

"మీరు అన్నీ ఎరిగుండీ నా చేత చెప్పించాలని చూస్తున్నారు ముందు.మీరు నా రాక నెలా ఊహించారో తెలుసుకోవాలనుకుంటున్నాను'' అంది సూటిగా.

రజియా ఫక్కున నవ్వింది.

"నిజమే సోదరీ. నాకంతా తెలుసు! ను వొచ్చిన కారణమూ తెలుసు అందుకే నవ్వుతున్నాను. జాలికూడా పడుతున్నాను, కానీ, అపార్థం చేసుకోవద్దు. నీ కష్టాల్నిచూసి నవ్వుతున్నా ననిగానీ, జాలిపడుతున్నా ననిగానీ అనుకో బోకు!" _ అంటూ అలా నవ్వుతూనే కొన్ని నిముషాలు గడిపింది.

హఠాత్తుగా ఆమెదృష్టి సరోజ చేతిలో ఉన్న వేనిటీబ్యాగ్‌మీద పడింది. "ఈ బ్యాగ్ నీకు బహుమతిగ యివ్వమని యిచ్చింది నేనే!" అంటూ జిప్ తీసి చూసింది. సరోజ తన బ్యాగుని వాపసు తీసుకునేలోగానే, అందులో రుమాలుతో భద్రంగా చుట్టబడిన వస్తువుని బయటికితీసి 'పిస్టల్!' అంది ఆశ్చర్యంగా రజియా.

సరోజ తల దించుకుంది. రజియా ఆగకుండా అయిదు నిముషాలు పొట్ట చేత్తో పట్టుకని మరీ నవ్వింది. సరోజ చెంపల్లోకి వేడిరక్తం ప్రవహించింది. అవమానంతో ఆమె శరీరమంతా సెగలు చిమ్మింది

"నీ శత్రువుని చంపటానికి తయారై వచ్చావన్నమాట! శభాష్! ఈ పాడు జీవితాన్ని అంత మొందించుకునే ధైర్యం లేక యింతకాలమూ బ్రతికాను. ఇదుగో పిస్తోలు; నిర్భయంగా నిల్చుంటున్నాను. తూటాలతో ఈహృదయాన్ని ఛేదించు," అంటూ పిస్తోలు ఆమెచేతి కిచ్చి ఛాతీమీద పైట తొలగించి నిల్చుంది.

"నన్ను క్షమించండి," అంది సరోజ పశ్చాత్తాపంతో దగ్ధమౌతూ. రజియా పైట సరిచేసుకుని వచ్చి "చెల్లాయ్! ఇందులో నీతప్పేమీ లేదమ్మా! నీస్థితిలో నేనున్నా అంతేనేమో! ఆడదాని హృదయదౌర్బల్యమే అలాంటిది... నాకు నీమీద ఏమీ కోపంలేదు. కన్నీరు మానివేసి, నాకేసి చూడు... ముచ్చటగా ముఖ్యమయిన విషయాలు మాట్లాడుకుందాం..." అంటూ చుబుకం పట్టుకుని ఆమె మొహాన్ని తనకేసి తిప్పుకుంది.

సరోజ కన్నీరు తుడుచుకుంటూ "మీరు నిజంగా దేవతలు," అంది రుద్ధకంఠంతో

మళ్ళీ నవ్వేవంతు రజియా దైంది.

"చూడు సరోజా! ఇలా ఏకవచన ప్రయోగం చేస్తున్నందుకు మరోలా అనుకోవద్దు. సత్యమూర్తినికూడా అలా పిలవటమే అలవాటు. నిన్నూ అలాగే పిలుస్తాను; అభ్యంతర పెట్టకూడదు.... తెలిసిందా?"

అంగీకారంగా తలూపింది. సరోజ ఎంతోంమురిపెంగా "మామంచిచెల్లాయివి నువ్వు! మరి నన్ను 'అక్కా' అని పిలిస్తావా?" ఆమాట అంటున్నపుడు ఆమె కళ్ళు తేమ నింపుకుని తళ,తళ లాడేయి.

'అక్కా' అంది సరోజ. వెంటనే రజియా ఆవేశంతో ఆమెని అక్కున అదుముకుని వలవలా దుఃఖించింది. సరోజకి ఆ అనుభూతి ఎంతో హాయిని గొల్పింది.

ఆవేశం చల్లారగానే మామూలుగ కూర్చుని "క్షమించు చెల్లాయ్! ఆవేశంలో హద్దులు మీరాను." అంది రజియా

"అలాంటి హద్దులు మనమధ్య లేవక్కా!" అన్నది సరోజ.

"చాలమ్మా... చాలు...!" ఈజన్మకిది చాలు. ఇపుడు నీమనస్సు నావరించిన విచార మేఘాలు వీడిపోవాలంటే గతాన్ని త్రవ్వి చెప్పాలి. సత్యమూర్తి, నేనూ కలిసి చదువుకున్నాం. కాలేజీలో కూడా మా స్నేహం విడిపోలేదు. కాలేజీ మొత్తం మీద అందగత్తెగా పేరుపొందా నప్పట్లో నేను. సత్యమూర్తి క్రికెట్ కేప్టెనే కాకుండా, 'డ్రమెటిక్ టీమ్' కి శక్రటరీ! కూడా ఇద్దరమూ అనేక డ్రామాల్లో నటించి ప్రశంశలు పొందాం.

కాలేజీ చదువు పూర్తయిన తర్వాత విడిపోవాలంటే ఏదోలా అనిపించింది. సత్యమూర్తి నన్ను ప్రేమించా నంటుండేవాడు. సంఘాన్నీ కట్టుబాట్లనీ ఎదిరించి పెళ్ళిచేసుకుంటానని ప్రగల్భాలు పలికేవాడు_ నేను వేశ్యకుమార్తెనని తెలియనపుడు! నాకు అతని మనస్తత్వం పరిశీలించా లనిపించి ఒకమాటు మా ఇంటికి తీసుకువచ్చాను,

మెహందీలో అడుగు పెడుతూనే భయపడ్డాడు సత్యమూర్తి. అప్పట్లో మా అమ్మ కాలికి గజ్జెకట్టి ఆడేది. గానా బజానా వింటానికి వచ్చే త్రాగుబోతులూ, వ్యభిచారుల గోలకి బెదిరి, సాంతం సాగకుండానే పారిపొయ్యాడు. ఆతర్వాత నాలుగురోజులు నన్ను తప్పించుకుతిరిగాడు. ఒకరోజు తనేవచ్చి పలకరించాడు

"రజియా! ఆ నరకంలోంచి బైటికి రాకూడదూ?" అన్నాడు "అసాధ్యం మూర్తీ! నేను పుట్టిందీ, పెరిగిందీ అక్కడే. అందుకే అది నాకు నరకమనిపించటంలేదు." అన్నాను.

"నిన్నే సర్వస్వంగా భావించాను. ఇలా అన్యాయం చేయటం న్యాయమా?" అంటూ వాపోయాడు. "చూడు మూర్తీ! గాజుముక్కని వజ్రం అనుకోమని, పానపాత్రలో మధిర త్రాగుతూ పాలుగా భావించమని ఎన్నడైనా నిన్ను దుర్బలపరిచానా?" అని ప్రశ్నించాను.

"ఎండమావిలాంటి నీ అందీ అందని అందమే నన్ను దుర్బలపరిచింది." అన్నాడు బాధగా. 'అతనిది శాపమా' అన్నట్లు ఆ అపురూపమైన అందాన్ని రూపుమాపింది మహమ్మారి మశూచి!

"నే నేదో అప్సరసలా ఉంటానని ఊహించిన నువ్వు నారూపాన్ని చూసి అవాక్కయి పోయావు! నా యీ కురూపానికి నా భవిష్యత్తున కలలు గన్న మా అమ్మ కుమిలి కుమిలి ఏడిచింది! ఈ మురికికూపంనుండి అమ్మా, నేనూ బయటికి వెళ్ళాలనే సముద్దేశ్యంతోనే చదువుకున్నాను_ఎన్నో అభ్యంతరాలను ఎదుర్కొని మరీ! ఆ చదువూ సవ్యంగా పూర్తి చేసుకోలేకపోయాను. రెంటికీ చెడ్డ రేవడినై _ యిపుడు అమ్మ సంపాదమీద జీవిస్తున్నాను.

నా దుస్థితికి చిన్నపిల్లవానిలా దుఃఖించాడు మూర్తి. అతని హృదయసౌందర్యము ఎంత గొప్పదంటే, నేనుకురూపినైనా సరేనన్నే చేబడతా నన్నాడు. ఆమాటకే ధన్యురాల్నయ్యాను. నాలో అతనికి దేవతామందిరాన్ని నిర్మించి, అందులో ప్రతిష్ఠించుకున్నాను నా ఆరాధ్య దైవం అతడే; కానీ, అంతమాత్రం చేత అతని భవిష్యత్తుని భగ్నం చేయగల దుర్మార్గురాలిని కాకూడదుగా!

అందుకే అతన్ని తగువిధంగా మందలించి, పెద్దలు తెచ్చిన సంబంధానికి అంగీకరింపజేశాను. అతని జీవితంలోకి నువ్వు ప్రవేశించావు. కానీ, నీతోటి జీవితం చప్పగా ఉందని నాముందు వాపోయేవాడు. అదంతా దృష్టిభేదమని మందలించాను. ఎప్పుడూ నీపక్షంగానే వాదించేదాన్ని.

మూర్తి నీవనున్నట్లుగా త్రాగుబోతూ, దుర్మార్గుడూ కాదు చెల్లీ! నీ ప్రవర్తనకి గర్విస్తూ, వ్యతిరేకతని వ్యక్తపరచాలనే వెఱ్ఱిఊహే అత న్నలా చేస్తున్నది.

పాలగ్లాసులో పంచదార కలుపుకుంటే రుచి హెచ్చిస్తుంది. వైవాహిక జీవితమూ అంతే.

మీ హైందవుల్లో తొలిరాత్రి ఆలుమగల్ని ఏకం చేసేటప్పుడు ఒకే గ్లాసులోని పాలు యిద్దరిచేత త్రాగిస్తారు, దాని అంతరార్ధ మేమిటో ఆ పెద్దలకే బాగా తెలియాలి! నాబుద్ధికి తోచినంతమటుకు— ఈ పాలు – నీళ్ళు ఒకటి అయినట్లు మీ హృదయాలూ ఒకటై, దీనిని చెరిసగం పంచుకున్నట్లే మీకష్టసుఖాలను సమభాగం చేసుకోండనే– సందేశం అందులో ఉన్నదని! అదే 'పాలగ్లాసు' యిచ్చే సందేశం!

దానిని గ్రహించి ఆచరణలో పెట్టినప్పుడే జీవితాలు ఆనందమయంగా గడుస్తాయి. భర్తమనసు నెరిగి భార్యవర్తించడంలో ఎలాంటి చికాకులూ తలెత్తవు.

చెప్పగలిగినంతవరకూ విడమర్చి చెప్పాను. నా పరిజ్ఞానం పరిధి చాలా చిన్నది అందులోనే బ్రతికే నా కింతే తెలుసు"

"లేదక్కా! నా అహంభావపు తెరలన్నీ తొలగించావు. నిజానికి నీ జ్ఞానపరిధే చాలా పెద్దది. అందులోకి ప్రవేశం కల్పించి నాకు తెలియని ఎన్నో విషయాలు చెప్పి నా సంసారం బాగుచేశావు. 'స్వయంకృతం' వల్లనే ఆయన ఆగ్రహాన్ని రెచ్చగొట్టా నక్కా! అందుకే ఆయ నలా అయ్యారు ఈరోజునుండీ మా జీవితాలు నూతనపంథా తొక్కుతాయి మా గర్హస్థ్య జీవితం ఆనందమయం కావాలని ఆశీర్వదించక్కా!" అంటూ రజియాముందు మోకరిల్లింది, సరోజ

ఆమెను హృదయానికి హత్తుకుని "అల్లా నిన్ను కాపాడి రక్షిస్తాడు. క్షేమంగా వెళ్ళిరా చెల్లీ!" అంది. అనుభూతుల ముద్రల్ని పదిలపర్చుకుంటూ తిరోన్ముఖురా లయింది సరోజ.




'ఈ తగువులాట, మరి తెల్లారదు కాబోలు' అనుకున్నాడులా ఉంది— ఇంజను ఆపేశాడు డ్రయివరు

నాకు చెడ్డ చిరాకువేసింది సినిమాకి వెళ్దామనుకున్నాను, టైము కూడా చాలదు సినిమాని మొదట్నించీ మరీ దయచేసి చూడమని, పాపం సినిమావాడు రిక్వెస్టు చేసేడు

సరే, తగువులాటకి కారకులెవరో చూద్దామనిపించింది. 'చేతులు బయట పెట్టరాదు' అని, మీద రాసున్న కిటికీ లోంచి తల బయటపెట్టి చూసేను.

ముగ్గురు మనుషులు బస్సు ఫుట్‌బోర్డుమీద నించున్నారు వాళ్ళని దిగమనీ, టయిమయిపోతోందనీ చెప్తున్నాడు కండెక్టరు వాళ్లు ముగ్గురిలో

వొకాయన బాగా లావుగా ఉన్నాడు. ఒకచేత్తో బస్సు కడ్డీ పట్టుకుని, మరో చేతిని గాలిలో ఆడిస్తూ, కండక్టరుతో అత నిలా అన్నాడు, "దిగవయ్యా! మేం దిగం నీకు అంత కష్టంగా ఉంటే, లాగెయ్ నన్ను జబ్బపట్టుకుని."

"నే నెందుకు లాగేస్తాను బాబూ! మర్యాదగా దిగిపోండి సార్" అన్నాడు కండక్టరు మర్యాదగా

"ఇదుగో గురూ! మర్యాదా, గిర్యాదా నా దగ్గిర చెప్పకు. ముందు వాళ్ళని దింపు. మేము దిగుతాం. న్యాయం వుండొద్దుటయ్యా? ఖాళీ లేదన్న వాడివి, వాళ్ళని ఎలా ఎక్కించేవు? ముందు మేం ఆ గేటు దగ్గరకు వొస్తే, ఖాళీ లేదన్నావు పోనీ కదా అని, ఈ గేటుదగ్గరకు వొస్తే, ఈ లోపుని ఆ గేటులోంచి లేడీస్‌ని ఎక్కించేస్తావా? అందరికీ వొకటేనయ్యా రూల్సు. ఏం? అవునా?" అన్నాడు ఆ లావుపాటి పెద్దమనిషి.

"ఇదుగో, కండక్టరూ! పోనీ ముగ్గురే కదా, వాళ్ళని ఎక్కనీ"- ఈ మాటలు బస్సులోంచి వచ్చేయి. ఎవరా ఈ పరోపకారపరాయణుడు, అని వెనక్కి తిరిగి చూసేను. అతణ్ణి వెంటనే గుర్తుపట్టేశాను. చిరునవ్వు నవ్వుతూ, కొంచెం గర్వం ప్రదర్శిస్తున్నా డతను.

"మీ కేటి బాబూ! మీరు చెప్పేస్తారు-ఎక్కించవయ్యా అని ముందు చెకింగుంది. అద - దారిలో కూచున్నాడు మా మొగుడు. అసలే, నిన్నా మొన్నా ఏక్సిడెంట్లు తెగ జరిగిపోయేయి కదా! అందుకే, వొక్కణ్ణి ఎగష్ట్రా ఎక్కించినా ఫయిన్ వేస్తాడు- ఏటవుతుందంటే, బాబూ! ఆడు ఉన్నాడని తెలిసి మరీ వోవరులోడు ఎక్కిస్తే, ఆణ్ణి ఎక్కరించినట్టవుద్ది. మాకు మాత్రం డబ్బు లొస్తావుంటే లేదా, శెప్పండి. - నా మాట విని దిగిపోండి బాబూ! ప్లీజ్" అన్నాడు కండక్టరు అప్పుడు కండక్టరు మొహంలో దైన్యం కనిపించింది నాకు.

"అఁ మరేం ఫర్వాలేదు ఎక్కించవయ్యా! వోవరులోడులో రోజూ పోతావు. చూసినవాడు లేడు. అడిగినవాడు అంతకంటే లేడు. ఇవాళ నువ్వు పెద్ద కబుర్లు చెప్తావు. వాళ్ళని లోపలికి రానీ-అవతల పేసింజర్లందరికీ లేటయిపోతోంది" అన్నాడు ఇందాకటి మనిషే. ఇతన్ని ఎలక్షన్లో గెలిపిస్తే, ప్రజల కష్టసుఖాలు ప్రభుత్వానికి చక్కగా చెప్తాడని నా కనిపించింది.

"దిగండి సార్! ఎనకాల మరో బస్సొస్తోంది" అన్నాడు కండక్టరు.

"వొస్తే రానీ! నువ్వుముందు వాళ్ళని దింపెయ్. ఆడవాళ్ళకయితే ఖాళీ




వుందా? మొగవాళ్ళకి లేదూ? ఏం రూల్సయ్యా! అసలున్నువ్వు మొగాడివే? వాళ్ళ నెందుకెక్కించేవూ........." అన్నాడు ఫుట్‌బోర్డుమీద నించున్న రెండో మనిషి.

ఆడదానికి 'నువ్వు ఆడదానివి కావా?' అంటే కోపం వస్తుందో, రాదో కాని, మొగాడికిమాత్రం వెర్రి ఆవేశం తెప్పించడానికి, 'నువ్వు మొగాడివేనా?' అంటే చాలు.

కండక్టరుకి వెర్రికోపం వచ్చేసింది.

"మరియాదగా మాట్లాడండి బాబూ! అనౌసరంగ మాటలు పెంచకండి. నేను మగాణ్ణో, కానో, మీకు తెలిసేలాగ చెయ్యగల్ను......... అసలూ, ఆడు ఎక్కించేడు" అంటూ బస్సు ముందుగేటు (ఆడగేటు) దగ్గరకు వెళ్ళేడు.

నేను తల అటువేపు తిప్పేను.

"ఏటిలాటి పనికేసేవు? ఒకచే సీటు కాళీరా అన్నాను కదా! రెండు టికెట్లెందుకు ఎక్కించేవు? మా పీకల మీదికి గొప్పగా దొరికేర్రా మీరు!" అన్నాడు అక్కడున్న క్లీనరుతో.

క్లీనరు వెకిలినవ్వోటి నవ్వి, ఇలా అన్నాడు. "లేడీసులు ఇద్దిరూ ఒకలేనండి! అందుకే, ఇద్దర్నీ ఎక్కించేను." అంటే...వాడి వుద్దేశం, వాళ్ళిద్దరూ వొకరికొకరు తెలియని వాళ్ళుకారూ, స్నేహితులో బంధువులోఅయుంటారూ అని. నాకు అర్థమయింది."

వాచీ చూసుకున్నాను. సినిమాకి టైము ఎంతో లేదు 'ఆ ముగ్గురు వెధవల్నీ తోసేసి, బస్సుని పోనియ్' అనాలని నాకువుంది కాని, అన్లేదు ఎంచేతంటే, ఇన్స్టింక్టుని చంపుకుని, నాగరికతని ప్రదర్శించుకోడం నాకు బాగా అలవాటయిపోయింది.

"తమాషా వేషాలు వేసేవంటే, అసలీబస్సుని కదల్నియ్యం" అన్నాడు ఫుట్ బోర్డుమీద వాళ్ళలో వొకడు.

అటు వేపు తిరిగిచూసేను. వాళ్ళలో మూడోవాడు ఏఁవీ మాట్లాడ్డం లేదు. మిగిలిన వాళ్ళిద్దరూ, బస్సులోని వాళ్ళతో న్యాయం, ధర్మం గురించి మాట్లాడుతూ, వాళ్ళ 'లిప్ సింపతీ' పొందుతున్నారు

"వోయ్, కండక్టరూ! తప్పుమీది. కాళీ లేదన్నప్పుడు ఎక్కించడం మీ పొరపాటు. పోనీ, వీళ్ళనీ ఎక్కించై -' అన్నాడు ఇందాకటాయన-ముల్లుని ముల్లుతో తియ్యమన్నట్టు, తప్పుని తప్పుతో సరిదిద్దుకోమని.

~~నాకు, ఆ ఫుట్ బోర్డుమీద వున్న~~ వాళ్ళలో ఆ ఇద్దరి పట్టుదలా చూస్తూ వుంటే, ఈ బస్సుదిగి ఇంటికిపోతే మంచిదనిపించింది.

కండక్టరు వాళ్ళని మరోసారి బ్రతిమాలేడు భల్లూకాల్లా వున్నారు వాళ్ళు. "వాళ్ళని దింపించు. మేం దిగుతాం" అన్నారు వాళ్ళిద్దరూ. మూడోవాడు మాత్రం ఏఁవీ అన్లేదు.

భల్లూకం గాళ్ళ నిద్దరినీ మరి వొప్పించలేక, ఆఖరికి ఆడగేటు దగ్గరకు వెళ్ళి, ఆ స్త్రీలను బ్రతిమాలేడు- వాళ్లు కొంతసేపటివరకూ కదల్లేదు 'ఇంక వీళ్ళతో కొంత తగువులాట కాబోలు, ఇవాళ సినిమా చూసినట్టే!' అనుకున్నాను నేను.

కాని వాళ్ళు దిగిపోయేరు. వాళ్ళ వేపు చూడ్డానికి నాకు సిగ్గేసింది. చూడలేదు.

భల్లూకంగాళ్లూ దిగిపోయేరు. వాళ్ళ ముఖం చూడ్డానికి నాకు అసహ్యాం వేసింది అంచేత చూడలేదు

బస్సుబాడీమీద, విజయ దుందుభులు రెండు మోగించేడు క్లీనరు

పూలరథంలా బస్సు కదిలింది

నేను తల లోపలికి పెట్టుకోబోతూ ~~పక్కకి తిరిగి చూసేను.~~

ఇందాక, ఫుట్ బోర్డుమీద నించున్న వాళ్ళలో మూడోవాడు - పరుగెత్తు కుంటూవచ్చి, బస్సు ఎక్కిపోయాడు




తనవేపే చూస్తున్నా డతను. అతన్ని చూస్తే భయంవేస్తోంది చాలా మంది అతన్ని పిచ్చివా డంటారు. దానికితోడు అతని రూపం, అతని గురించి తనని మంచిగా ఆలోచించనివ్వడం లేదు.

పంచె, బనీను అతని బలహీన శరీరాన్ని కప్పలేకపోతున్నాయి. అసహ్యాంగా గడ్డం, జుత్తు పెరిగిపోయిన అతని ముఖంలో లోతుకుపోయిన కళ్లు భయంకరంగా ఉన్నాయి

తన యింటివేపే చూస్తున్నా డతను. సందేహం లేదు! రాళ్ళు విసురుతాడేమో! యింట్లో జొరబడతాడేమో! తను కుర్చీలోంచి లేవబోయింది.

'అమ్మా' అన్నా డతను. ఆ పిలుపులో ఎంతో ఆప్యాయత ఉంది కాని అతని రూపం చూసిన తరువాత- ఆ పిలుపు ఏదో భయంకరమైన గర్జింపులా వినబడింది.

'భయపడకు తల్లీ! నిన్ను చూస్తూ వుంటే నా కూతురు జ్ఞాపకం వస్తోందమ్మా' లోతుకు పోయిన కళ్ళలోంచి వస్తున్న అశ్రుధారలు గడ్డంలో కలసి పోతున్నాయి నల్లని చారలమధ్య ఎర్రగా జ్యోతుల్లాగా వెలిగిపోతున్నాయి అతని కళ్ళు

కాని తన భయం తగ్గలేదు వెంటనే లేచి తలుపు వేసేసింది. పడుకున్నా నిద్ర రావడంలేదు. పుస్తకం చదువుదామన్నా-అతనే కళ్ళలో మెదులుతున్నాడు. అతని దైన్యపు చూపులే గుర్తుకు వస్తున్నాయి. ఆ జాలి పలుకులే చెవుల్లో గింగురుమంటున్నాయి

తను ఆ విధంగా తలుపు వెయ్యకుండా వుండాల్సింది ఎంత బాధ పడ్డాడో! కాని అతను పిచ్చివాడు ఏ సమయంలో ఏమేం చేస్తాడో! తనొక్కత్తే యింట్లో ఉంది. ఈ రోజుల్లో ఎవర్నీ నమ్మలేం

* * *

మర్నాడు భర్త ఆఫీసుకు వెళ్ళిపోయాక వీధి వరండాలో కూర్చొని చదువుకుంటోంది తను 'అమ్మా' అదే గొంతు. ఆ గొంతులో అదే ఆప్యాయత, అదే దైన్యం. తనకి భయంవేస్తోంది.

'భయపడుతున్నావా తల్లీ! నేను నిన్నేమీ చెయ్యను. నేనొక్క టడుగుతాను చెప్పుతల్లీ!' అని కొంచెంసేపు ఏదో గుర్తుకు తెచ్చుకుంటున్న వాడిలా ఆగి, ఇలా అన్నాడు "సరిగ్గా యిరవై యేళ్ళ క్రిందట నా కూతురు కమలని నాకు వదలి నా భార్య వెళ్ళిపోయింది యీ లోకం వదలి 'అమ్మ ఏది నాన్నా?' అని అడిగితే ఆకాశంవేపు చూపించేవాణ్ణి నా పిచ్చితల్లికి నా కమలని బాగా పెంచాలనీ, అలాచేస్తే నా భార్య ఆత్మ సంతోషిస్తుందనీ అనుకొనేవాణ్ణి అది చదువుకొని పాసవుతూంటే పొంగిపోయే వాణ్ణి. 'ఉద్యోగం చేస్తాను నాన్నా!' అంటే దాని మాటను కాదనలేక, అవసరం లేకపోయినా 'అలాగే' అన్నాను నా చిట్టితల్లి బంగారుబొమ్మ, అచ్చం వాళ్ళమ్మలాగానే ఉండేది. దాని రూపమే దానికి శత్రువయిపోయిందమ్మా! ఆ ఆఫీసరు దాన్ని ప్రేమిస్తున్నాడు నేను నిజమేననుకున్నాను తర్వాత తెలిసింది తల్లీ! నా కొంప మునిగిపోయింది. నా బంగారు తల్లి బ్రతుకు బూడిదపాలయి పోయింది దాని నిండు జీవితంలో నిప్పులు పోసేశాడు తల్లీ! నాశనం చేసేశాడు. వాడి కాళ్ళు పట్టుకొని బ్రతిమాలాను.

కాని వాడి మనస్సు కరగలేదు. పెళ్ళి చేసుకోనన్నాడు తన్ని తగిలేశాడు, ఆ కోపం, వాడిమీద కోపం, సంఘం మీద కోపం నా కమలమీద చూపించాను ఎప్పుడూ చెయ్యిచేసుకోని వాణ్ని, ఆ వేళ దాన్ని కొట్టేను. నా చేతులు ఇంకా యిలాగే ఉన్నాయి! ఈ పాపిష్టి చేతులు నరికినా పాపం లేదు. మర్నాడు పొద్దున్న నా కమల నన్ను వదిలేసి నూతిలో పడిపోయింది తల్లీ! ఆత్మహత్య చేసుకుంది కాదు, కాదు నేనే చంపేశాను. నేను చేసిన పనికి దాని మనసెంత బాధ పడిపోయిందో! నాకు చావురాలేదు! నన్ను నేను చంపుకోలేకపోయాను! నా చిట్టి తల్లిని మర్చిపోలేకపోయాను. మర్చిపోవడానికి త్రాగుడు అలవాటు చేసుకున్నాను. కాని లాభం లేదు. నా పాపం నన్ను వెంటాడుతోంది మర్చిపోలేను మళ్ళీ నిన్నుచూస్తే, నా కమల జ్ఞాపకం వస్తోందమ్మా! అందుకే నిన్ను చూడకుండా ఉండలేకపోతున్నాను ఇప్పుడు చెప్పమ్మా! నేను పిచ్చివాణ్ణా! చెప్పుతల్లీ! చెప్పు!" అతని ముఖం ఎర్రగా కందిపోయింది. కళ్ళవెంట నీరు ధారాపాతంగా కారుతోంది

పాపం ఎంత బాధపడుతున్నాడు! అతని మాటలు వింటూంటే అతను పిచ్చివాడని నమ్మలేక పోతోంది చెట్టంత కూతురు ఆత్మహత్యతో అతనికి మతిభ్రమించి ఉంటుంది, ఛీఛీ అతన్ని తనెలా అంచనా వేసింది మొదట!

'మాట్లాడవేం తల్లీ! నువ్వుకూడా నన్ను పిచ్చివాడనే అంటావా' అతని మాటలతో తన ఆలోచనలకు అంతరాయం కలిగింది

'లేదు లేదు! నేను భయపడడం లేదు' అంది తను గాభరాపడుతూ.

'అంతేచాలు తల్లీ! నువ్వైనా ఆ మాట అంటున్నావు' అంటున్నాడతను

తన కిప్పుడు సంతోషంగా వుంది, అతను తననిచూసి సంతృప్తి పడుతూంటే.

'పోరా యిక్కడినుంచి, యిక్కడికెందు కొచ్చావు' అని వినబడడంతో తల పైకెత్తి చూసింది. తన భర్త మాధవరావు అతన్ని కసురుతున్నాడు. ఆఫీసునుంచి యిప్పుడే వస్తున్నట్టుంది. 'పో ఇక్కడినుంచి. యీసారి వచ్చేవంటే జాగ్రత్త'. అంటున్నాడు.

అతను తనవైపొకసారి చూసి వెళ్ళిపోయాడు భారంగా

'రాధా! అతను పిచ్చివాడు తెలుసా! త్రాగుబోతువెధవ. వాడు యింట్లో జొరబడి వస్తువు లేమైనా దొంగతనం చేస్తాడు జాగ్రత్తగా ఉండు' అంటున్న మాధవరావు మీద కోపం వచ్చింది తనకు.

'అత నలాంటి వాడు కాదేమో' అంది.

"నువ్వమాయకురాలివి రాధా! వాడొట్టి త్రాగుబోతు. డబ్బంతా అలాగే తగలేసుకున్నాడు నీ దసలే సున్నితహృదయం. అందుకే నువ్వందర్నీ మంచిగానే ఊహిస్తావు" అన్నాడు.

లేదు. తను పొరబడలేదు. ఆయనే పొరబడ్డారు. పాపం కూతుర్ని మర్చిపోయే ప్రయత్నంలో అతను త్రాగుడు అలవాటు చేసుకున్నాడు. పెద్ద హోదాలో ఉన్న తన భర్తే అతనిని అనరాని మాట లంటున్నాడు. ఇంక మిగతా వాళ్ళందరూ అతన్ని పిచ్చివా డంటున్నారంటే, దానిలో ఆశ్చర్యపడవలసిన దేమీ లేదు. తన భర్త పొమ్మంటూంటే, అతను తన వేపు చూసిన చూపులో వింతదైన్యం! ఎంత బాధపడ్డాడో! కూతురు చని పోకపోతే అతనూ అందరిలాంటి వాడే. అతనూ డబ్బూ, గౌరవం ఉన్న వాడే. కాని ఒక్క సంఘటన అతన్ని మతిభ్రష్టుణ్ని చేసింది. దరిద్రుణ్ని చేసింది. అవమానాల పాలుచేసింది. సంఘంలో అతని స్థానాన్ని తుడిచి పెట్టేసింది. మానవ జీవితాన్ని మార్చ డానికి ఒక్కసంఘటన చాలు. ఒకే ఒక్క సంఘటన జీవితాన్ని అత్యున్నత స్థానా నికి తీసుకెళ్ళగలదు. లేదా సర్వ నాశనం చేయగలదు. అతనికి తనని చూడగానే కూతురు జ్ఞాపకం రాక పోతే తనుకూడా అతని గురించి అందరి లాగానే ఆలోచించేది ఎవరికీ ఎవరి గురించీ ఏమీ తెలియదు. ఒకరికి మరొకరి గురించి తెలుసుకోడానికి ఆసక్తీలేదు, సమయమూలేదు అయినా ఎదుటి వాడి ప్రవర్తనవల్ల అతని గురించి ఏదో ఒక అభిప్రాయం ఏర్పరచుకుంటాడు ప్రతీ మనిషీను. దానిని అవకాశం వచ్చినప్పుడు సంకోచం లేకుండా అందరిపైనా రుద్దుతాడు. అంతే! అతని బాహ్య ప్రవర్తనను చూచి పిచ్చివా డంది లోకం. కాని అతనెందు కావిధంగా అయ్యాడో ఎవరికీ తెలియదు. తెలిసినా అతని మీద ఎంతమంది సానుభూతి చూపెడతారు? సానుభూతి చూప డంలో కూడా లాభంకావాలి. లాభం లేనప్పుడు సానుభూతి చూపి మనం బాధపడితే వివేక మౌతుందా! వివేకం కాకపోయినా మానవత్వమౌతుంది. అయినా యిదంతా ఆలోచించి తాను చేసేదేముంది? అవును తన భర్త చెప్పినట్టు తను అమాయకురాలే అను కుంటూ నవ్వుకుంది.

* * *

ఉదయం తనభర్త ఆఫీసుకు వెళ్తూ, పిచ్చివాడిని గురించి హెచ్చరించాడు. తలుపులు జాగ్రత్తగా వేసుకోమని.




రెండు రోజులపాటు అతను వచ్చిన జాడలేదు. కాని మూడవరోజున తను లోపలి గదిలో పడుకొని చదువు కుంటోంది. ఒక్కసారి ఎదో అలికిడి వినిపించి ద్వారం వేపు చూసింది. అతను నిలబడి ఉన్నాడు. కళ్ళనిండా నీళ్ళు. ఒకసారి తన పరిస్థితి గుర్తుకొచ్చే సరికి భయం వేసింది. అతను పిచ్చి వాడు, త్రాగుబోతు తను ఒంటరిగా గదిలో ఉన్నట్టు గుర్తు కొచ్చేటప్పటికి ఒళ్ళు జలదరించింది.

అతనన్నాడు 'రెండు రోజులనుండి నువ్వు కనపడకపోతే ఎంత బాధ పడ్డానో తెలుసా తల్లీ! ఇంక ఉండలేక వచ్చాను. క్షమించమ్మా "

అతని మాటలు తనని కరిగించలేక పోయాయి. ఈ రోజు తను వీధితలుపు గడియ వేసుకోవడం మరచిపోయింది కాబోలు. అయినా అతడు తన యింట్లోకి ఆ విధంగా అడుగు పెట్టడం కుసంస్కారం. తను కోపంగా అంది.

"వెళ్లు ముందిక్కడినుండి వెళ్ళిపో అవతలకి "

'నువ్వంత మాటనకమ్మా! వెళ్ళి పోతానమ్మా! కాని నువ్విలా అంటే సహించలేనమ్మా!' అన్నాడతను

'ముందవతలికి వెళ్ళి మాట్లాడు. ఇక్కడినుండి వెళ్ళిపో' అంది బాధగా. అలా అంటూండగానే తన భర్త వచ్చాడు. అతని ముఖం జేవురించింది

'రాస్కెల్! ఎందుకొచ్చావిక్కడికి? వెళ్ళమంటే కదలకుండా ఎదిరిస్తు న్నావా?' అంటూ చెంప ఛెళ్లు మని పించాడు. అతని చెయ్యి పట్టుకొని

వీధి గుమ్మం దగ్గరికి తీసుకెళ్ళేడు. అక్కడ మరో యిద్దరున్నారు. వాళ్లు తన భర్త ఆఫీసులోనే పనిచేస్తున్నారు. ఏదో పనిమీద వచ్చివుంటారు.

'ఆ పిచ్చి వెధవ మీ యింట్లో కొచ్చాడేమిటండీ, త్రాగుబోతు వెధవ?' అంటున్నాడొక వ్యక్తి.

'మగాళ్ళెవరూ లేరని, దొంగతనం చెయ్యడానికి యింట్లో జొరబడ్డాడు లాగుంది. వెధవకి దొంగబుద్ధి కూడాను' అన్నాడు తనభర్త

'అలాగా! యింకా అనుమాన మేమిటండీ? అదే కరక్టు! వాడందుకే జొరబడ్డాడు. మీరలా మంచిగా ఉంటే లాభం లేదండీ, యిలాంటి వాళ్ళకి దేహశుద్ధి చెయ్యకపోతే మరింత రెచ్చిపోతారండీ' అంటూ ముందుకి వచ్చాడు రెండవ వ్యక్తి.

'పోనీలేవయ్యా! వాడు ఫూల్ అనుకో. అందులో పిచ్చివాడు కూడాను. వాడేదో కక్కూర్తి పడితే పడ్డాడు. మనమైనా కాస్త కనికరించాలి' అన్నాడు తన భర్త.

'ఏమిటి సార్! మరీ యింత యిది కూడదండీ. యిలాంటి దొంగ వెధవని విడిచి పెట్టడమేమిటండీ. మీరుఔనంటే నేను పోలీసు రిపోర్టిస్తాను సార్'.

'పోనీలేవయ్యా! వాడి దారిని వాడిని పోనిద్దురూ ఇలాంటి వాళ్ళను చూస్తే నాకు జాలి. అదో వీక్ నెస్ అనుకో' తన భర్త.

'సరేలెండి! అలాగే వదిలేద్దాం. మీకు కష్టం కలిగించడ మెందుకులెండి. వాడి పాపం ఊరికే పోతుందిటండీ. అనుభవించడూ?' అంటూ పొమ్మని తగిలేశారు ఆ ముసలివాణ్ణి వాళ్లిద్దరూ

వెళ్ళిపోతూ లోపలి ద్వారం దగ్గర నిలబడ్డ తనవేపు చూశాడతను. కళ్ళలోంచి నీరు ధారగా కారుతోంది. ఆ కళ్ళలో బాధ దైన్యం, సంతృప్తి యీ భావాలన్నీ నిండివున్నా యని పించింది అతను మెల్లగా నడుచు కుంటూ వెళ్ళిపోతున్నాడు. అతను మాటలు పడుతున్నా ఎదిరించలేదు. ఎదిరించడానికి కావలసిన స్థానం అతనికి సంఘంలో లేదు. మూడు రోజుల బంధం, ఆత్మీయత అన్నీ నాశనమయ్యాయి. ఆ దృశ్యం తన హృదయాన్ని పిల్చి పిండిచేసింది.

తనెంత నీచురాలు! అతనెందు కొచ్చాడో తెలుసు తనకు. తను పొమ్మంటే ఎంత బాధ పడ్డాడో! తన భర్త అతన్ని కొడితే తనేమీ చెయ్య లేదు. అంతమందీ అతన్ని తిడుతూంటే అతనిపై దొంగతనం ఆరోపిస్తూంటే 'అది నిజం కాదు, అబద్ధం' అని చెప్పమని ఘోషించింది మనసు. కాని తనలా చెప్తే తన గౌరవానికి భంగం వాటిల్లుతుంది. ఆ పిచ్చివాణ్ణి వెనకేసు

కొంస్తున్నానని అందరూ తనని అగౌర వంగా చూస్తారు. అందుకు అతను చెయ్యని, చేద్దామనుకోని, నేరానికి శిక్ష అనుభవిస్తోంటే, చూస్తూ వూరుకుంది తనని కూతురిలా భావించిన అతని ముంధు తన గౌరవాన్ని నిలువుకో డానికి ప్రయత్నించింది. తనెంత స్వార్థ పరురాలు! తనెంత మోసం చేసింది!

తన భర్త ఆ క్షణంలో పశువులా ప్రవర్తించాడు తనకెంత జుగుప్స కలిగిందో అతనిని చూస్తే! అదే సమయమని వాళ్ళిద్దరూ అతనినెంత పొగిడారు, తమ స్వామిభక్తి ఎంత గొప్పగా ప్రదర్శించారు! తన భర్త ఎంత క్షమాగుణం కనపరిచేడు! ఎంత సులభంగా నీతిబోధ చేశాడు! ఈనటన ఆత్మవంచన ద్వారా ఎంత కీర్తి గడిస్తున్నారు! అంతా స్వార్థం!

ఆ పిచ్చివాడు అమాయకుడు అతని హృదయం నిర్మలం. అందుకే అటువంటి అమాయకుణ్ణి తమ గొప్ప తనం వెల్లడించుకోడానికి, తమ స్వార్థానికి ఎరగా ఉపయోగించుకో గలిగారు

తను వాళ్ళందరికంటె అధము రాలు. ఎందుకలా అందర్నీ ద్వేషించ డం? తన ఆదర్శాలను అమలులో పెట్టలేక పోయేక, అలా అనుకుంటే కాని తృప్తి లేదు తను ఒక్కటంటే ఒక్కమాట నిజంచెప్తే అతని కవమా నాలు తప్పడానికి అవకాశముంది. అయినా తన గౌరవంకోసం ఎంత బాధపడిపోయింది! తనలాంటి స్వార్థ పరురాలెక్కడ! అతనిలాంటి నిర్మల హృదయుడెక్కడ! అతని గురించి ఆలోచించడానికి కూడ తన కర్హత లేదు. అతను మరెవరికీ అర్థంకాడు! అందుకే లోకుల దృష్టిలో అతను పిచ్చివాడు! స్వార్థం పొరలోంచి చూస్తున్న లోకానికి, అతని నిర్మల హృదయ సౌందర్యం అర్థంకాదు.

శరీరాన్ని దుస్తులు వేసి ఎలా ఆకర్షణీయంగా చేయాలని చూస్తామో అలాగే మనస్సునికూడా చుట్టూ పరదాలు వేసి ఆకర్షణీయం చేసుకో వాలి. అప్పుడే దానికి సంఘంలో గౌరవం! లేదా జీవితమే దుర్భర మౌతుంది

---


బిక్క చెవులు మినహా... అంతా వాడి పోలికలు వొచ్చాయండు!


దానికి బ్రిడ్జి కట్టించక పోయినా.. కంకర రోడ్డు ఐనా వేయించండి......



చిలుకూరి
శేషగిరిరావు

"డాక్టర్ !"

..... ...

"ప్రసాద్ !''

.........

"డాక్టరుబాబూ ! ! !"

వీధి తలుపు ఎవరో బ్రద్దలుకొడుతున్నారు గాఢనిద్రలో నున్న నాకు చాలసేపటివరకు మెలకువరాలేదు. బయట హోరుమని వర్షం కుండపోతగా కురుస్తోంది తుఫానుగాలి రివ్వుమని వీస్తూ బయట పిలిచే మాటలు లోపలకు వినిపించటంలేదు. బద్ధకంగా లేచి, క్రిందకు వచ్చి తలుపు తీయగానే - సుందరం వాళ్ళ ఫోర్డులో ప్రత్యక్షమయ్యాడు.

"సారీ బ్రదర్! ఈ తుఫాను హోరులో నీ మాటలు వినబడక మెలకువ రాలేదు. పన్నెండు గంటలకు ఒక పురిటి కేసు అటెండు అయివచ్చి, అలసిపోయి నిద్రపోయాను. ఇంత ప్రళయంలో కొట్టుకొచ్చే అర్జం ఏమొచ్చింది? సాయంత్రంవరకూ ఏ గడబిడా లేదే?" అని అడిగాను.

"కమలకు రాత్రినుంచి నొప్పులు తీవ్రంగా వచ్చి ఆగిపోతున్నాయి. నర్సును గంటక్రింద తీసుకొని వచ్చా. కమల చాలా బాధపడుతోంది. అమ్మ నిన్ను అర్జంటుగా తీసుకొని రమ్మన్నది." అన్నాడు సిగరెట్టు అంటించి.

ఇంకొక కేసయితే వెళ్ళటానికి బద్ధకించేవాణ్ణి. కాని – నా చిన్ననాటి స్నేహితుడు సుందరం. అంతటి తుఫానులో నన్ను వెతుక్కుంటూ వస్తే – కాదనే సాహసం లేకపోయింది.

సుందరం, నేనూ ఒకే కాలేజీలో చదువుకున్నాం. అతను బి.యల్. కోసం మదరాసు వెడితే, నేను మెడిసన్ కోసం విశాఖపట్నం వెళ్ళాను. వారం రోజుల క్రిందటే యీ వూరి హాస్పటల్‌కు బదలీ అయివచ్చి ఛార్జీ తీసుకున్నాను. చదువుకునే రోజుల్లో మేము ఏకోదరుల్లా మెలగటంతో మా స్నేహం అంత బలీయమైపోయింది.

మేము వెళ్ళేటప్పటికి యింట్లో అంతా కంగారుపడుతున్నారు. సుందరంభార్య కమలకు పురుటిరోజులు. ఉదయంనుండీ ఆమెకు నొప్పులు రావటం – ఆగిపోవటం జరుగుతోంది. రాత్రి పన్నెండు గంటలనుంచీ ఆమెస్థితి ఏమీ బాగోలేదనీ, ఇక్కడ పురుడు రావటం కష్టమనీ నర్సు నాకు కబురు చేయమన్నదట. నేను చాలా శ్రద్ధగా పరీక్ష చేశాను. కాంప్లికేషన్సు ఏమిటో తెలియటంలేదు. హార్టూ, పల్సూ అన్నీ బాగానే ఉన్నాయి. రెండునిముషాల కోసారి నాడిఅందటం లేదు. ఉండుండి కాళ్ళూ, చేతులూ చల్లబడుతున్నాయి. నా అనుభవంలో యిలాటి పరిస్థితిని ఎప్పుడూ ఎదుర్కొనలేదు. పాపం! కమల బాధతోనూ, ఆయాసంతోనూ నీరసించిపోతోంది.

ఆ స్థితిలో నాకు ఏమి చేయటానికీ పాలుపోలేదు. పిఠాపురంలోని మిషను ఆసుపత్రికే తీసుకొనిపోవటం శరణ్యమనిపించింది. ఇంటిల్లపాదీ బెంగతో తల్లడిల్లిపోతున్నారు. నా అభిప్రాయం వెల్లడించగానే పెట్టె, బెడ్డింగూ సర్దుతున్నారు. ఇంతలో సుందరం చెల్లెలు అప్రయత్నంగా "ఈ సమయంలో మహాలక్ష్మిపిన్ని వుంటే ఎంతబాగుండే" దంది.

ఆ మాట అనగానే సుందరం తల్లి రమణమ్మగారు తూలుతూ వచ్చి "నాయనా! సుందరం! ఎందుకురా మీరంతా బెంగపెట్టుకొని కంగారు పడతారు. మిమ్మల్ని నేను మరచిపో




లేదురా! మీ రేమీ కంగారు పడకండి. మీ ప్రయాణం మానుకోండి. పిల్లదానికి పురిటాలి గాలి సోకింది. నేను రాగానే అది తొలగిపోయింది. అది ఉదయం నుంచీ పిల్లదాన్ని నానాహింస పెట్టింది. ఇహ ఏమీ దిగులులేదు. అయిదునిమిషాల్లో ఆడపిల్ల పుడుతుంది. మళ్ళీ మీ యింట్లో నేను వెలుస్తున్నా. పిల్లదానికి నా పేరు పెట్టండి. భయపడకండి,'' అని చెప్పింది.

ఇంటిలోనివారంతా భయభక్తులతో ఆమెకాళ్ళకు మ్రొక్కారు. ఆమె కమల తలను ఆప్యాయంగా నిమురుతూ "కోడలా! మళ్ళీ నీ కడుపున పుడుతున్నా! నన్ను జాగ్రత్తగా చూచుకో," అన్నది.

కొబ్బరికాయకొట్టి హారతికర్పూరం వెలిగించారు.

సరిగ్గా ఆమె అన్న అయిదునిమిషాలకే ఏ కంగారూ లేకుండా కమల ఆడపిల్లను ప్రసవించింది. ఇంటిల్లిపాదీ 'మామ్మ' వెలసిం దని ఆనందంతో మైమరచిపోయారు.

నా ఆశ్చర్యానికి మేరలేదు. సామాన్యంగా నేను దేముడూ, దెయ్యమూ అనే మూఢనమ్మకాలను లెఖ్ఖచేయను. అందులో యీ వృత్తి అవలంభించాక – ఆ మూఢనమ్మకాలమీద అసహ్యం కూడా పుట్టుకొచ్చింది. కాని ఆ నాడు జరిగిన సంఘటన – నా జీవితంలో మరపురానిది. వైద్యశాస్త్రంలో చాలా దిట్టయని పేరుపొందినవాణ్ణి, ఎంతో

నేర్పరినవి గర్వపడే నాకు - ఆనాడు శృంగభంగ మైంది మనిషి చావుబ్రతు కుల మధ్య ఊపేసి - అనుభవసీయుల మనే డాక్టర్లనే తికమక పెట్టి బోల్తా కొట్టించి - క్షణంలో తన కరుణావీక్షణ ములచే అందరినీ ఆనందసముద్రంలో ముంచిన - ఆ అమోఘ, అజ్ఞాతశక్తికి రెండుచేతులూ మోడ్చి జోహారు లర్పించ కుండా వుండలేకపోయాను.

* * *

తెల్లవారంగానే మొహాలు కడుక్కొని కాఫీ తాగున్నాం. ఇహ ఆ అజ్ఞాతశక్తి ఎవరో కనుక్కోవాలనే కుతూహలాన్ని ఆపుకోలేకపోయాను

"ఎవరోయ్! నిన్న మీ అమ్మగారి వంటిమీద పూనింది," అని అడిగాను.

సుందరం సిగరెట్టుముట్టించి, ఒక వేడి నిట్టూర్పు విడిచి, "అది ఒక విచిత్రమైన పవిత్రమైన - ప్రబంధగాధ! - మా కుటుం బానికి పవిత్రమైన అనుబంధం! మనం చదివిన గ్రంధాలలో ఇలాంటి అపూర్వ సంఘటనలు సామాన్యంగా కానరావు.

"సుమారు నలభై యేండ్ల క్రిందట జరి గిన పవిత్ర ప్రేమగాధ చెప్పతున్నా మా నాన్నకు అప్పుడు యిరవయి ఏళ్ళుంటాయి. కాలేజీలో బి ఏ. చదువు తున్నాడు. నువ్వుకూడా ఆయనను చూచే వుంటావు మనిషి అజానుబాహుడు, మంచి అందకాడు. వ్యాయామంలో నిధి అవటంచేత, కండలుదేరిన పచ్చని శరీ రంతోనూ, నూనూగు మీసాలతోనూ, ఉంగరాల జుట్టుతో, కాశీమజిలీలు వర్ణించే రాచకుమారిడిలావుండేవాడు. అతిసాహసి భయమంటే ఏమిటో ఎరుగడు చిన్న ప్పటినుంచీ తన సాహసకృత్యాలతో ఎంతోమంది ప్రాణాలు కాపాడినాడట కాలేజీలో రింగ్పుమీదా, బార్పుమీదా గొప్పగొప్ప సాహసమైన పనులు చేసే వాడట. కాలేజీలో వందపైగా బహు మతులు మా నాన్నకే వచ్చేవట. కాలే జీకి ఆల్‌రౌండు ఛాంపియన్.

"మా నాన్నకు రామచంద్రరావు అనే సహాధ్యాయి వుండేవాడు అతనిది కోన సీమ. అతను మా ఇంట్లోనే వుంటూ నాన్నతో కాలేజీలో ఒకేతరగతి చదు వుతూ వుండేవాడు. ఇద్దరూ ఏకోద రుల్లా వుంటుండేవారు. అతడు నాన్నను శలవల్లో వారి వూరికి తాను కొనిపో తుండేవాడు. చూసేవాళ్ళంతా వారిని రామలక్ష్మణులని ముచ్చటగా పిలిచేవారు.

"అవి మండువేసవిరోజులు. కాల వల్లో నీరు లేదు. నాన్న, రామచంద్రం, మునసబుగారబ్బాయి, మరోయిద్దరు రాచకుర్రాళ్ళూ కలసిపేస్తు ఆట ఆడుకుం టున్నారు. ఆట మంచిరసపట్టులోవుంది. ధనలక్ష్మి గలగలా మ్రోగుతోంది. క్రింద రెండుపేస్తు లున్నాయి. సిగరెట్లపొగ గదిసంతా ఆవరించింది.

"రెండుగంటల సమయం. వేడి గాడ్పులు గూబల వగలకొడుతున్నాయి.

ముక్కలయినా కూడా సంచారం మాని నాలుకలు జాపి వగరుస్తూ - చెట్లనీడల్లో పరున్నాయి. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. ఇంతలో గుప్పుమని ఆకాశంలో పెద్దపొగ లేచింది.

"'రాచపేటకు నిప్పంటుకుంది. కొంపలు తగలబడుతున్నాయి లేవండి! లేవండి!" అంటూ జనం కేకలేస్తూ పరుగెత్తుతున్నారు.

"నాన్న పేకముక్కలు పారేశాడు బృందమంతా బిలబిల్లాడుతూ రాచపేట జేరుకుంది అప్పటికప్పుడే రెండు మూడు యిళ్ళు పరశురామ ప్రీతి అయ్యాయి. జనం కంగారులో చిందులు త్రొక్కుతున్నారు ముందు మండుతోన్న కొంపలను ఆర్పివేయక - మిగిలిన యిండ్లను తడుపుతున్నారు. దాని వలన గ్రామమంతా తగులబడే ప్రమాదం కనుపిస్తోంది వారి అవివేకానికి నాన్నకు కోపమూ, విచారమూకూడా కలిగింది

"జనాన్నికూడదీసుకున్నాడు. ఇండ్లలోగల విలువైనసామానులన్నింటినీ సురక్షితమైన స్థానానికి జేర్పించాడు. పెద్ద పెద్ద వెదురుబొంగులలో కాలుతూన్న తాటియాకుల చూరును క్రిందకు కూల్చివేయించి - మంటలు పైకి ఎగబ్రాకకుండా అరికట్టించేశాడు. వీరావేశంతో గోడలమీద నిలుచుండి అగ్నిహోత్రునితో పోరుతున్న నాన్నను చూచి, జనం రెట్టించిన ఉత్సాహంతో అతనికి సాయం చేశారు. ప్రాణాలకూడా తెగించి మండుతూన్న యిండ్లలోకి జొరపడి రెండు మూడు ప్రాణాలను రక్షించాడట,

"మంటలు అదుపులోనికి వచ్చే సమయంలో హఠాత్తుగా గాలి విజృంభించింది. వీధిచివర నున్న మేడ అంటుకున్నది. చూస్తుండగానే మంటలు తీవ్ర రూపం దాల్చి మేడచుట్టూ ఆక్రమించుకున్నాయి. విలువైన సామానులూ, పశువులూ మాత్రం బైటకు జేర్చబడ్డాయి. ఉన్నట్టుండి రామరాజుగారి కుటుంబంలోంచి "హాహా కారాలు బయల్దేరాయి.

"'అమ్మాయి కాలిపోతోంది, రక్షించండి! రక్షించండి," అని రామరాజుగారు గుండెలు బాదుకుంటున్నారు

"వేలకొలదీ జనం ఆ భవనంముందు గుమిగూడి అచేతనులై యున్నారు. రామరాజుగారి ఏకైకపుత్రిక మహాలక్ష్మి మేడగదిలో చిక్కుకుపోయింది. అవరణమట్టూ నిలవయుంచిన కలపా, మంచాలూ అంటుకొని జ్వాలలు పైకి లేస్తున్నాయి. నిచ్చెనలు వేసి పైకి వెళ్ళటానికికూడా అవకాశం లేదు. నాన్న యువకబృందంతో అక్కడకు వచ్చాడు. ఆయన అప్పటికే బాగా అలసివున్నాడు. చెమటలకు కాలిన మసి శరీరమంతా

అంటుకుంది. అక్కడక్కడా కాలిన చిన్న చిన్న గాయాలు కన్పిస్తున్నాయి.

"మేడమీదకు వెళ్ళేసాధనం ఎవరికీ తోచటంలేదు. క్రిందభాగమంతా భగభగ మండుతూన్న మంటలచే నిండివుంది. రాజుగారి కుటుంబం వీధిలోపడి రోది స్తోంది. ఇంతలో మేడమీది గదిలోంచి పదునెనిమిదేండ్ల బంగారు విగ్రహం భయభ్రాంత చేతస్కయై 'నాన్నగారూ!' అంటూ కెవ్వున కేకవేసింది.

"జనమంతా ఆ యువతిని చూచి 'హాహాకారాలు చేస్తున్నారు. అప్పుడే మేడమీది పెంకుటిచూరుకూడ అంటు కున్నది. రామరాజుగారు అందరివైపూ దీనంగా చూశారు. 'ఇంతమందిలోనూ కుమార్తెను రక్షించే మగాడే లేడా?" ఆమెను కాపాడినవాడికి లక్షరూపాయ లిస్తా!' నన్నాడు

"క్షణం అంతా నిశబ్దం! డబ్బుమీద ఆశకొలదీ కొందరు ప్రయత్నించారు. కాని అప్పటికే చేతులు మించిపోయి నందున - బ్రతికుంటే బలుసాకన్నా తిన వచ్చుని - ధనాని కాసించి ప్రళయ దావాగ్నిని సమీపించలేకపోయారు.

నాన్న శరీరంలో బలంతగ్గినా - ఆవేశం తగ్గలేదు. కేవలం అచేతను డుగా - నిస్సహాయుడై, కన్నకుమార్తె కొరకు దీనంగా విలపిస్తున్న ఆ వృద్ధిని చూచి జాలికలిగింది. తన జీవితాన్ని బలి పెట్టి అయినాసరే, ఆ యువతి ప్రాణా లను రక్షించా లనుకున్నాడు. క్షణకాలం చుట్టూ ఉన్న పరిసరాలకేసి దృష్టి సారించాడు.

"ఆ మేడకు సుమారు వందగజాల్లో ఒక పెద్దచింతచెట్టు వుంది. మేడకు సమీ పంలోనున్న కొమ్మపై దృష్టి నిలి పాడు బయటపడవేసిన సామాను లోంచి రెండు గట్టి మోకుతాళ్ళను తీశాడు. ఒకయువకుణ్ణి చెట్టుపైకి ఎక్కించి ఆ తాటిని తాను చూచిన కొమ్మకు బలంగా ముడివేయించాడు. భూమినుంచి అయిదు అడుగుల ఎత్తులో ఆ తాటికి రెండవ తాడు ముడి వేయించాడు.

"అప్పటికే మేడమీద మంటలు తీవ్ర రూపం దాల్చాయి. ఆ యువతి భయ ముతో ఆర్తనాదం చేస్తోంది. నాన్న తన యిష్టదైవమైన ఆంజనేయుణ్ణి స్మరిం చాడు ఒక్కసారి ఆవేశంతో శరీరం ఉప్పొంగింది. అతడు ఆ తాటి మధ్య భాగాన్ని చేరుకున్నాడు. రెండవతాటిని సుమారు యిరువైమంది యువకులను చాలాదూరంవరకు లాగి వదలమన్నాడు. ఆ వూపులో నాన్న పట్టుకున్న తాడు మేడ సమీపంలోకి వెళ్ళింది.

"ఇందులోని కిటుకు అందరికీ తెలి సింది. ఈసారి రెట్టించిన ఉత్సాహంతో జనం శక్తినంతా వినియోగించి తాడు లాగి వదిలారు. ఈసారి నాన్న - సినీమాలోని టార్జనులా ఆకాశంలో ఊగుతూ వెళ్ళి మేడవసారాలోకి




దుమికి — ఆ తాటిని అక్కడ నున్న కొయ్యకు బిగించాడు.

"కాని మేడమీద నిలుచున్న యువతి ఎవ్వరికీ కన్పించటంలేదు. పది పదిహేను నిముషాలు గడచిపోయాయి. మేడ పైకప్పుకూడా కూలిపోయింది. నాన్నకూడా కాలిపోయివుంటాడని క్రింద నున్న జనం హాహాకారాలు చేస్తున్నారు. అప్పటి కప్పుడే కొంతమంది బిలబిల్లాడుతూ చెట్టుకొమ్మల కెక్కి మేడమీద ఏమి జరుగుతోందనని ఆత్రుతతో చూస్తున్నారు.

"అంతలోనే

తనురాలైన

తాటిని బల

యు

మాన్!' అని ఒక కేక వేసి, ప్రక్క నున్న గోడను ఒక్క తన్ను తన్ని ఆకాశంలోకి ఎగిరాడు.

"ప్రజలలోనుండి విచిత్రం! అద్భుతం!! అనే కేకలు వినిపించాయి. క్రింద పగ్గం పట్టుకున్నవారు మెల్లగా తాటిని చేదుకున్నారు. నాన్న తాటి నుండి మెల్లగా క్రిందకు జారుకున్నాడు.

"జనంలోని అప్పటి

ఆనందం వగి

నిష్కపటి. పరోపకారపరాయణుడు. ఆనాటి ఆ దివ్యశక్తి కేవలం ఆంజనేయ వరప్రసాదితమే!

"తాడుమీంచి ఆ భారాన్ని క్రిందకు దించగానే నాన్నకు స్పృహ తప్పింది. నాన్నను రామచంద్రం యింట్లో పరుండ బెట్టారు. ఆ యింటికి సమీపంలోనే యున్న యింకొక యింటిని రామరాజు గార్కి తాత్కాలికంగా విడిదిగా యిచ్చారు. అగ్నిహోత్రుడుకూడా యీ సాహసకార్యానికి అద్భుతమంది శాంతి వహించాడా అన్నట్లు అంతటితో అగ్ని భయం తొలగిపోయింది.

"ఆ సాయంత్రం గ్రామంలోని యావత్తు ప్రజలు రామచంద్రంగారి యిట్టివద్ద జేరారు. అమలాపురంనుంచి సిద్ధమైన యిద్దరు డాక్టర్లు వచ్చారు. నాన్న ఆరోగ్యంగురించి క్షణక్షణం ఆందోళన వృద్ధికాసాగింది. తమ జీవి కంలో అలాంటి సాహసకార్యం కని, విని ఎరుగమని నాన్న వీరత్వాన్ని వేనోళ్ళ పొగడుతున్నారు. చివరకు డాక్టర్లు, నాన్ననీ ఆ యువతినీ పరీక్షించి వారికి ఏవిధమైన ప్రమాదమూ లేదని నచ్చచెప్పిన తరువాతగాని జనం ఇండ్లకు పోలేదు. ఆ రాత్రికి రాత్రి రామ

—రి కారు మా తాతను, నాయ
—ని రావటానికి వెళ్ళింది.
—న్న కళ్లు తెరి
—శులు

వచ్చి మంచందగ్గర కూర్చుండి తమ కుమారుని వీరోచితకార్యానికి ఆనంద భాష్పాలు రాలుస్తున్నారు.

"నాన్న కళ్ళుతెరవగానే 'రామూ! ఆ అమ్మాయి బ్రతికిందా?' అని హీన స్వరంతో అడిగాడు. ఆ అమ్మాయి కులాసాగా వుందని విని మళ్ళీ మగత నిద్రపోయాడు.

"ఆరోజు సాయంత్రానికి యిద్దరికీ ఆరోగ్యం చేకూరింది. రామరాజుగారు నాన్నను కౌగలించుకొని ఆనందం పట్ట లేక, అంతమందిలో ఏడ్చేశారు

"రెండోరోజు మా నాన్న మావూరు వచ్చేశాడు. వచ్చేముందు మా నాన్న ఆ యువతిని చూశాడు. ఆయన్ను చూడ గానే ఆ యువతి భయ, వినయ, లజ్జా సంభ్రమములతో నమస్కారం చేసి ప్రాణదాతకు కృతజ్ఞత వెల్లడించుకుంది. ఆ గ్రామవాసులు సన్మాన పురస్కారంగా ఆయనకు వీడ్కోలు యిచ్చారు. ఆ చుట్టుప్రక్కల గ్రామాలన్నిటికీ ఆనాటి వీరోచితగాథ ప్రచారమైంది రామరాజు గారు తన వాగ్దానాన్ని నిలుపుకుందామని ఎంతో ప్రయత్నించారు. కాని వారి ప్రతి ప్రయత్నమూ భగ్నపరిచాడు నాన్న.

"ఈ సంఘటన జరిగిన రెండు నెల లకు మా నాన్న వివాహం గొప్ప కట్నంతో వైభవంగా జరిగింది.

"ఈ సంఘటన జరిగిందగ్గరనుంచీ రాజుగారి కుటుంబంలో తీవ్రమైన అం

దోశన బయలుదేరింది. రాజు గారు మంచి సాంప్రదాయమైన కుటుంబం లోనివారు. ఆయన సుమారు రెండువందల ఎకరముల భూమికి ఖామందు. జిల్లా అంతటికీ మంచి పేరుమోసిన వ్యక్తి. పరోపకార పరాయణుడూ, సాత్వీకుడూ. వారికున్న సంతానమంతా పెద్దది కుమార్తె లక్ష్మి, రెండవ సంతతి కుమారుడు. లక్ష్మి పదునెనిమిదేండ్ల బంగారు ప్రతిమ. కేవలం దేవతలలో గల సర్వ సుగుణ సంపదలతో మూర్తీభవించిన సౌందర్యమూర్తి. అంత పిన్న వయస్సులోనే సంస్కృతంలోనూ, తెలుగులోనూ మంచి పాండిత్యం సంపాదించింది.

"ఒకత్తే ఆడపిల్ల గనుక తలిదండ్రులు అల్లారుముద్దుగా పెంచి, మంచి సాంప్రదాయమైన సంబంధం చూచి వివాహం బ్రహ్మాండంగా చేయాలని మురుస్తుండేవారు. ఎన్నో గ్రామాలూ, పట్టణాలూ తగిన వరునికోసం గాలించారు. కాని ఆ కోరిక ఏం ఫలించలేదు. ఆనాటినుండీ లక్ష్మిలో పూర్తిగా మార్పు వచ్చింది. ఆమె ప్రతిదినమూ ఉదయమే లేచి కాలకృత్యాలను తీర్చుకొని, తులసిపూజ చేసుకుని, ఆతరువాత యిష్టదేవతాపూజ చేసుకునేది. ప్రతినిత్యమూ విధిగా సుందరాకాండ పారాయణచేసేది.

"తనకుతలిదండ్రులు వివాహ ప్రయత్నం చేస్తున్నట్లు తెలుసుకొని–తాను తన జీవితంలో వివాహం చేసుకొనని చెప్పింది. గంపెడాశతో నున్న తలిదండ్రుల కిది పిడుగుపాటైంది. కుమార్తె నిశ్చయాన్ని మార్చటానికి బంధువుల చేతా, పెద్ద లందరిచేతా చెప్పించారు. విశ్వప్రయత్నం చేశారు. కాని లాభం లేకపోయింది. కారణం చెప్పమని ప్రతిమాలారు. ఆమె చెప్పిన కారణాన్ని విని నిశ్చేష్టులైనారు.

తాను సుక్షత్రియజాతికన్య. పరిణయమాడినభర్తతప్ప యితరులస్పర్శాజ్ఞానం తనకు కూడదనిది. తాను నిస్సహాయురాలుగా వుండి–దారుణాగ్నికి ఆహుతి అయే సమయంలో–జీవాన్ని తృణప్రాయంగా ఎంచి–మానవాతీతమైన, వీరోచిత సాహస కార్యంతో తనకు ప్రాణదానం చేసినవాడే తన నాధుడు. ఇదియే తన మనో నిశ్చయం! జీవిత పరమావధి!! భగవత్సంకల్పమూను!!!

రాచకుటుంబంలో యీమె సంకల్పం గొప్ప సంచలనాన్ని కలిగించింది. ఇంతకుముందు కనీ వినీ ఎరుగని సాంప్రదాయం. ఇంకా పూర్వాచారాలను విడవటానికి అలవాటుపడని రోజులు. అందులో క్షత్రియజాతి పట్టుదలలు మరీ నిర్దిష్టమైనవి. ప్రతిరోజూ యింట్లో తర్జనభర్జనలు జరిగాయి. రాను రాను లక్ష్మి మనో నిశ్చయం దృఢమౌతూ, ఆమె తపోబలం వృద్ధియౌతోంది.

రాజుగారికి ఆనాడు తనకుమార్తె అగ్ని

హో(త్రంనుండి రక్షింపబడి నందులకు సంతోషించలేకపోవలసివచ్చింది. ప్రస్తుతపు క్లిష్టపరిస్థితిని ఎట్లు ఎదుర్కొనడమనేదే ఆయనకు తీరని సమస్య అయింది. ఆయన తన స్వజనులతో యీ విషయం ముచ్చటించారు. ఎవరికి తోచిన అభిప్రాయాలు వారు చెప్పారు. ఏపని చేయటానికి తనకు సాహసం చాలటంలేదు. రాజుగారు పెద్ద పెద్ద పండితులను కలుసుకొని కుమార్తెకు వివాహయోగం వుందనీ ఆమె భర్త మంచి ఉన్నత వంశంలోని వాడనీ, ఆమె పుట్టింటికీ మెట్టింటికీ ఎనలేని కీర్తి తెస్తుందనీ తెలిపారు. రాజుగారు చివరలో యీ విషయం రామచంద్రం తండ్రిద్వారా మా తాతకు తెలిపారు వారిలోవారు తర్జనభర్జనలు జరుపుకున్నారు. ఇలా మరో ఆరునెలలు గడిచాక ఒకదారిలోకి వచ్చారు. క్షత్రియ కన్యను బ్రాహ్మణుడు పరిణయం చేసుకోవటం శాస్త్రసమ్మతమే ననీ, కేవలం యీ సంఘటన దైవబలంతో కూడినదిగా తోచటంచేత — యీ వివాహం విధిగా జరుపవచ్చని — కాని లక్ష్మి అత్తవారింట్లో — ఆమెకు ఇతరులతో సంబంధంలేకుండా — ఆమె రాచమర్యాదలకు లోటులేకుండా వుండేట్టు ఆమెకు ప్రత్యేక భవనంలో వుంచే నిబంధనమీద — వివాహం అతి వైభవంగా జరిగింది.

రాజుగారు కుమార్తెకు యాభై ఎకరాల మాగాణిభూమి, యాభై వేల విలువచేసే ధనకనకవస్తువాహనములు సమర్పించుకున్నారు.

మా తాతగారిదీ సంపన్న కుటుంబమే గనుక మాయింటివెనుకనున్న సుమారు ఎకరం ఆవరణలో ఒకచిన్న బంగళా నిర్మించి, దానిలోనే ఒక పూలతోట, కొలను నిర్మించి రాచ కుటుంబమునకు కావలసిన ఏర్పాట్లన్నీ చేశారు

మొదట్లో యీ వివాహం మాఅమ్మకు సుతారమూ యిష్టంలేదు. సవతివస్తే తననాథుడు తన్ను అనాదరంతో చూస్తాడేమోనని భయపడింది. కాని — మాపిన్ని వచ్చిన కొలది కాలంలోనే ఆమె సుగుణసంపదలకు వశురాలైపోయింది. ఆమె అత్తవారింటికి వచ్చినది మొదలు చనిపోయేవరకూ ఏనాడూ మా అమ్మకూ, ఆమెకూ మధ్య మనస్పర్థలు కలుగలేదు ఇద్దరూ ఏకోదరుల్లా కలసి మెలసి యుండేవారు. ఆమె సహచర్యం వలన అమ్మ ఎంతో వివేకాన్నీ విజ్ఞానాన్నీ సంపాదించింది

ఆమె మాయింటికివచ్చిన ఏడాదికి నేను పుట్టాను. తరువాత యిద్దరు ఆడపిల్లలు పుట్టారు. మా అందరిపోషణా ఆమెదే. మాఅమ్మ వద్దకంటె ఆమెదగ్గరే మేము చనువుతో ప్రేమతో మెలిగేవాళ్ళం.

ఆమె యిల్లువిడిచి ఎక్కడకూ వెళ్ళి ఎరుగదు. ఉదయం లేవగానే — కాల




కృత్యాలను తీర్చుకొని, తులసిపూజా పతిపూజా చేసుకుని - మిగతాకాలంలో పిల్లలను చేరదీయటం - వారికి విద్యా బుద్ధులు నేర్పటం - వారి ఆరోగ్యాన్ని సరిచూడటంలో సరిపోయేది

ప్రతిరోజూ మధ్యాహ్నం - ఆమె భవనంలోని చావిడిలో - స్వయంగా ఆమె పురాణ కాలక్షేపం చేస్తుండేది. సుమారు యాభై మంది దాకా యిరుగుపొరుగు గృహిణులు వస్తుండేవారు శ్రావ్యమైన కంఠం! స్వచ్ఛమైన వాక్పటిమ వచ్చిన స్త్రీలందరూ పురాణంవిని ముగ్ధులౌతుండే వారు. ప్రతి పర్వదినం ఆమె బ్రాహ్మణ సత్కారం చేస్తుండేది. రానురాను ఆమె కీర్తి దశదిశలా వ్యాపించింది. ఆమె వలన సత్కారం పొందిన పండితులూ, సాయంపొందని దీనులూ, లేరంటే అతిశయోక్తికాదు. ప్రతి సంవత్సరం దేవీనవరాత్రులు అతి వైభవంగా జరిపి పండితసత్కారం, అన్నదానం విరివిగా జరిపేది

మా అందరి పెంపకపుభారం ఆమే వహించేదని ముందే చెప్పాను. ప్రతి రోజూ మాకు రామాయణ, భారత, భాగవతాల్లోని కథలు చెప్పేది. పెద్దల యందు వినయవిధేయతలు ఎట్లు ప్రదర్శించాలో, పాఠశాలలయందు గురువులపట్ల ఎట్లు శ్రద్ధా, భక్తి ప్రమత్తలతో మెలగాలో బోధించేది తప్పు చేసిన వారిని ఆమె విచిత్రంగా శిక్షించేది. ఆశిక్ష మరణశిక్షంటే కఠినంగావుండేది ఆదేమంటే - ఆ తప్పుచేసినవారితో ఆమె మళ్ళీ వారు క్షమార్పణ కోరేదాకా మాట్లాడేదికాదు ఇరవైనాలుగ్గంటలూ,

ఆమె కనుసన్నల్లో మెలగుతూ ఆమె అనురాగామృతాన్ని చూరగొనే యీ దీనులకు ఆమెశిక్ష నిజంగా కఠిన నరకంగానే వుండేది.

అందువలన యింట్లోని పిన్నలూ, పెద్దలూ, దాసదాసీజనం కూడా ఆమె అంటే ఎంతో గౌరవంతో, ప్రేమతో వుండేవారు. మాలో ఎవరికైనా కొంచెం జ్వరంవస్తే - రాత్రింబవళ్ళు మా ప్రక్కదగ్గర వేచియుండి సేవ చేసేది. మందు మాకులుకన్నా - రోగికి ఆమె అమృతహస్త స్పర్శమాత్రాననే రోగం మటుమాయ మయేది. ఆమె ఆదరమూ, ప్రేమా, అనురాగమూ మమ్మ ముగ్ధులను చేసేది.

మా పిన్నిగురించి యింట్లోవారూ, బయటివారూ వింతగా చెప్పుకునేవారు. ఆమె శాపవశంచేత భూలోకంలో అవతరించిన దేవకన్య అనీ - మా నాన్న పూర్వజన్మ సుకృతంచేతే - యీ జన్మలో మానాన్నకు ఆమె భార్యగా అవతరించిందని చెప్పుకునేవారు. మాపిన్నికి కలిగిన లోటల్లా ఒకటే ! ఆమెకడుపు ఫలించలేదు ఏనాడూ ఆమె ఆలోటునుగురించి విచారించలేదు. పైగా మేమే ఆమె సంతానమని, మా గుణగణాలను పొగడుతూ మురిసిపోయేది. మాయింటికి వచ్చిన తరవాత ఆమె పుట్టింటికి ఒకటి రెండుసార్లు మాత్రమే వెళ్ళింది.

ఆమె జీవించివున్నంతకాలమూ మాయింట్లో లక్ష్మి తాండవమాడుతుండేది. మా కుటుంబ యాజమాన్యమంతా ఆమే వహించేది, మా కుటుంబమునకు కావలసిన సమస్త వస్తు వాహనాలు ఆమె చేతులమీదుగా వచ్చేవి. మా అందరిపెళ్ళిళ్ళూ, కట్నాలూ, కనకమూ ఆమె సొంతసొమ్ముతోనే జరిపించేది. అందరూ ఆమె మాటనే వేదవాక్కులా శిరసావహించేవారు. ఆమె ఆదరణ అపూర్వమైనది. ఎవరికి ఏ సమయంలో ఏది అవసరమో - చూపుతోనే గ్రహించి వారికి అవి సమకూర్చి సంతృప్తి పరుస్తుండేది.

ఆమె పుట్టినప్పటినుండే శాఖాహారి. మహా భక్తురాలు. నియమనిష్ఠలుగలది. అన్ని పుణ్యతిధులలో ఉపవాసములుండి దైవ బ్రాహ్మణ పూజలు సల్పేది. అన్నింటికీ మించినది ఆమె పతిభక్తి నా అనుభవంలో అంతటి మహాప్రతివ్రతను ఎరుగను. నిజంగా అలాంటి పవిత్రదేవతామూర్తిని భార్యగా పొందినందులకు మా నాన్న ధన్యుడనే నేను యిప్పటికీ మురుస్తుంటాను.

ఇప్పటికి సుమారు అయిదు సంవత్సరాల క్రిందట జరిగిన సంగతి అప్పటికి ఆమెకు యాభైఏ ళ్ళుంటాయి. యాభైఏళ్ళ వృద్ధాప్యం వచ్చినా - ఆమెలోని యవ్వనం, లావణ్యం, సౌకుమార్యం చెక్కుచెదరలేదు. నిత్యయవ్వన సుందరాంగిలా వుండేది దేవతలా.

ఉత్తరాలు రాయించి మా కుటుంబం లోని వారినందరినీ రావించింది. అందరికీ చక్కటి ఖరీదైన బట్టలు కొని యిచ్చింది. ఇనప్పెట్టెలోంచి తన విలువైన నగలన్నీ తీసి అందరికీ పంచిపెట్టింది. పిల్లలందరికీ మిఠాయి తెప్పిచ్చి పెట్టి వారితో ఆప్యాయంగా, చిన్నపిల్లలా ఆడుకుంది. వారికి ఎన్నో నీతులు బోధించింది. ఆమె ప్రవర్తన మాకు అర్థం కాలేదు.

ఆరోజు భీష్మ ఏకాదశి. పిన్నిరోజు కంటే ఆరోజు పెందరాళే లేచింది. కాలకృత్యాలన్నీ తీర్చుకుంది. బ్రాహ్మణులను, పుణ్యస్త్రీలను పిలిపించి, అంతకుముందే తాను తెప్పించియుంచిన శాలువలూ, దండలూ, చీరలూ, చెంబులూ, వెండి బంగారంతో సత్కరించింది. ఆమె చేసే ప్రతిపనికీ కారణం అడిగే సాహసం ఎవరికీ లేకపోయింది.

దానధర్మాలు అన్నీ అయాయి. పదకొండు గంటలకు అందరి భోజనాలూ అయ్యాయి ఆమె జపం చేసుకుంటున్న పూజా మందిరానికి మేమంతా వెళ్ళాము. పన్నెండు గంటలైంది. ఆమె జపం ముగించుకొని మా అందరినీ పేరు పేరునా పిలిచి దీవించింది. ఆమె కళ్ళలో నీళ్ళు నిండాయి. మా అమ్మను పిలిచి "అక్కగారూ!" అంటూ కౌగలించుకుంది. మా అమ్మ పాదాలకు నమస్కరించి — "అక్కగారూ! ఇన్నాళ్ళూ భర్తగారి బాధ్యత మన యిద్దరం వహించాము. ఇకముందు ఆ భారం మీరే వహించాలి. ఇన్నాళ్ళూ నేను ఇతరకులందాన్ననే భేదంలేకుండా సొంతచెల్లెలిలా ఆదుకొని కాపాడిన మీ ఋణాన్ని తీర్చుకోలేను. జీవితంలో ఎప్పుడైనా మిమ్మ నొప్పించి యుంటే నా అపరాధాన్ని మన్నించాలి.'' అని అమ్మ పాదాల్ని కళ్ళ కద్దుకుంది. ఆ నాటి ఆమె విచిత్ర ప్రవర్తనకు అర్థం తెలియక అమ్మ బిత్తరపోయి చూస్తోంది. తరువాత నాన్నను కుర్చీలో కూర్చుండబెట్టి, ఆయన పాదాలు వెండిపళ్ళెంలో వుంచి పాదములు కడిగి ఆ యుదకాన్ని సిరస్సుపై జల్లుకుంది. ఆయన పాదాలు తుడిచి పూలతో పూజించింది. అప్పుడే ఆమెను చూచుటకు వచ్చిన పండితులు వేదపఠనం ప్రారంభించారు. ఆమె పూలమాలను నాన్నమెడలో వేసింది.

అక్కడ చేరిన ప్రజానీకా నంతటికీ చేతులు జోడించి నమస్కరించి "ఇంత కాలమూ మీరందరూ నాయందు పుత్రికా వాత్సల్యంతో ఆదరించి నందులకు నా ధన్యవాదములు. నా పూర్వజన్మ సుకృతమువలన ఈ మహానుభావుని, సాహసోపేతుని, ఉత్తమపురుషుని, పరాక్రమవంతుని వరించి, పరిణయమాడి — వారి అపూర్వానురాగాన్ని చూరగొని తరించాను. నేటితో యీ మహాత్మునితో ఎడ

బాటు కలుగబోతోంది అనే విచార మున్నా - జన్మజన్మాలకూ ఇక్కడే నా నాధుడు కావాలని దేవుని ప్రార్థిస్తున్నా. నాకు ఉత్తమలోక ప్రాప్తికలుగనట్లుమీరు ఆశీర్వదించాలని ప్రార్థించుచున్నాను," అంది. తరువాతఏడుస్తున్ననన్ను చేరదీసి. "నాయినా! కుమారుడు లేనిలోటు నీవు తీర్చావు. మీ అందరినీ విడిచిపోవటా నికి నా మన స్సంగీకరించకపోయినా - కాలధర్మాన్ని అతిక్రమించలేము. మీ నాన్నగారు ఉత్తములు. పరోపకార పరాయణులు. ధీరోదాత్తులు రాచవంశ ములో వారికి వుండవలసిన సుగుణము లన్నీ వారియం దుండుటచేతనే - నేను వారిని కారణ జన్ములని చెబుతున్నాను. నీవు తప్పకుండా వీరి అడుగుజాడల్లో మసలుతూ ఆయనకీర్తిని యినుమండింప జేయాలి నేను నేటితో జీవితాన్ని చాలించబోతున్నాను, నా యెడబాటు మీ నాన్నగారికి దుర్భరమైనా - ఆయన ఈ వియోగాన్ని సరిగా నేటికి ఒక సంవ త్సరంవరకు అనుభవించాలి సరిగా ఇదే సమయానికి మీ నాన్నగారుకూడా జీవి తము చాలించగలరు. అంతవరకూ మీరు వారిని భక్తిశ్రద్ధలతో ఏ లోటు రాకండా కాపాడాలి. నా మరణంగురించి మీరు ఏ విధమైన విచారమూ పొందక - నా నిర్యాణం పండుగగా భావించి ఆనం దించాలని కోరుతున్నాను. నా తుది ఘడియలు భగవత్ప్రార్ధనలో గడుపుటకు అనుమతియ్యండి," అని పూజాస్థానంలో కూర్చుంది జపం ప్రారంభించింది.

అప్పటికిగాని అచ్చటివారికి ఆమె వింతచర్యలోని అంతర్యంబోధపడలేదు. అందరి హృదయాలూ విచారభారంతో క్రుంగిపోయాయి. కేవలం శివసాన్నిధ్యం కోసం నిరీక్షిస్తూన్న మూర్తీభవించిన పార్వతీదేవిలా వెలిగిపోతోంది. అప్ర యత్నంగా అంతా చేతులు జోడించి ఆమెకు అంజలిఘటించారు. బ్రాహ్మ ణులు వేదపఠనం ప్రారంభించారు. పుణ్యస్త్రీలు హరినామస్మరణ గావిస్తు న్నారు మా నాన్న అచేతనుడై యోగ సమాధిలో నున్నాడు. కొందరు పుణ్య స్త్రీలు చేతికందిన పూలతో ఆమెను పూజిస్తున్నారు. గడియారం సరిగా రంగు రంగుమని రెండుకొట్టింది. మా పిన్ని, మా యింటి మహాలక్ష్మి మా ప్రేమ స్వరూపిణి - ఆశ్రిత జనకల్ప వల్లి - క్షుధార్తుల పాలిట అన్నపూర్ణ - నేటి పతివ్రతలలో తలమానికం- మా ఇలవేల్పు సమాధినుండి భర్తపాదము లపై వ్రాలి - జీవితాన్ని చాలించింది

ఈ అపూర్వ సంఘటనకు పట్టణం లోని యావత్తు ప్రజానీకం - సంభ్ర మాత్సర్యములతోవచ్చి - ఆమెదర్శనం చేసుకొని-ఆమెకు భక్త్యాంజలి ఘటించారు ఆమెను పూలవిమానంమీద పురమంతా వూరేగించి - మంచి గంధంతోనూ, తులసి కాష్టంతోనూ దహనపరిచాం.




ఈ ఘట్టం వర్ణించేటప్పుడు సుందరావు కన్నులనుండి అశ్రుధారలు కురిశాయి. నాకు అప్రయత్నంగా కనుల నుండి వేడిభాష్పాలు రాలాయి. అలాంటి అపూర్వమైన ప్రణయగాధను - నేను ఏ గ్రంథాలలోనో చదవటంతప్ప యిలా ప్రత్యక్షంగా జరిగినట్లు విని ఎరుగను. కన్నులు రుమాలుతో తుడుచుకొని సుందరం చెప్పటం మొదలుపెట్టాడు.

"బ్రతికి వున్నంతవరకూ మమ్మల్ని ఎలా ప్రేమాదరములతో చూచిందో - జీవితానంతరంకూడా ఆమె మాకు యిల వేల్పయి - కష్టసమయాల్లో మమ్మ ఆదుకొని ఆదరిస్తోంది!"

"ఆమె పోయిన తరువాత మా కుటుంబం ఆమెలేని లోటును భరించలేక పోయింది. అప్పటినుంచి మానాన్న నిస్సహాయుడై ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. ఎప్పుడు వ్రాయించిందో కాని - మా కుటుంబంలోని ప్రతి వ్యక్తికీ - పేరు పేరునా తన ఆస్తిలో భాగం చూపించింది. తన జీవితాంతం వరకూ తనకు సపర్య చేసిన దాసదాసీజనానికి కూడా జీవనోపాధి కల్పించింది. ఆ గ్రామంలోని ఆడపిల్లలకు చదువులేని కొరతను తీర్చుటకు గాను ఒక బాలికా పాఠశాలను స్థాపించటానికి కావలసిన నిధిని ఏర్పాటు చేసింది.

ఆమె మా ఇలవేల్పు అనటానికి చాల విదర్శనాలు చూపించింది. ఒకసారి నాన్న గారికి జీవన్మరణ సమస్య కలిగినప్పుడు. అమ్మ మీద ఆవహించి – నాన్నకు ఆసమయంలో మరణం రాదనీ – సరిగా తను సూచించిన సమయంలోనే జీవితం చాలిస్తాడని చెప్పింది. ఆమెవాక్కు వేద వాక్కులా జరిగింది.

"మాయింట్లో ఏసమయంలో ఎవరికి సుస్తీ చేసినా – తలంచిన మాత్రాన – వారి మంచంవద్ద కూర్చుండి – అదృశ్యం గానే – వారి సేవచేసి – రోగవిముక్తులను చేసేది. తలంచినంతనే వచ్చి ఆదరించి పోయేది. నేటి సంఘటన దానికి నిదర్శన మని నువ్వు అంగీకరించకపోవు."

సుందరం నన్ను తనయింటి అవర ణలో దూరంగావున్న బంగళాకు తీసు కొని వెళ్ళాడు. అది సుందరమైన ఉద్యానవనంలోని ఒక దివ్యభవనం. ఆ భవనమంతా చూపించాడు. తన యిల వేల్పు కొల్చిన పూజాపీఠమూ, ఆమె వాడిన పూజా పరికరాలూ, ఆమె వస్త్ర ములూ, శయ్యాతల్పమూ, అన్నీ అతి భద్రంగా కాపాడబడుతున్నాయి.

పూలతోటకు మధ్యగా నున్నచోట, నాలుగు బొగడచెట్లు గుబురుగా పెరిగి యున్నచోట – ఎత్తైన తిన్నెపై రెండు విలువైత్తు పాలరాతి విగ్రహాలు విలుప బడి వున్నాయి. అవి రూపంలోనూ, సౌందర్యంలోనూ ఒకదానినొకటి మించి వున్నాయి. కేవలం ప్రబంధాలలోనూ, పురాణాల్లోనూ, కవులు వర్ణించే పవిత్ర ప్రణయ మూర్తులలా వున్నారు. సుందరం చెప్పినట్లు విజంగా ఏ శాప వశంచేతో దివినుండి భువికి దిగివచ్చిన దేవతల్లా, కారణజన్ములుగా తోచారు.

అప్పుడే ఉదయిస్తున్న బాలభానుని అరుణకాంతులు ఆ శ్వేతమూర్తుల ముఖ బింబములపై బడి ఓ అపూర్వ తేజ స్సును ప్రసరింపజేస్తున్నాయి. వికసిం చిన బొగడపూలు దేవతలు వెదజల్లు కుసుమ వర్షంలా ఆ విగ్రహాలమీద జల జల రాలుతున్నాయి.

ఈ యపూర్వ సుందర దృశ్యాన్ని చూడగానే నా శరీరం పులకితాంతమైనది. అనిర్వచనీయమైన ఆనందం నా హృద యాన్ని నింపింది నాకు తెలియకండానే నేను ఆదివ్యప్రేమమూర్తుల విగ్రహాల ముందు మోకరించి – వారికి జోహారు లర్పించకుండా వుండలేకపోయాను.




పది పూరిళ్లు దాటిం తర్వాత పెంకుటిల్లు! ఎట్లాటి బంగాళా పెంకు ఎండలో మహా దర్జాగా మెరిసిపోతుంది. నాలుగు మండువాలున్న అంత ఇల్లు కుగ్రామంలో ఉన్నదంటే, ఆ ఇంటి యజమాని పెద్ద ఖామందని అర్థం.

చెక్క గేటు తెరుచుకుని లోపలికి అడుగువేశాను ముందు వరండావరుకు గేటు దగ్గర్నుండీ అంతా రాయి పరిపించి ఉంది దానిమీద కందులు, మినుములు, పెసలు ఆరబోసి ఉన్నాయి. కోడిపెట్ట ఒకటి మధ్య, మధ్య అటూ

యిటూ దొంగచూపులు చూస్తు ఆత్రంగా బొక్కుతోంది కందుల్ని. గేటు తెరుచుకుని లోపలికి అడుగు బెట్టిన యీ విగ్రహాన్ని చూడటం తోటే భయంగా అరుస్తూ పారిపో యింది!

వసారాలో సగందాకా ఆక్రమించు కున్న ఉదయం ఎండలో సగంశరీరం, మిగతా సగం శరీరం నీడలో ఉండేలా పడుకున్న దొక గ్రామసింహం! నేను గేటుతెరిచిన శబ్దానికి తలెత్తి పరిశీల నగా చూసి మళ్ళీ మత్తుగా ముందు కాళ్ళమీద తలానించుకుని కళ్ళు మూసుకుంది.

చెక్కగేటు మళ్ళీ మూసి, పైనున్న కొక్కెంవేసాను. కానీ, అడుగు ముందుకు వెయ్యాలంటే బెరుకు పుడు తోంది. రెండు వేళ్ళమధ్య చొక్కా గుండీ నొక్కుతూ నిలబడ్డాను తటపటా యిస్తూ.

అంతలో చంకన చిన్నగంప - ఆ గంపనిండా పగడాల రంగులో ఉన్న ఎర్రమిర్చితో సాక్షాత్కరించిం దొక పల్లెపడుచు సర్వాంగసుందరమైన ఆకృతితో ప్రకృతి ప్రసరించిన 'పౌష్య లక్ష్మి' అందాల ఆకృతికి ప్రతిరూపమా అన్న భ్రమ కలిగిస్తున్న ఆ ఆకృతికేసి రెప్పవాల్చక చూస్తూ నిలబడి పోయాను.

గంపలోని మిర్చి నేలమీద కుప్పగా పోయబోతూ ఆగి నాకేసి అదాటున చూసి అదిరిపడి, అంతలోనే సర్దుకుంటూ "ఎవరికోసమండీ?" అంది సంగీతంలో స్వరం పలికినట్లు.

ఆ మాట సూటిగా నా హృద యాన్ని తాకింది. "నువ్వున్నావని తెలుస్తే యింకొకరికోసం వచ్చేవాడిని కానేమో!" అనుకుంటూ పైకి "అచ్యుతరామయ్యగారికోసం - బెజ వాడనుండి వచ్చాను" అన్నాను.

"ఓహో! మా తాతగారికోసమా? అలా లోపలికి వెళ్ళి కూర్చోండి వస్తారు" అంటూ పమిటె సరిజేసుకుని 'ఎర్రమిర్చి'ని గచ్చుమీద కుమ్మరించి తన సుకుమార హస్తంతో దాన్ని విస్తృతం చేసి ఆరబోసింది. నేను బల వంతాన చూపులు తిప్పుకుంటూ ఆమె చెప్పినవైపు వెళ్ళాను. చక్కని సోఫా సెట్టుతో నిండి గదంతా అద్దంలాగా శుభ్రంగా ఉంది. ఒక సోఫాలో కూర్చుని కళాత్మకంగా ఉన్న ఆ గది లోని అలంకారాలకు విస్తుబోతూ మారుమూల గ్రామంలో కూడ, యింతటి అభిరుచి గలవారున్నారా! అని తెల్లబోయాను

అయిదు నిముషాలు గడిచాయి. ఇల్లంతా గంభీర నిశ్శబ్దం! ఎక్కడో దొడ్లో ఎవరో మాట్లాడుకుంటున్న ధ్వని వినిపిస్తోంది. ఈ 'అచ్యుతరామయ్య గారు' ఆగర్భశ్రీమంతుడేకాదు, అంతు

లేని గర్వపోతనికూడా మా తాతగారు చెప్పారు! ఆయన చిన్ననాటి ఊరిదేనట. కారణాంతరాలవల్ల వలస వెళ్ళినా, బాల్యమిత్రుడు 'అచ్యుత రామయ్య'తో ఉత్తరాల ద్వారా బాంధవ్యం తెగిపోలేదనీ, ఇపుడదే ఊరికి ఉపాధ్యాయవృత్తిలో వెళ్ళబోతున్న నాకు 'అచ్యుతరామయ్య గారి' సాయం ఎంతేనా అవసరమని నొక్కిచెప్పి 'సిఫారసు' ఉత్తరం ఒకటి చేతి కిచ్చారు.

ఆ ఉత్తరాన్ని వేళ్ళమధ్య ఉంచుకుని వినోదంగా ఆడుకుంటున్నాను. కాలక్షేపంలో కాలం మరికాస్త ముందుకి జరిగింది. అంతలో "ఎవరున్నవ్వు?" అంటూ పిడుగులాంటి ధ్వని వినిపించటంతో బిత్తరపోయి చూసేను ఎదురుగా యమధర్మరాజులాంటి భారీ విగ్రహం ఉంది ఈ భయంకరాకారుడేనా మా తాత ఫ్రెండు?! అయ్యబాబోయ్...

అప్రయత్నంగా లేచి నిల్చుని "నా పేరు సత్యమూర్తి, భానుమూర్తి గారి మనుమణ్ణి ఇదుగో ఆయన ఇచ్చిన ఉత్తరం" అంటూ కంపిస్తున్న చేతుల్తో ఆయన కందించాను 'సిఫార్సు' ఉత్తరాన్ని.

ఆయన కవరు పట్టున చింపి మౌనంగా ఉత్తరం చదివి సోఫాలో కూర్చుని, నన్నుద్దేశించి "కూర్చో" అన్నాడు, మేఘంగర్జించినట్లు. 'అబ్బ! ఏమి టీయన గొంతు పృథ్వీరాజ్ గొంతులా.' అనుకుంటూ మళ్ళీ కుర్చీలో కూలబడ్డాను.

'సీలింగ్' కేసి చూస్తూ "నువ్వు ఇక్కడే ఉండొచ్చు పెరటి వైపు నున్న రెండు గదుల పెంకుటిల్లు ఆక్రమించుకో" అన్నాడు అధికార యుతంగా.

'ఇదేమిటి? చూరకప్పు చూసి మాట్లాడతాడు, మనుష్యుల కేసి చూట్టం యిష్టంలేకనా!' అనుకున్నాను మనస్సులో. పైకి "అలాగేనండీ. చాలమంచిది" అన్నాను వినమ్రంగా పెద్దలముందు వినయము చూపుము! అన్న చిన్ననాటి పార్యపుస్తకాల సూక్తికి ఆచరణలో పెడుతూ

"నీ సామాను ఏది?"—ఆ చూపులు అక్కడే, ఇంటి కప్పుమీద!

"కరణం గారింట్లో వదిలి వచ్చానండి. ఆయనే మీ యింటికి దారి చెప్పారు నా వెనుక వాళ్ళ పాలేరుతో పంపిస్తానన్నారు" అన్నారు.

"సరే వెళ్ళు. మా పాలేరు వచ్చి తలుపు తీసి కావలసినవన్నీ అమురుస్తాడు" అన్నాడు మరోవైపు చూస్తూ.

"మంచిది. వస్తానండీ" అంటూ లేచి ఆ గదిలోంచి బైటపడ్డాను. ప్రాణానికి చాలా హాయనిపించింది!

'అవుట్ హౌస్'లా ఉన్న ఆ రెండు గదుల పెంకిటిల్లూ లోపల ఎంతో సౌకర్యంగాఉంది పెద్ద నవారుమంచం ఒకటీ, దానిమీద పరుపు. రెండు దిళ్లూ, ఒక మేజాబల్ల, రెండు కుర్చీలు ఒక మట్టికూజా, గుమ్మానికీ, కిటికీలకీ చేనేత తెరలు! నా దృష్టి మళ్ళించాను. మేజా బల్లమీద ఇత్తడి పూలకుండీ, దాని కుత్తుకదాకా నీళ్లు అందులో తేలుతున్న ఎఱ్ఱ గులాబీలు అగు పించాయి. ఒక గులాబీని చేతిలోకి తీసుకుని ఆఘ్రాణించాను.

అంతలో వెనకాల చిరుపాదాల ధ్వని విన్పించి, అటు తిరిగాను. గుమ్మానికడ్డం ఉన్న తెర తొలగించు కుని సగం లోపలికి వచ్చి "అన్ని సౌకర్యాలూ అమరినట్లేనా?" అన్న దామె!

ఆమె మొహంకేసీ, ఆ విశాల నేత్రాలకేసీ చూస్తున్న నాకు "ఆఁ" అనే మాట తప్ప మరో సమాధానం నోటినుండి బైటికిరాలేదు.

"అమ్మగారూ, తప్పుకోండి" అంటూ పాలేరు నా సామాన్లు తెచ్చాడు లోపలికి. ఆమె పూర్తిగా గదిలోకి వచ్చేసింది. బెడ్డింగు, సూట్ కేసు క్రిందపెట్టి" వీటిని యిక్కడ పెడ్తే సాలా బాబూ. లోనెట్ట మంటారా?" ప్రశ్నించేడు పాలేరు.

"అలా ఉంచు ఫర్వాలేదు" అన్నాను.

"వత్తా, బాబూ" అంటూ నిష్క్రమించాడు పాలేరు.

బెడ్డింగ్, సూటుకేసు ఓ మూలగా ఉంచాను. ఆమె, నేను ఆఘ్రాణించి మేజాబల్లమీద వదిలేసిన గులాబీని చేతిలోకి తీసుకుని "మీకు పూలని ఆఘ్రాణించి వదిలెయ్యటం అల వాటా?" అంది

ఆ ప్రశ్నకి నిర్ఘాంతపోయాను! ఈమె దింత సున్నితమైన మనస్సా! పూలని పూజకే వినియోగించాలనీ లేదా అలంకారికంగా ఉంచాలనీ మీ మనస్సు కోరుతుందా?" అన్నాను ఎదురు ప్రశ్నిస్తు.

"అవును పూలని కనులపండువుగా అలంకరించి. ఆ దృశ్యాన్ని చూస్తుంటే కలిగే ఆనందం వాటిని ఆఘ్రాణించి వాటి ఆయుర్దాయం తగ్గించి వెయ్య డంలో నాకు ఉండదు" అంది

"మీరు పొరబడుతున్నారు! ఏ వస్తుసౌందర్యమైనా, స్పర్శకిమారమై ఎక్కువ కాలం మనగలదేమో గానీ - అంతిమంగా అది నశించేముందు దానికి 'మనస్సు' అనేది ఉంటే తన ఉనికి ఎవరికీ నేత్ర ఆనందంకంటే మించి సంతోషపెట్టలేక పోయిందే! అని విచారిస్తుంది."

"అంటే, యీ'గులాబీ'కి జ్ఞానం






ఉంటే తన అందంలోని ఆనందాన్ని అందరూ అనుభవించాలనీ, తన సౌరభాన్ని అందరూ జుఱ్ఱుకోవాలనీ తపిస్తుంటారు?"

"తప్పకుండా! 'అడవిగాచిన వెన్నెల'–'బూడిదలోపోసిన పన్నీరు'– అనే మాట లెందుకు వచ్చినా యంటారు? అందాన్ని అనుభవించి ఆనందించలేకపోవటం నిరర్ధకమని చెప్పటానికే! అయితే, యీ 'అనుభవించడం' అన్నదానికి వేరర్థం కల్పించి–రాక్షసప్రవృత్తిద్వారానైనాసరే అందాన్ని జుఱ్ఱుకుందామనే మూర్ఖుల మాట కాదు నేను చెప్పేది! ప్రతి దానికీ, సవ్యము, అపసవ్యము అనేవి ఉన్నాయి."

ఆమె మొహాన ఒక సంతృప్తి హాసం అగుపించింది. మందహాస్యం చేస్తూనే కనుమరుగయ్యింది. కళ్ళప్పగించి చూస్తుండిపోయాను!

* * *

"పుస్తకాలు చదివితే కడుపు నిండదు. ముందు భోజనానికి లేవండి" అన్న మాటలకి ఉలిక్కిపడ్డాను చేతిలోని పుస్తకం బల్లమీద బోర్లా ఉంచాను, చదువుతున్న కాయితం చెదిరిపోకుండా ఉండేందుకు!

ఆమె పుస్తకాన్ని పరిశీలనగా చూసింది, "ఆడవాళ్ళు - పోలవరపు శ్రీహరిరావు!" అన్న అక్షరాలు చదివి, "మీ మగవాళ్ళకి ఏదో రూపంగా ఆడవాళ్ళని దుయ్యబట్టటం కన్నా వేరే పనిలేదా?" అంది.

"బావుంది! ఆయనెవరో ఆడవాళ్ల గురించి రాస్తే అందుకు మగవాళ్లంతా బాధ్యులా?" అన్నాను అమాయకంగా మొహంపెట్టి. ఆమె ఫక్కున నవ్వింది.

"సరే, పదండి భోజనానికి! వివాదం తర్వాత, ముందు అన్నం చల్లారి పోతుంది" అంది. వెంట నడిచాను

* * *

"మీరు మరోలా అనుకోనంటే మీ పేరు తెలుసుకోవాలనుకుంటున్నాను. వచ్చిన తదాదీ ఎప్పుడూ చలాకీగా, చనువుగా అగుపిస్తున్న మిమ్మల్ని ఎలా ఆ మాట అడగాలో తెలియటంలేదు!"

"అయినా వదిలిపెట్టలేదుగా! ఎలానూ అడిగారు కాబట్టి చెప్పక పోవటం సబబుకాదు. నా పేరు 'సుజాత!' మళ్ళీ దానికి 'ఏమండీ' అనే కొమ్ములూ, 'గారూ' అనే తోక తగిలించకుండా ఉంటే సంతోషిస్తాను" అందామె.

"అంటే ఏకవచనంతో పిలవమంటారు?"

"కాదు-అంటాను!" అంది ఒత్తి పలుకుతూ. నా తప్పు గ్రహించి "మీ అభీష్టానుసారమే పిలుస్తాను సుజాత!" అన్నాను.

"మళ్ళీ . !" అంటూ కళ్ళు పెద్దవి చేసింది

"మళ్ళా ఏమైందీ?" అంటూ ఆశ్చర్యపోయి "ఓహ్ . అలవాటు... అంతే! తప్పు దిద్దుకుంటున్నాను. నీ అభీష్టానుసారం..."

ఆమె ఆపుకోలేక నవ్వేసింది

* * *

ఆ ఊళ్లో 'అచ్యుతరామయ్య'గారికి అర్ధగజం మందాన పేరు ప్రతిష్టలూ, పలుకుబడీ ఉన్నాయి! లేకపోతే ఎక్కడినుంచో పల్లెటూరిమీద అపేక్షతో, అచట ప్రశాంత జీవితం చవి చూడాలన్న ఆశతో వలసవచ్చిన మరో పరాయివ్యక్తి అయితే, అతని అవస్థలు వర్ణింప శక్యంకావు.

ముందు ఆ వ్యక్తి 'అచ్యుత రామయ్య'గారి 'ఇంటర్వ్యూ' లో పాల్గొనాలి. ఆయన ఆ గ్రామ పంచాయితీ ప్రెసిడెంటయ్యే! ఆ'ఇంటర్వ్యూ' పుణ్యమా అంటూ 'భూలోకంలో యమలోకాన్ని' కాకపోయినా, 'యముణ్ణి' చూడగలడు.

అటు తర్వాత ఊరిపెద్దల మంచిని సంపాయించడం! వాళ్ళ పిల్లల్ని సక్రమంగా బడికి పంపించే ఏర్పాట్లు చేయటం, ఆ పిల్లకోతుల్ని లొంగదీయటం- ఈ తతంగంలో మునిగి ఉక్కిరిబిక్కిరి కాక తప్పదు!

"భానుమూర్తిగారి మనవట్ట! బడి పంతులుగా వచ్చేడు" అంటూ తాత నెరుగున్నవాళ్లు నాగురించి మా తాత నెరుగున్న మరికొందరికి తెలియ జెప్పేవారు.

వాళ్ళు "అలాగా! ఆయన బాగా బ్రతికినవాడేనే! ఒక వేళ చితికిపోయా డేమో! చాలకాలం క్రితమే ఊరు వదలి వెళ్ళాడయ్యే-ఆ కబుర్లేం తెలి యవు." అని-నాతో "ఏం నాయనా? మీ తాతగారు కులాసానా? ఇపుడెక్క డుంటున్నారు? మమ్మల్నందర్నీ మర్చిపోయేడా? మళ్ళీ చుట్టంచూపుగా నన్నా రాకుండా నిన్ను పంపేడా? అవున్లే-మేమెందుకు జ్ఞాపకం ఉంటాం! 'అచ్యుత రామయ్య' గారికీ, మీ తాతకీ 'కంచం, మంచం' ఒక్కటే నయ్యో!" అనేవాళ్లు.

వాళ్ళ దృష్టిలో బడిపంతులంటే, బతకలేక 'వృత్తి' చేపట్టిన వాడని! అందుకే మా తాతగారి ఐశ్వర్యమంతా తుడుచుకు పోయిందన్న ఆలోచన వచ్చిందా బుఱ్ఱల్లోకి!

అటువంటిదేమీ కాదనీ మా 'ఐశ్వ ర్యం' మరికాస్త అభివృద్ధి అయిందనీ నేను ఆదర్శంకోసం 'బడిపంతులు'గా ఆ ఊళ్ళో అడుగుపెట్టేననీ అంటే నమ్మేవా డుండడు.' కాబట్టి, వాళ్ళని వాళ్లవాళ్ల అభిప్రాయాలకి వదిలాను.

స్కూలు నిమిత్తం పెద్ద పాక వేయించారు. అందులో నాకు ఒక కుర్చీ, బల్ల ఏర్పరచారు. పిల్లలంతా చాపలు పరచి కూర్చునేవారు. ఆ విశాలమైన హాలులో అన్ని తరగతుల వారూ కలిసి కూర్చునేవారు. చదువు కోసం పొరుగూరు స్కూలుకి నడిచి వెళ్ళే పిల్లలు నెమ్మదిగా నా స్కూలు లోకి రావటం ప్రారంభించారు.

త్వరలోనే స్కూలు కళ, కళ లాడసాగింది.

"మాస్టారూ! నాక్కూడ చదువు చెప్పరూ?" అంటూ ఓ రోజున నా గదిలో కొచ్చింది 'సుజాత'. ఆమె చేతిలో కొత్తపలక, బలపం, పుస్తకం ఉన్నాయి.

నాకు పట్టరాని నవ్వు వచ్చింది. నవ్వేసాను! ఆమె మొహం చిన్న బుచ్చుకుంది. "నువ్వు యిపుడు చదువు కుంటావా సుజాతా?" అన్నాను హేళనగా. మామధ్య చనువు అప్పటికే దిన, దిన ప్రవర్థమానమైంది!

"ఏం చదువుకోకూడదా?" అంది బుంగమూతిపెట్టి.

"సలక్షణంగా! కానీ..."

"కానీ?" రెట్టించింది.

"నీ అల్లరికి స్వస్తి చెప్పాలి!"

"అక్కడికి నా అల్లరిని మీరు భరించలేకపోతున్నట్లు!"

"నేనేమిటి? ఊరంతటికీ 'పులి'గా ప్రసిద్ధిగాంచిన మీ తాతే భరించలేక

పోతున్నాడు! ఆయనకి నీతో మాట్లాడు తుంటే తాను మానవుడినన్న విషయం జ్ఞాపకం వస్తుంది!

"మనలో మనమాట! ఆయన కేం మంత్రం వేశావ్? నీ ముందు అలా, లోబడిన అడవి జంతువులా మెత్తగా ఉంటాడేం?" అన్నాను రహస్యం అడుగుతున్నట్లు.

ఆమె కోపం అభినయిస్తూ "ఏమండోయ్ మాస్టారూ! మా ఊరి నీళ్ళు బాగా వంటబట్టినా యనుకుంటానే! మా తాతయ్యంటే ఏమనుకున్నారు? బెబ్బులి! ఆ బెబ్బులికి నేనొక్కతినే ముద్దుల మనవరాల్ని. ఆయనకీ వృద్ధాప్యంలో అండగా నిలచిన వ్యక్తినీ నేనే! కొడుకులూ, కూతుళ్ళూ చుట్టం చూపుగామాత్రం వస్తుంటారు మా బామ్మ పోయి చాలకాలమైంది అప్పట్నుంచీ నన్ను పెంచారు. అందుకే అంత ఆపేక్ష! అంతేగాని నేనేమీ మంత్రాలు తంత్రాలు వేసి లోబరచు కోలేదు. అలాంటివి మీలాంటి మగవాళ్ళకే చేతవును!" అని గభాలున నాలుక కొరుక్కుని ఇంట్లోకి పారిపోయింది.

'మల్లెచెండు'తో హృదయాన్ని కొట్టినట్లయింది! 'దీని భావమేమి తిరుమలేశ!' ఈ 'అమ్మడు' నన్ను మంత్రగాడనేస్తుం దేమిటీ కర్మ! నే నేం మంత్ర వేశాను చెప్మా!

హా...హతవిధీ! ఇదుగో ఆవిడ హృదయం...ఇందాకట్నుంచీ హృదయంలో యీ బరు వేమిటా అని ఆశ్చర్యపోతున్నాను! ఆ పరిగెత్తడంలో తన హృదయం నా దగ్గర వదిలేసినట్లు తెలియదా అమాయకురాలికి పాపం!

* * *

"నువ్వు వెంటనే మూటా, ముల్లె సర్దుకుని రైలెక్కాలి!"

ఉరుములేని యీ పిడుగేమిటా- అని ఆశ్చర్యపోయాను. 'అచ్యుత రామయ్య'గారి మొహం మామూలు కన్నా భయంకరంగా ఉంది! అంటే ఆయన తీవ్రకోపంలో ఉన్నట్లు!

"ఇంత అర్ధాంతరంగా..."

"కారణాలు తెలుసుకోవటానికి ప్రయత్నించకు. నా మాటంటే మాటే!" మరో పిడుగు పడింది ఇంకా సంభాషణ పొడిగించటానికి మనస్కరించలేదు.

"సరే, అలాగే" అంటూ నా గదికి ఒచ్చేసాను

అక్కడ 'సుజాత' కన్నీటితోనిలబడిఉంది తెల్లబోయాను, "ఇదేమిటి సుజా! ఎందుకీ కన్నీరు?" అన్నాను

"జరిగిన దానికి కారణం నేను కాబట్టి! ఇటువంటి పరిస్థితుల్లో అధైర్యం పనికిరాదు 'ధైర్యేసాహసే లక్ష్మీ' అన్నారు. నిన్న మా తాతయ్యా నా వివాహ ప్రసక్తి తెచ్చాడు. ఆయన ముందు నాకు భయంలేదు కాబట్టి,

'మాష్టారికి అభ్యంతరంలేని పక్షంలో ఆయన్ని చేసుకుంటా' నన్నానని చాలా చదివాడు! ఇంతకూ నేను ఆయన కళ్ళెదురుకుండా ఉండాలని కోరిక ఆ వచ్చే అల్లుడు 'ఇల్లరికం' వాడు కావాలి – అని వాంఛితం! ఇవన్నీ జరుగుతాయా?! ఆయనపిచ్చి!"

"సుజాత! ఇన్నాళ్ళూ గుంభనగా ఇలా ఉండగలిగావ్? ఏదో చనువుగా ఉన్నావనుకున్నాను – మధ్య, మధ్య నీ ప్రవర్తన అలాంటి అనుమానం రేకెత్తించినా నిర్ధారణ చేసుకోలేక పోయాను. ఈ సామాన్యుడిలో నీకు నచ్చిన దేమిటి సుజా?" అన్నాను హృదయం నిండగా.

"అవన్నీ ఆడపిల్లల్ని అడక్కూడదు మాస్టారూ! పదండి. తాతయ్యముందు మనిద్దరం ఒక చిన్న నాటకం ఆడాలి ఇంతకూ దాన్ని రసాభాసం కాకుండా కాపాడండి!" అంటూ చెవిలో గుస గుస లాడింది.

"అమ్మదొంగా! సామాన్యురాలివి కాదు..." అంటూ చెవి పట్టుకోబో యాను. తుఱ్ఱున పారిపోయింది. 'సుజాత' చెప్పిన ఉపాయానికి నవ్వు వచ్చింది ఎంత సాహసురాలు కాక పోతే అంత ప్రమాదకరమైన సలహా నా కిస్తుంది! అని ఆశ్చర్యపోయాను.

మళ్ళీ అంతలోనే నాకు నేను ధైర్యం చెప్పుకున్నాను. "ధైర్యే సాహసే లక్ష్మీ" అనుకుంటూ 'అచ్యుతరామ య్య'గారి గదికేసి నడిచాను.

* * *

"సుజాతా!" అచ్యుతరామయ్య గారి గొంతు అవధులు దాటిన కోపంతో మరింత కఠోరంగా, భీకరంగా ఉంది. అయనముందు నేరస్థునిలా నిల్చు న్నాను. 'సుజాత' వచ్చే దిక్కుకేసి ఆసక్తితో చూస్తూ

బిక్కు బిక్కుమంటూ బిక్క మొహంతో వచ్చింది 'సుజాత' అడగ దల్చిన నాలుగు మాటలూ మొహాన ఫెళ ఫెళ అడిగేసి "ఇతను చెప్పేదంతా నిజమేనా?" అన్నారు.

"అవును" అన్నట్లు తలూపింది 'సుజాత' నేలచూపులు చూస్తూ ఆయనఓడిపోయినమొహంపెట్టి "సరే– చిన్నవాళ్ళు ఏదో తెలియక తప్పు చేసారు. నెలలునిండి యీ గుట్టు రట్ట యితే నా పరువు గంగపాలయ్యేది! తెలివిగా ముందే చెప్పారు. 'భాను మూర్తి' మనవ డ్నని పించావోయ్ మొత్తానికి! వాడు ముందు ప్లాను తోనే పంపా డనుకుంటాను. సరే, యిహ వెళ్ళండి. కళ్యాణ ముహూ ర్తం పెట్టించటానికి రమ్మని రాస్తాను మీ తాతకి" అన్నారు. నా హృదయం సంతోషంతో పరవళ్ళు తొక్కింది.

'ఆయన' నింగికేసి చూట్టం ఆ దెబ్బతో మటుకు మానేసాడు!

# గిరిజా కళ్యాణం

## రావూరి భరద్వాజ

దక్షాధ్వర ధ్వంసం జయప్రదంగా జరిగిపోయింది. ప్రమధులు ఆనందంతో తాండవం చేశారు శంకరుడు, తనలో క్రోదాగ్ని జ్వాలలు చల్లారినా, ఇంకా పొగలూ, సెగలూ విరజిమ్ముతూనే ఉన్నాడు.

ఇప్పటిగ్గానీ దేవతాకోటి నిజస్వరూపాన్ని శంకరుడు అవగాహన చేసుకోలేదు ఇంతకాలంగా తను భ్రమాజనిత జగత్తులోనే జీవిస్తూ వచ్చాడు. 'కాదు కూడ'దని తనఅంతరాత్మ ఘోషిస్తున్నా వినిపించుకోలేదు. దాన్ని చిచ్చికొట్టి నిద్రపుచ్చాడు ఏవో ప్రయోజనాలనాసించి – ముఖ్యంగా తన జాతివారి సంక్షేమం కోసమనే, తను విష్ణుమూర్తి పరిపాలనా మండలిలో చేరాడు. తనకిష్టంలేని అనేక కారణాలను, సమష్టి బాధ్యత పేరుతో చేశాడు. దురదృష్ట వశాత్తూ, తనవారినేతనునిర్మూలించాడు.

అనేక సందర్భాలలో, తను చేస్తున్నది న్యాయమూ, ధర్మమూ కాదేమోనన్న అనుమానం శంకరునికి కలిగిన మాట నిజమే! అయినా అతగాడు వాటి నన్నింటినీ, బలవంతాన ప్రక్కకు త్రోసివేశాడు.

ఎందుకుచేశా డిదంతా?

ఏదో విధంగా, తనవారి కింత సాయ పడదామని! ఒక రిద్దరికి, తన చర్యల వల్ల అపకారం జరిగితే జరగవచ్చుగాక! బహు సంఖ్యాకులు ఇందువల్ల లాభ పడతారు. లాభపడతారన్న ఆశే లేక పోతే, తనీ స్వజాతి విధ్వంసనానికి ఆయత్త పడకనేపోను.

ఏది ఏమైతే నేం గానీ, తను అనుకొన్నది వేరు, జరిగింది వేరు. తను కలలుగన్న వేవీ సాధించలేకపోవడమే కాదు; తన వారిని తనే చేతులారా నాశనం చేశాడు. అధిక సంఖ్యాకులకు

లాభం కలగడంమాట లేదుగదా - ప్రాణాలకు ప్రాణాలిచ్చే సంగీతకులను తను కోలుపోయాడు. దేవతాకోటి, తనను అక్షరాలా మోసగించింది. తను కూడా మోసపోయాడు. పైగా - తీరని అవమానాన్ని తను పొందవలసి వచ్చింది. ఇదంతా ముందుగా అనుకొని చేసిన కార్యమే ననడంలో సందేహం లేదు. దక్షప్రజాపతి; ఎన్ని గుండెలతో తనను ఆహ్వానించకపోవాలి మరి?

శంకరుడొక్కసారి తేరిపార చూశాడు. ప్రమథులు. ఇంకా కసితీరక, కనిపించిన ప్రత్యర్థి నల్లాపట్టుకొని చావ మోదుతున్నారు. మహోగ్రతాపంతో జ్వలించిపోతూనే ఉన్నారు.

అందరినీ ఒక్కసారి తేరిపారచూసి, తలవొంచుకొన్నాడు శంకరుడు. ఆయన కన్నుల్లో సన్నని నీటిపొరలు, ఉరలి, పొరలి, చెక్కిళుల మీదుగా స్రవించ సాగాయి.

* * *

ఓ క్షణం చెవులు రిక్కరించి విని, లక్ష్మీదేవిని, భవనాంతర్భాగానికి వెళ్ళవలసిందిగా ఆదేశించాడు విష్ణుమూర్తి.

అమ్మవారు వెళ్ళిపోయారు.

మహతిని, అలవోకగా మీటుకొంటూ నారదమహర్షులవారు విచ్చేశారు. మహర్షి అల్లంతదూరంలో ఉండగానే విష్ణువు ఎదురుగా వెళ్ళాడు. సగౌరవంగా తోడుతెచ్చి, తన ప్రక్కనే కూచుండబెట్టుకొన్నాడు. సాభిప్రాయంగా మహర్షివైపు చూచాడు.

"స్వామీ! మీ వంటివారి ఏలుబడిలో సమస్తలోకాలూ, సుఖసంతోషాలతో పింపెసలారుతూ ఉంటాయని ఆశించడం సహజం." అన్నాడు నారదుడు.

"ఇప్పుడేమయింది మహర్షీ" అన్నాడు విష్ణువు

"దేవా! ఇవన్నీ మీకు తెలియని విషయాలుకావు. దేవతాకోటి తనను మోసగించిందని శంకరుడు గ్రహించాడు. తనవ్రేలితో తనకన్నులే పొడుచుకొన్నాననికూడా, ఆయనకు అవగాహనమయిపోయింది. తనబలాన్ని పెంపుచేసికోనడం కోసం. ఇప్పుడతను హిమాలయపరవత ప్రాంతాలలో పర్యటిస్తున్నాడు. తమ ప్రభుత్వ వాసన ఏ కోశానా అంటని ప్రాంతాలవి. అక్కడివారితో మంతనాలు జరుపుతున్నాడు. పార్వతేయులు, సామాన్యులుకారు, అసామాన్యులు, విలువిద్యలోనూ, వ్యూహ్యచరుతలోనూవారుఅందెవేసినచేతులు. గిరివాసులు కావడంతో, వారి శరీరాలు లోహనిర్మితాలేమో నన్నంత దృఢంగా మారిపోయాయి. వారందరూ, నేడో రేపో శంకరుని బలగంలో చేరనున్నారు. ప్రమథగణం, పార్వతేయులకు, రకరకాల ఆశలనూ చూపుతున్నది. ఆశకు లొంగని ప్రాణి ఏది ప్రభూ! గిరివాసులు తిరుగుచోటు జరిపిన పక్షాన - విజయ

లక్ష్మి మనపక్షం వహిస్తుందని విశ్వసించ డంలో వివేకంలేదు. ఆలోచించండి! చేతులుకాలిన తర్వాతగానీ, మనవారు ఆకులు ముట్టరు. అంతవరకూ రాక ముందే, తగుచర్య లేవో తీసుకోవడం ప్రభువులధర్మం, ఆపైన మీ చిత్తం," అని ముగించాడు నారదుడు.

విష్ణువు ప్రశాంతంగా విన్నాడు. పార్వతేయులు – తిరుగుబాటు వంటి మాటలు వింటున్నప్పుడు, ఆయనగారి కన్నులు కెంపుల్లా అరుణిమను వెలార్చాయి. అయినా పొంగలేదు. పెదవి కదలపలేదు. నిశ్శబ్దంగా విని, సన్నగా నిట్టూర్చాడు.

"హిమవంతు దేమంటున్నాడు?" అన్నాడు విష్ణువు.

"ఏమీ అనడంలేదు. బహుశా అనడు కూడా నేమో! శంకరుని ప్రచారం అతని కింకా తెలియదనుకోవడం ఆత్మ వంచనే అవుతుంది. తెలిసికూడా అతను మౌనంగా ఉంటున్నా డంటే, శంకరుని చర్యను పరోక్షంగా ఆమోదిస్తునా డన్న మాట! కాదంటారా?" అన్నాడు నారదుడు.

విష్ణువు ఓ లిప్తకాలం ఆలోచించి, కనుబొమలు ముడిచాడు.

"హిమవంతునికి, మనపై కార్పణ్యం ఉండవలసిన కారణ మేమీ లేదే!" అన్నాడు విష్ణువు.

నారదుడు ఫక్కుమని నవ్వాడు.

"దేవా! మీరు తెలియకనే అడుగుతున్నారో, నన్ను పరీక్షిస్తున్నారో బోధపడడంలేదు. హిమవంతునికి మనపట్ల ద్వేషం ఉండడం నా కేమీ ఆశ్చర్యకరంగాలేదు...అదే–మనవి చేస్తున్నాను. పనిగట్టుకొని, మహాపర్వతాల పక్షాలన్నీ ధ్వంసంచేసిన దేవేంద్రుడు, ఇప్పటికీ మనపక్షాన ఉన్నాడు. చిన్నదానికీ పొన్న



దానికీ. మనం అతన్ని పెద్దచేసి ఆరాధి స్తున్నాం. అతను చేస్తున్న ఛప్పనారు దోషాలనుమనం సమర్థిస్తున్నాం. అతన్ని మనవా డంటున్నాం. మన ప్రతినిధి అంటున్నాం. అతనికి ఉన్నతోన్నత మైన పదవిని సమర్పించుకొన్నాం. అవును గదా!"

విష్ణువు తలపంకించాడు.

"తన శత్రువుకు మిత్రుడైనవాడు తనకూ శత్రువువే నన్న సూత్రాన్ని మనం విస్మరించకూడదు భూమండలం మీది సమస్త పర్వతరాజ్యాలకూ, దేవేం ద్రుడు, శత్రువు అతను మనకు మిత్రుడే కాదు, మనపరిపాలనా వ్యవస్థలో అతి ముఖ్యమైన పదవిలో ఉన్నవారుకూడా. అతనిమీద పర్వతరాజన్యులకుగల క్రోధ ద్వేషాలలో మనంకూడా పాలుపంచు కోక తప్పదు." అన్నాడు నారదుడు, ఆవేశంతో.

"అవు." నన్నట్లుగా తలపంకించాడు విష్ణువు.

"శంకరుడు మననుండి పూర్తిగా దూరమయ్యాడు. మనలన సర్వనాశనం చేయడంకోసం, బలగాన్ని సంతరించు కొంటున్నాడు. అతనికి సాయపడడం ద్వారా, దేవతలను వోడించ వచ్చునని హిమవంతుడు భావించడంతో తప్పులేదు తనశత్రువుకు శత్రువు, తనకుమిత్రు డవుతాడన్నపాటి లోకజ్ఞానం హిమ వంతునికి ఉండదా? అందుకే ఆయన తెలిసీ తెలియనట్లు ఊరుకొంటున్నాడు. కార్చిచ్చు అంతటా అల్లుకోకముందే మేలుకోవడం అవసరం...మీ కివన్నీ తెలియనివి కాదుగానీ, నాకు తెలిసిన వేవో మీకు చెప్పడం నా ధర్మం గనుక చెబు తున్నాను. మరి నాకు సెలవు దయచే యించండి." అంటూనే నారదుడు వెళ్ళి పోయాడు.

కొన్ని క్షణాలపాటు విష్ణుమూర్తి నిశ్చేతనునిలా ఉండిపోయాడు. చివ రికి దీర్ఘంగా నిట్టూర్చాడు-

* * *

దక్షప్రజాపతి, శంకరునికి చేసిన అవ మానమూ, అందుకు ప్రతిగా శంకరుడు చేసిన విధ్వంసనమూ, చాలా ఆలస్య ముగా తారకాసురునకు తెలిశాయి. వేగులు తెచ్చిన ఆ వార్తలు వింటూనే తారకుడు, ఆగ్రహోదగ్రు డయ్యాడు తనవారి నందరినీ సమావేశపరిచి, కర్త వ్యాన్ని నిర్దేశించాడు తారకుడు.

"మహాయోధులారా!" అంటూ ప్రారంభించాడు తారకుడు "ఇంత కాల ముగా మనం నిద్రాణంగా ఉండిపోయ్యాం! మన కిష్టం లేకపోయినా నాయకత్వ మిచ్చిన ఆదేశాలను శిరసావహించాం. ఇప్పుడా నాయకుడే పరాభవింపబడ్డాడు. పదవీచ్యుతు డయాడు చిరకాలంగా మనం, అన్యాయాలనూ, అధర్మాలనూ సహిస్తూవచ్చాం సమిష్టిసంక్షేమంపేరిట, వ్యక్తులు ధ్వంసమయిపోవడాన్ని



ఆమోదించాం. ఇప్పుడిక అడ్డేమీలేదు. మనపతనానికి కారణభూతులైనవా రెవరో మీకు తెలుసు దయాదాక్షిణ్యాలు విస ర్జించండి. శత్రువులను, వెదకి వెదకి నాశనం చేయండి! వారి నగరాలను కొల్లగొట్టండి స్త్రీలను చెరబట్టండి. రుధి రప్రవంతులతో ముల్లోకాలనూ తప్తం చేయండి మహావీరులై, తిరిగివచ్చే మీ కోసం, అపూర్వమైన బహుమతు లెన్నిం టినో సిద్ధంచేసి స్తాను వెళ్ళండి! ప్రళయ కాల ప్రభంజనులై విలయతాండవం చేయండి!" అంటూ ప్రోత్సహించాడు తారకుడు.

చిరకాలంగా యుద్ధం యుద్ధమంటూ కలవరిస్తున్న రాక్షస సేనావాహినులు, భూనభోంతరాళాలు క్రక్కదలి పోయే లాగా నలుదిక్కులకూ విస్తరించాయి. ఆ దావానలాన్ని చల్లార్చే నాధు డెవ్వడూ కనిపించలేదు

తారకాసుర విజృంభణంతో, దేవ లోకమంతా అల్లకల్లోల మయిపోయింది దేవతా స్త్రీలలో అసంఖ్యాకులు, రాక్షస

బలగానికి బందీలుకాగా, మిగిలినవారు, మారుమూల ప్రదేశాలకు పారిపోయారు. పేరజీవితమంతా కల్లోలిత మయిపో యింది. దేవేంద్రుడు దిక్కుతోచక బెంబే లెత్తిపోయాడు.

అతను సరాసరిగా విష్ణుమూర్తిని దర్శించాడు. ఉన్నదున్నట్లుగా అతనికి నివేదించాడు.

"దేవా! దేవతాసైన్యాలు తారకుని బలగంముందు నిలువలేక పోతున్నారు. మన సైన్యంలోని అధిక సంఖ్యాకులను మనం కోలుపోయాం. మన శస్త్రాస్త్రా లేవీ వారిమీద పనిచేయడంలేదు. కర్తవ్య నిర్దేశంకోసం, తమ సన్నిధానాని కొచ్చాను," అన్నాడు ఇంద్రుడు.

"ఒక పదవిని మీకిచ్చాను దాన్ని నిర్వహించవలసిన బాధ్యత మీ మీద ఉన్నది మీరా పని చేయలేకపోతున్నా రంటే-ఆ పదవికి కావలసిన అర్హతలేవో మీలో లోపించాయన్నమాట ఇంత వరకూ మీరు, రాక్షస బలగమని అంటు న్నారేగానీ, అందులో పార్వతేయులు కూడా ఉన్నట్లు చెప్పలేదు గిరి పరిసరా లలో కూడా సమరాగ్నిచ్చటలు చెలరేగి నట్లు మీ రనలేదు అంటే- ఆ విషయం మీకు తెలియదన్నమాట! కనీసం, తెలుసు కొందామన్న ప్రయత్నంకూడా మీరు చేయలేదన్న మాట! అన్ని బాధ్యతలూ, నేనే వహించి, అన్ని కార్యక్రమాలూ, నేనే చూసుకొనే పక్షాన - మీరందరూ అనవసరమే! అయినా నేనలా అన దలుచుకోలేదు. అడిగారు గనుక చెబు తున్నాను... తారకాసురుని పరాభూతం చేయాలంటే; మహావీరుడు కావాలి. ఆ మహావీరుడు, వారినుండే రావలసి ఉంటుంది" అన్నాడు విష్ణువు.

ఇంద్రుడు నివ్వెరపోయాడు

"అదంతే!" అన్నాడు విష్ణువు.

"క్షమించండి! నేను అవగాహన చేసికొనలేక పోయాను." అన్నాడు ఇంద్రుడు నీళ్ళు నములుతూ.

కోపం రావడానికి బదులుగా నవ్వొ చ్చింది విష్ణుమూర్తికి.

"ఇంద్రా! శివశక్తులు, ఇప్పు డంతటా చెలరేగాయి. కలకాలంగా, అణగి మణగి పడిఉన్న దళిత జాతు లన్నీ, ఇప్పుడు శివునిపక్షం వహించాయి వారందరూ ఏకమైతే, మీరూ, నేనూ, మన ప్రభుత్వమూ నిలబడలేదు ముందుగా వారి బలగాన్ని శక్తిహీనం చేయాలి. శక్తితో కానిపనిని యుక్తితో సాధించడమే, రాజ్య పరిపాలనలోని ముఖ్యాంశం శంకరుని బలగం ఛిన్నా భిన్నం కావాలి. అందుకేమిటిమార్గం?" అన్నాడు విష్ణువు.

"చిత్తం. వింటున్నాను. ఆదే శించండి!" అన్నాడు ఇంద్రుడు, ఏమంటే, ఏం కొంప మునుగుతుందో నని!

విష్ణువు చెప్ప నారంభించాడు.

"పార్వతేయుల బలగం అమేయమైనది; అనన్యమైనది. వారు, శంకరునికి దూరంకావాలి. అలా కావాలంటే, పర్వత రాజుల కోర్కెలను కొన్నింటినైనా మనం అంగీకరించక తప్పదు. పర్వత రాజ్యాలన్నీ ఈనాడు మనకు వ్యతిరేకమే గదా! వారి నందరినీ పేరు పేరు వరుసనా పిలిచి సంప్రదించే వ్యవధి మనకులేదు. హిమవంతునిది సువిశాలమైన సామ్రాజ్యం. సమస్త పర్వత రాజ్యాల ప్రతినిధిగా అతన్ని మనం గుర్తించుతున్నాం," అన్నాడు విష్ణువు.

"బావుంది ప్రభూ! కానీ హిమవంతుడు ఇందుకు అంగీకరిస్తాడో లేదో మనం తెలుసుకోవడం అవసరం!" అన్నాడు దేవేంద్రుడు.

"పిచ్చివాడా!" అంటూ ఫకాలుమని నవ్వేశాడు విష్ణువు. "పదవీ వ్యామోహితుడు చేయని అన్యాయమూ, అధర్మమూ లేనేలేవు. తన పెద్దరికాన్నీ, రాచరికాన్నీ నిలుపుకోవడం కోసం, హిమవంతుడు ఏమి చేయమన్నా చేస్తాడు. శంకరుని పక్షం నుండి వైదొలగడమే కాదు; అతన్ని పూర్తిగా తొలగించివేయమన్నా సిద్ధపడతాడు. కానీ మన మాపని చెప్పబోవడం లేదు. ఇదంతా మోసమన్న స్పృహ, హిమవంతునికి ఏపాటి కలిగినా, మన ప్రయత్నమంతా ప్రయోజనారహితమై పోయింది,"

దేవేంద్రునికి దిక్కుతోచలేదు. ఏమీ అనలేక గుక్కిళ్ళు పడ్డాడు.

శంకరుని బలశౌర్యాలను మనమూ, అభినందిస్తాం. అట్టడుగున పడివున్న వారి సముద్ధరణకు శంకరుని నాయకత్వమే సరైనదంటాం అటువంటివాని తోటి బాంధవ్యం. ఎవరికైనా గర్వకారణమంటాం. తప్పేమిలేదే!"

"బాంధవ్యమా!" అంటూ విస్తుబోయాడు ఇంద్రుడు

"అవును దేవేంద్రా! బాంధవ్యమే! శంకరుడు కళత్రహీనుడన్న విషయాన్ని మనం విస్మరించకూడదు. హిమవంతుని కౌక ఆడబిడ్డ ఉన్న విషయాన్నికూడా మనం మరిచిపోకూడదు. శంకరుని మించిన అల్లుడు, హిమవంతునికి దొరకడం అసంభవం!" అన్నాడు విష్ణువు.

"చరిత్ర పునరావృతం అవుతున్నదేమో ప్రభూ!" అన్నాడు ఇంద్రుడు.

అతగాడు, 'సతి' విషయాన్ని దృష్టిలో ఉంచుకొని, ఆ మాటలన్నట్లు విష్ణువు గ్రహించాడు. చిరునవ్వు నవ్వాడు.

"పునరావృతం అవడంలేదు. కాకూడదనే నా అభిప్రాయంకూడా. హిమవంతుడూ, శంకరుడూ, ఒకే వర్గానికి చెందినవారు. 'సతి' విషయం అలాకాదు. ఇక్కడ వర్గభేదమూ, వర్ణభేదమూ కూడా ఉన్నది. చరిత్ర పునరావృతం కావడమన్న ప్రసక్తేలేదే! దీన్నెలా

చేస్తావో నాకు తెలియదు. కావలసిన కార్యం మాత్రం ఇదీ!" అన్నాడు విష్ణువు.

ఆయన లేచి నిలుచున్నాడు.

అంటే 'ఇక వెళ్ళవచ్చు'నని అర్ధమన్నమాట!

అసాధ్యమైన ఈ కార్యాన్ని ఎలా సునాయాసం చేయాలో దేవేంద్రునికి బోధపడలేదు ఆదేశాలయితే అందుకొన్నాడు, కానీ వాటిని ఆచరణలో ఉంచట మెలా?

మొన్న మొన్నటివరకూ, తాను పర్వత రాజ్యాలమీద దాడిచేశాడు. వందలాది పర్వతరాజులను పరాభూతులను చేశాడు. వారందరికీ తనమీద క్రోధ ద్వేషాదు లున్నాయి అందరూ ఏకమై, ఇప్పుడు తనమీదకు రాబోతున్నారు. ఈ దశలో తాను వారితో నెయ్యం జరపాలి. అలా కాని పక్షాన పదవిని వదులుకోవాలి. పదవీ పరిత్యాగంతో, తనకున్న సుఖ సంపదలుకూడా దూరమయి పోతాయి. ఎంతోకాలంగా త నీవిలాస జీవితానికి అలవాటు పడిపోయాడు, వీటిని వొదులుకోలేడు. ఉండి అనుభవించాలంటే, తన కిష్టంలేని ఎన్నో కార్యాలను. చేయవలసి వస్తున్నది! ఏమిటి మార్గం?

ముందుగా వేగులను పంపించి, శంకరుని చర్యలను తెలుసుకొన్నాడు దేవేంద్రుడు. హిమాలయ రాజ్యాంతర్భాగంలో ఉన్నాడట శంకరుడు. అక్కడి కెవ్వరినీ ప్రవేశించనీయడం లేదట. హిమంతునికికూడా శంకరుని దర్శనం దుర్లభంగా ఉన్నదట. అతనికి ఎటువంటి ఆపదా రాకుండా, పార్వతేయులు కట్టుదిట్టమైన రక్షణ చర్యలను తీసుకొన్నారట!

ఈ సమాచారాన్ని అందించి, బహుమానా లందుకొని, వేగులు వెళ్ళిపోయారు.

వారు వెళ్ళిన చాలా సేపటిదాకా దేవేంద్రుడు ఆలోచిస్తూనే ఉన్నాడు ఆలోచనాభారంతో, అతనికి శిరోవేదన గూడా ప్రారంభమయింది అయితేనేం గానీ, చివరికొక పరిష్కార మార్గాన్ని కనుగొన్నాడు.

"అమ్మయ్య!" అనుకొన్నాడు దేవేంద్రుడు.

క్రింది పెదవిని సుతారంగా, ముని పంట నొక్కుతూ తనలో తనే నవ్వుకున్నాడు.

ఎదురుగాఉన్న రంభ 'ఇదేమి' అని అననూలేదు, ఇంద్రుడు చెప్పనూలేదు.

ఉత్సాహంకొద్దీ, రంభ చెక్కిళులను పుణికి, కప్పురపు విడెమైనా అందుకోకుండా, విసవిసా ఎటో వెళ్ళిపోయాడు దేవేంద్రుడు.

* * *

నారదుని చూస్తూనే హిమవంతుడు పీఠందిగివచ్చాడు. అర్ఘ్యపాద్యాదులిచ్చి




అల్లంతదూరంలో, రత్నకంబళంమీద కూచున్నా డాయన.

కుశలప్రశ్నాదు లయ్యాక, నారదుడే అసలువిషయాన్ని కదిపాడు.

"పర్వతరాజా ! హితుడవు, స్నేహితుడవు నన్న అభిప్రాయంతో, ఒక రహస్యం నీకు ముందుగా తెలియజేస్తున్నాను. తగు సమయం వచ్చిందాకా, ఈ రహస్యాన్ని రహస్యంగానే ఉంచు," అన్నాడు నారదుడు.

హిమవంతుడు రత్నకంబళంమీద, అటూ ఇటూ కొద్దిగా మసిలాడు.

"కొంత కాలంగా మీ పర్వతరాజులకూ, దేవేంద్రునికి వైరం ఉన్నమాట నిజమే ! మీ వారిలో చాలామందిని, ఇంద్రుడు పరాజితులను చేసిన మాట కూడా నిజమే ! దీనిక్కారణం ఇంద్రుడు కాదనీ, విష్ణువనీ నేను చెబితే - నువ్వే కాదు - చాలామంది నమ్మరు కానీ అసలు సత్యమేమిటో నాకు తెలుసు. మరొకరి ప్రోద్బలంతో, తనుచేసిన ఈ ఘాతుక కృత్యానికి దేవేంద్రు డిపుడు, మనస్ఫూర్తిగా పశ్చాత్తాపపడుతున్నాడు. నిన్ను దర్శించి క్షమాపణ కోరుకుందామని కూడా అత ననుకొంటున్నాడు ఈ అభిప్రాయం దేవేంద్రుడు వెలిబుచ్చినపుడు, అతనికి నే నొక్క సూచన చేశాను. చేసిన తప్పుకు పరిహారంగా, క్షమాపణ చెప్పుకోవడం మాత్రమే చాలదన్నాను. హిమవంతుని, పర్వత

చక్రవర్తిగా గుర్తించి, అతని పాలనాధి కారానికి లోబడి, మిగిలిన పర్వతరాజ్యాలన్నీ మెసులుకొనేలాగా తగు కట్టుదిట్టం చేయాలన్నాను. నామీది గౌరవం కొద్దీ అత నిందుకు అంగీకరించాడని నే నను. నీ బలదర్పాలూ, శౌర్యసంపదా చూసి, దేవేంద్రు డిందుకు అంగీకరించాడు. త్వరలోనే, అతగాడు సపరివారంగా నీ సన్నిధికి రావచ్చు. అతన్ని సలాంఛనంగా ఆహ్వానించు. గౌరవించు. చక్రవర్తిత్వాన్ని వహించు," అన్నాడు నారదుడు.

హిమవంతుని కన్నులు ఆనందంతో మెరిసిపోయాయి.

నారదుని మనస్సు కుదుటబడ్డది.

"నువ్వెంతో అదృష్టవంతుడివి హిమవంతా!" అంటూ ప్రారంభించాడు నారదుడు, "ఇపుడే నీ బిడ్డను చూశాను. జగత్సౌందర్యమంతా రాశీభూత మయి నట్లుగా తోచింది నాకు. మహావీరుడైన శంకరుడికి తగిన భార్యనుకన్న నీజన్మ ధన్యమయింది."

హిమవంతుడు క్షణకాలం విచలితుడయ్యాడు. తిరిగి కుదుటబడ్డాడు, ఏదో అనబోయి, అనలేక, మౌనంగా ఉండిపోయాడు.

* * *

ఎవ్వరికీ ప్రవేశంలేని శంకరుని సాన్నిధ్యానికి గిరిజాదేవి రాకపోకలు సాగిస్తున్నది. కార్యభారంతో సతమతమయిపోతున్న శంకరునికి, చేదోడు వాదోడుగా ఉంటున్నది.

అస లీఏర్పాటు కూడా శంకరునికి ఇష్టంలేదు అనేకసార్లు, అత వా పర్వత రాజపుత్రిని వెళ్ళిపొమ్మని కూడా ఆదేశించాడు. వెళ్ళినప్డు వెళ్ళేది. లేనప్పుడు తిష్ఠవేసేది

"ఇదేమీ" అని శంకరుడుకూడా గట్టిగా అనలేక పోయేవాడు. ఎలా అంటాడు?

తన సైన్యాలు. చెల్లా చెదరుగా ఉన్నాయి. ఉన్న బలగాన్నంతా కూడ గట్టుకోవాలన్నా, ముందు, తనకొక స్థిరత్వం ఉండాలి. అదృష్ట వశాత్తూ హిమవంతుని ఆశ్రయం తనకు లభించింది. అతని సైనిక బలగమంతా, తనకు అండ దండలుగా ఉన్నది అంతే కాదు; హిమవంతుని మాటను, పర్వత రాజులందరూ శిరసావహిస్తున్నారు. వారందరికీ, దేవతలమీదా, దేవేంద్రుని మీదా, చెప్పరానంత ఏహ్యభావమున్నది. వారందరూ, సమయంకోసం ఎదురు చూస్తున్నారని తనకు తెలుసు. వారికి సరైననాయకత్వం కావాలి. వారిని సుసంఘటిత పరచగలిగిన దక్షతకావాలి. తనా పని చేయగలడు. పర్వతరాజుల తోడ్పాటులో, తను దేవలోకాన్ని పాదాక్రాంతం చేసుకోగలడు. అందులో సందేహ మేమీలేదు.



అయితే ఇదంతా ఎప్పుడు సాధ్యమవుతుంది?

పర్వతరాజుల ఆదరాభిమానాలను

తను పొందాలి. వారికి తన నాయకత్వం మీద పరిపూర్ణమైన విశ్వాసం కుదరాలి. తనవల్ల వారికేవో కొన్ని లాభాలు సమ

కూరాలి. ఇవేవీ కానినాడు _ వారి తోడ్పాటు తనకు లభించనూ లభించదు. తన చిరకాల వాంఛితం నెరవేరనూ నెరవేరదు తనూ, తన అనుయాయులూ, ఇలా మెట్టలూ, గుట్టలూపట్టి పోవల సిందే;

వైవాహిక జీవితంపట్ల తన కెపుడూ ఆసక్తి లేదు 'సతి'ని వివాహమాడినా, ఆమెచేసిన అవమానాన్ని భరించినా, సమిష్టి క్షేమంకోసం చేశాడుగానీ - తనేదో బావుకొందామని గాదు; తనను నమ్ముకొన్న వారిని రవంత బాగు చేదామన్నదే తన తపన!

కర్తవ్యతా విమూఢుడై తనిక్కడి కొచ్చాడు. హిమవంతుడు ఆదరించాడు. ఆశ్రయమిచ్చాడు. అండగా నిల్చాడు. ఇవ్వాళ తనతో బాంధవ్యం పెట్టుకోవాలని అభిలషిస్తున్నాడు. తండ్రి అనుమతి లేకుండా పర్వత రాజపుత్రి తనదగ్గర కొస్తున్నదని, తనకొక్కనాటికీ అనుకో లేదు. ఈ బాంధవ్యబంధం, తనను మరింతగా బలవంతుణ్ని చేస్తుం దనడంలో సందేహమూలేదు.

'సతి'లాగా, పార్వతికూడా తనను 'చులకన' చేస్తుందేమోనన్న అనుమానం తనకు కలిగింది. కానీ ఆలోచించి చూస్తే ఈ అనుమానానికి ఆధార మేమీలేదు. 'సతి' దక్షప్రజాపతిబిడ్డ, దేవ వంశీయు రాలు. మరి పార్వతి - పర్వతరాజ తనయ!

తనకు పార్వతేయుల అండ ఎంత అవసరమో, వారికి తన నాయకత్వం అంతే అవసరం.

గిరిజను కాదని, తను సాధించగలి గిందేమీ లేదు. తను గట్టిగా తిరస్క రించితే, హిమవంతుని తోడ్పాటునుకూడా కోల్పోవలసి ఉంటుంది. ఒక్కొక్క రిని ఒక్కొక్క కారణంతో పోగొట్టుకొని, ఒంటరిగా తను చేయగలిగిం దేమిటి?

హిమసానువులనుండి శీతల వాయు వులు అలవోకగా వీస్తున్నాయి. వెండి రజనువంటి తుషార బిందువులు, సూర్య రశ్మికి మెరసిపోతూ, సప్తవర్ణాలనూ, వెలార్చుతున్నాయి.

గిరిజాదేవి, మంచుతువ్వరలో, అడు గులు వేసుకొంటూ, పూజాద్రవ్యాలతో వస్తున్నది. హసన్ముఖుడైన శంకరుడు ఆమెకు ఎదురువెళ్ళి, చేయూతనిచ్చాడు.

* * *

"అమ్మయ్య" అని తల్పానికి జార గిల బడ్డాడు విష్ణువు.

"ఏమి" టన్నట్లు చూసింది లక్ష్మీ దేవి.

"రాజకీయం" అని ముక్తసరిగా జవాబిచ్చాడు విష్ణువు.






ఆకాశం నల్లని మబ్బులతో నిండి వున్నది. ఈ క్షణమో మరుక్షణమో. వాన వచ్చేటట్లుగా వుంది. వాన వస్తేనే గానీ రాజేశ్వరి అక్కడనుండి కదిలేలా లేదు. ఎంతోసేపు ఏడ్చినట్లుంది। ముఖమంతా ఎర్రబడివుంది. చల్లగాలికి నుదుటిమీద పడుతున్న కురులను సర్దుకుంటూ తలఎత్తి చూసింది. ఆమె మనసులా ఆకాశంకూడా కారుమబ్బులు పట్టి వుండటం చూచి బరువుగా నిట్టూర్చింది. ఇప్పుడు కాకపోయినా, మరికొంత సేపటికయినా వాన కురిసి ఈ ఆకాశం నిర్మలం కావచ్చును; కానీ మనసులోని వ్యధ ఎలా తీరుతుంది? అది ఎప్పటికీ తీరేది కాదేమో।

వేణు– తనవాడే ననుకున్న వేణు యిలా చేస్తాడని కలలోనయినా అనుకుందా? ఇన్నాళ్ళూ ఆమెకింతగా తెలియ లేదు గానీ; యిప్పుడు వేణు పరాయివాడయిపోతున్నాడంటే అతనిమీద తనెన్ని

ఆశలు పెంచుకుందో, అతనికి తన జీవి తంలో ఎలాంటిస్థానం యిచ్చిందో అర్థ మవుతున్నది. వేణు, రాజేశ్వరీ ఈ డాబా మీదే ఎన్నో సాయంత్రాలు సరదాగా గడిపారు. ఎప్పుడూ ఏదో చిలిపి ధోర ణిలో మాట్లాడుతుండేవాడు వేణు.

"మాటలేకాక ఇతరుల జీవితాలు కూడా అతనికి సరదా మాత్రమేనా? అంతకంటే నామీద యింకేమీ అభిప్రా యం లేనేలేదా? తనెంత అమాయకంగా పొరబడింది! దీనికి శిక్ష జీవితాంతం అనుభవించేదే అవుతుందా?" రాజేశ్వరి మనసంతా అల్ల కల్లోలంగా వుంది.

ఎంత ఆలోచించినా వేణు యిలా ఎందుకు చేసాడో అర్థంకావటంలేదు. తెలిసీ తెలియని వయసులోనే వేణు ఆమె హృదయంలో అనురాగం చిగురు తొడిగించాడు. ఇప్పటిదాకా అది తియ్యని తలపులతో వృద్ధిచెందుతూనే వుంది. తీరా మొగ్గ తొడిగి పుష్పించే సమయంలో, యింత కఠినంగా నలిపి, కాలరాచి పోతాడని ఎలా అనుకోగలదు. మాలతి చెప్పేవరకూ ఈ సంగతి ఆమె మనసులోకి ఊహామాత్రంగానైనా ఎప్పుడూ రాలేదు

శలవు రోజవటంవల్ల ఏమీ తోచక మధ్యాహ్నం మాలతివాళ్ళింటికి వెళ్ళింది; రాజేశ్వరిని చూసి మాలతి ఆశ్చర్య పోయింది

"నేనే మీ యింటికి వద్దామనుకుంటు న్నాను; నీవే వచ్చేసావు" అంటూ లోపలకు తీసికెళ్ళింది.

మీ పెళ్ళి వచ్చే వేసవిలో అవుతుం దని మేమంతా అనుకుంటున్నాం—పోనీలే మీ నాన్నగారు తలచుకుంటే ఇంతకంటే రాజులాంటి సంబంధాలు ఎన్నో తేగ లరు" అన్నది మాలతి—కాఫీ కప్పు అందిస్తూ.

"ఏమిటే నీ వనేదీ" అన్నది రాజే శ్వరి—మాలతి మాటలు సరిగా అర్థంకాక.

"అయితే నీకు నిజంగా తెలియదా? వేణుగోపాల్ మొన్న మా యింటివా రమ్మాయిని చూడటానికి వచ్చాడు... పెండ్లిచూపులకు ఇంకా నిశ్చయం చేసుకోలేదు కానీ, స్థిరపడ్డట్లేనని వీళ్ళను కుంటున్నారు" అన్నది మాలతి.

రాజేశ్వరికి క్షణం కళ్ళు చీకట్లు కమ్మి నట్లయింది. చెయ్యి వణికి వేడి కాఫీ చేతి మీదకు చిందేటప్పటికి, గాబరా పడుతూ కప్పు వదిలేసింది

"వేరే తెస్తానుండు, నువ్విటు వచ్చి కూర్చో" అంటూ మాలతి లేచి లోప లకు వెళ్ళబోయింది.

రాజేశ్వరి కళ్ళు అప్పటికే నీళ్ళతో నిండిపోయాయి.

"వద్దు మాలతీ, నాకింకేమీ వద్దు" అంటూ గబగబా ఇంటికి వచ్చేసింది. తిన్నగా ఈ డాబామీదకే వచ్చింది. బరు వెక్కిన గుండెలలోనుండి పెల్లుబికి




వచ్చే ఏడుపును ఆపుకోవడానికి చేసిన ప్రయత్నం వృధా అయింది.

ఈ డాబా అంటే రాజేశ్వరికి ఎంతో ఇష్టం. రెండంతస్తుల మేడకు డాబా, చుట్టుప్రక్కల ఇంత ఎత్తులో యిళ్ళు లేకపోవడంతో ఈ డాబామీదకు వస్తే క్రింద ప్రపంచానికి చాలా దూరంలో వున్నట్లు అనిపిస్తుంది అందుకని పరీక్షలలో దీక్షగా చదవటానికీ షికార్లకు బయటకు వెళ్ళకుండా, ఇక్కడే సాయంత్రాలు కాలక్షేపం అవుతూ వుంటుంది రాజేశ్వరికి. ఈ డాబామీద ఇన్నాళ్ళూ ఎన్నో సాయంత్రాలు ఎంతో సంతోషంగా గడిపింది. కానీ...ఇవాళ.

''మాలతి ఎంతో తేలికగా తేల్చి చెప్పేసింది" ఈ సంబంధం కాకపోతే మరో రాజాలాంటి సంబంధం తెస్తారు మీ నాన్నగారు'' అని। అది కేవలం తనకు ఓదార్పుగా వుంటుందని అన్నదే గానీ, ఆమాటలు తన్నెంతబాధపెట్టాయో దానికి తెలియదు మంచి సంబంధం అంటే వేణుగోపాల్ కంటే అందగాడు, ఆస్తిపరుడూ అని మాలతి ఉద్దేశ్యమేమో: నిజమే-నాన్న తలచుకుంటే ఎలాంటి వరుడినైనా తేగలరు. కానీ...తన హృదయంలో వేణుకు వున్న స్థానం మరొకరికి—అతనెంత అందగాడయినా, ఎన్ని ప్రత్యేకత లున్నా ఎలా యివ్వగలదు. అసలు నాన్నగూడా వేణు తన అల్లుడవుతాడనే యిన్నాళ్ళనుండీ అనుకుంటున్నారు. మరిప్పుడు ఈ సంగతి తెలిస్తే రెండు కుటుంబాలమధ్యా యిన్నాళ్ళనుండీ నివురుగప్పిన నిప్పులా వున్న ద్వేషం మళ్ళీ రాజుకుంటుందేమో।

రాజేశ్వరి ఆలోచనలకు అంతూ దరీ వున్నట్లు కనిపించటం లేదు.

రాజేశ్వరితండ్రి సీతారామయ్యా, వేణు తండ్రి చలపతీ ఒకప్పుడు మంచి స్నేహితులు. ఇరుగుపొరుగునవుంటూ, ఎంతో కలిసిమెలిసి వుండేవాళ్ళు. ఒకోసారి డబ్బు ప్రభావం ఇదీ అని ఎవరూ నిర్ణయించి చెప్పలేరు. ఎంతో స్నేహంగా వుండే సీతారామయ్యా, చలపతి యిప్పుడు బద్ధవిరోధులు! దానికి కారణం డబ్బే.

ఇద్దరూకలిసి వ్యాపారం ప్రారంభించారు. మొదట్లో మంచిలాభాలు వచ్చాయి. కాలమంతా ఒకేరీతిగా గడవదుగా. వ్యాపారం అంటే లాభం – నష్టం రెండూ వుంటాయి. కొద్దికాలం లాభసాటిగా నడచిన వ్యాపారంలో, రానురాను నష్టం రావడంతో స్నేహితులిద్దరిమధ్యా చిన్నచిన్న అభిప్రాయభేదాలు మొదలయినాయి. డబ్బు వ్యవహారంలో ఒకరిని ఒకరు నమ్మలేని స్థితికి వచ్చేశారు. నష్టం రావడానికితోడు వీరిలో ఐకమత్యం లేకపోవడంతో వ్యాపారం పూర్తిగా కట్టేయవలసి వచ్చినది.

అప్పటినుండీ రెండు కటుంబాలకూ మాటలులేవు. చివరకు పొరుగున వుండటంకూడా ఇష్టంలేక చలపతి వేరే పేటలో యిల్లు కొనుక్కుని వెళ్ళిపోయాడు.

స్నేహంగా వున్న రోజుల్లో రాజేశ్వరి – వేణు, కాబోయే భార్యాభర్తలుగానే అందరూ మాట్లాడుకుంటూ వుండేవారు

“మా కోడలుపిల్ల ఏదమ్మా! వదినా, ఏం చేస్తున్నదీ?” అంటూ వచ్చేది వేణు తల్లి కాంతమ్మ.

“మా అల్లుడు ఏం చదువుతానంటున్నాడు?” అనేవారు సీతారామయ్య, సుందరమ్మలు.

పెద్దవాళ్ళ భావాలు పూర్తిగా అర్ధం చేసుకోలేక పోయినా, చిన్నవాళ్ళ మనసులలో ఏదో అనురాగం, మమత ఆనాడే స్థిరపడి పోయాయి.

స్నేహితులు వేరయిపోయి దాదాపు రెండేళ్ళు కావస్తున్నది. వేణుమాత్రం రెండుమూడు రోజులకు ఒకసారి తప్పక యిటువైపు వస్తుండేవాడు. పెద్దవాళ్ళ వ్యవహారాల్లో తనకేమీ సంబంధం లేనట్లు, మునుపటిలా కలిసీ మెలిసే వుండేవాడు. రాజేశ్వరికి తెలియని పాఠాలు మొట్టికాయలు వేసి మరీ చెప్తుండేవాడు.

“దీన్నింక పైకి చదివించకండత్తయ్యా, నేను చెప్పలేను” అని అంటుండేవాడు వేణు.

“నేనసలు చదవనే చదవను. నీ మొట్టికాయలు తినలేను బాబూ” అని వెక్కిరించేది రాజేశ్వరి.

వీళ్ళిద్దరి వాదాలు వింటూ పెద్దవాళ్ళు నవ్వుకునేవారు.



అప్పుడప్పుడు సుందరమ్మకు మనసులో ఏవేవో సందేహాలు బయలు దేరేవి. అటువైపు పెద్దవాళ్ళకు ఇష్టం లేనప్పుడు ఈపెళ్ళి ఎలా జరుగుతుంది? 'ఎటుపోయి ఎటువచ్చినా మన జాగ్రత్తలో మనం వుండాలి.' అని పోరుపెట్టుండేది

సీతారామయ్య పకపకా నవ్వేవాడు_ భార్య అమాయకత్వానికి.

''ఈ కాలంలో పెద్దవాళ్ళకి ఎవరే భయపడేది. ఏ ఉద్దేశ్యం లేనిదే అబ్బాయి ఇలా ఎందుకు రాస్తున్నాడంటావు? నీవేమీ పిచ్చిపిచ్చి ఆలోచనల్ని పెట్టుకోకు" అని తేల్చేసేవాడు...

"అక్కయ్యా, అమ్మ రమ్మంటూంది" అంటూ ఉమవచ్చి పిలిచేవరకూ రాజేశ్వరి ఆలోచనలు తెగలేదు. ఉలికిపడి లేచి క్రిందకు దిగివచ్చింది.

"పేరంటానికి వెళ్ళాలి, మరచిపోయావుటే, త్వరగా బయలుదేరు" అన్నది సుందరమ్మ.

"నేనురాలేనమ్మా, నాకు తలనొప్పిగా వుంది నువ్వెళ్ళిరా" అన్నది రాజేశ్వరి విసుగ్గా.

ముఖం చూస్తుంటేనే తెలుస్తున్నది. ఒంట్లో బాగుండలేదని. అందువల్ల సుందరమ్మ ఇంకేమీ బలవంతం చేయలేదు.

"సరేలే, కాఫీ యిస్తాను – ఏదైనా మాత్ర వేసుకుని కాఫీతాగి పడుకో. నేను త్వరగానే వచ్చేస్తాలే" అని కాఫీ యిచ్చి ఉమతో పేరంటానికి వెళ్ళిపోయింది.

రాజేశ్వరి కాసేపు పడుకోవాలని ప్రయత్నం చేసింది. ఒంట్లో అస్వస్థత అయితే కదా నిద్ర రావడానికి. మనసు ఎంత వద్దనుకున్నా అదే ఆలోచనలకు దారితీస్తూవుంది. ఏదైనా చదువుదామన్నా ప్రతి అక్షరంలోనూ వేణురూపమే కనబడుతున్నది.

"నే నేం తప్పుచేసానని వేణు ఇలా మారిపోవాలి। ఇందుకేనన్నమాట_వేణు యిక్కడకు వచ్చికూడా నాలుగైదు రోజులయిపోయింది. బహుశా ముఖం చెల్లటం లేదేమో...'' తల నిజంగా బ్రద్దలయేంత నొప్పిగావుంది. లేచి రేడియో ఆన్ చేసింది_రాజేశ్వరి

'ప్రియుడు మోసగించి ఎటో వెళ్ళిపోయాడుట. తన కేదీ దారీ' అని చంద మామనూ. చెట్లనూ గుట్లనూ అడుగు తున్నది ప్రియురాలు. మధురమైన రాగంలో విషాదగీతం। విసుగ్గా రేడియో కట్టేసి మళ్ళీ ఆలోచనలో పడింది రాజేశ్వరి.

"రాజీ।" చటుక్కున తలెత్తి చూచింది రాజేశ్వరి, వేణు వరండాలో నుండి లోపలకు వస్తున్నాడు. ఎప్పటి చిరునవ్వే। ఎప్పటి కొంటెచూపులే।

"ఎందుకూరాజీ। ఎందుకు వచ్చావ్।" అంటూ లేచి నిల్చుంది. కోపంవల్లనో, వచ్చే ఏడుపును ఆపుకోవటం వల్లనో కళ్ళు ఎర్రబడ్డాయి.

"అదేమిటి రాజీ, అలా అడుగు తున్నావు కొత్తగా. అలా వున్నావేం ఒంట్లో బావుండలేదా ?" అంటూ దగ్గరగా వచ్చాడు వేణు.

రాజేశ్వరి అటు తిరిగి కిటికీదగ్గరకు నడిచింది

"ఓహో। ఈ నాలుగైదు రోజుల నుండీ రాలేదనేగా కోపం, తెలిసిందిలే మామయ్య ఇంట్లో వున్నారా ? మాట్లాడాలి..." అంటూ సోఫాలో కూర్చు న్నాడు వేణు

రాజేశ్వరి మనసు కోపంతో బాధతో నలిగిపోతూవుంది. ఎంత నటన। జరిగినది తెలియదనే అనుకుంటున్నాడు గాబోలు।

"పెళ్ళి సంగతి చెప్పడానికేగా ? పెళ్ళి కూతురు బాగా నచ్చిందా, పెళ్ళెప్పుడు?" అంటూ జీరబోయిన గొంతుతో గబ గబా అడిగేసింది. వేణు తెల్లబోయి చూచాడు.

"అప్పుడే మీదాకా తెలిసిపోయిందా. రాణీగారి కోపానికి కారణం అర్ధ మయిందిలే. అంత అసూయ ఎందుకు




రాజీ! పెళ్ళి సంగతులు మాట్లాడటానికే వచ్చాను. మామయ్య ఇంట్లో వున్నారా లేదా చెప్పవేం?" అన్నాడు వేణు నవ్వుతూ.

ఆ నవ్వు చూస్తుంటే రాజేశ్వరికి ఒళ్ళంతా భగభగ మండినట్లయింది. వేణును ఆ చెంపా ఈ చెంపా వాయించా లన్నంత కోపం వచ్చింది

"ఛీ! నీ విలాంటివాడవని కలలో గూడ అనుకోలేదు. జీవితాలతో నీకు పరిహాసాలా..." వీధి గేటులోనుండి తండ్రి రావడంచూచి వేణు పిలుస్తున్నా వినిపించుకోక లోపలికి వెళ్ళిపోయింది రాజేశ్వరి.

"ఏం అల్లుడా, ఈమధ్య ఎక్కడా కనిపించడమేలేదే" అంటూ సీతారామయ్య వచ్చి వేరే సోఫాలో కూర్చున్నాడు.

"అమ్మాయ్! కాసిని మంచినీళ్ళు తీసుకురామ్మా" అని లోపలకు కేకేసి "ఆ...ఏమిటోయ్ సంగతులు" అంటూ తీరికగా సంభాషణ ప్రారంభించాడు.

"మీతో ముఖ్యమైన విషయాలు మాట్లాడాలనే వచ్చాను మామయ్యా" అని మంచినీళ్లు అందించి ఇంకా అక్కడే నిల్చున్న రాజేశ్వరిని చూచి కొంటెగా నవ్వాడు వేణు.

"నేను మామయ్యతో మాట్లాడు తుంటే మధ్య తమరెందుకు ? దయచేయ వచ్చు" అన్నాడు.

తండ్రి ఎదురుగా ఏమీ అనే ధైర్యం లేక రాజేశ్వరి వేణువంక కొరకొర చూసి లోపలకు వెళ్ళిపోయింది.

"మా నాన్న నాకు పెళ్ళిచేయాలని తొందరపడుతున్నారు, మీకూ తెలిసే వుంటుంది కదా మామయ్యా" అన్నాడు వేణు.

"అవునోయ్. ఏవో సంబంధాలు వెతుకుతున్నాడని విన్నాను. కానీ నీ మీద ఆపాటి నమ్మకం వుండబట్టే నే నేమీ గాభరాపడలేదు. నీవూ చిన్నవాడ వేంకాదు. బియ్యే పాసయ్యావు. అన్ని విషయాలు ఆలోచించుకోగలవాడవు. ఈ పెళ్ళితోనయినా మళ్ళీ మా యిద్దరి స్నేహం కలుస్తుందని అనుకుంటు న్నాను" అన్నాడు సీతారామయ్య చుట్ట వెలిగిస్తూ.

"మా నాన్న ఉద్దేశ్యం అలా లేదు మామయ్యా. ఆయనకు నే నింకా తనెలా చెప్తే అలా వినాల్సిన పదేళ్ళ కుర్రాడిలా కనబడుతుంటాను. ఈ వారంరోజుల నుండీ ఇంట్లో చిన్న యుద్ధంలాటిది జరుగు తున్న దనుకోండి. నా ఉద్దేశ్యం తెలిసి మండిపడ్డారు నాన్న. నే నిక్కడకు తరచు వచ్చిపోతున్నా నని తెలిసి చూచీ చూడనట్లే వూరుకున్నారట. నే నెప్ప టికీ తనమాట దాటనని అనుకున్నారట. చెప్పవలసిన విధానాలన్నీ చెప్పిచూశారు. చివరకు బెదిరించారుకూడా 'నా యిష్టం నీకవసరం లేకపోతే నీకూ నాకూ సంబం ధము లేద'నేశారు. అమ్మ మా యిద్దరి మధ్యా నచ్చ చెప్ప లేక సతమత మవుతూవుంది. రోజూ నాన్న కేకలు అమ్మ ఏడుపులూ నాకు మతిపోగొట్టున్నా యంటే నమ్మండి మామయ్యా. ఎంతకీ నా మొండిపట్టు నేను విడువకపోయే టప్పటికి నాన్న తనచివరి అస్త్రం ప్రయోగించారు..."

"ఏమిటదీ." అన్నట్లు సీతారామయ్య చుట్ట నోట్లోనుండి బయటకుతీసి శ్రద్ధగా వినసాగాడు.

"తను ఎవరో పెద్దమనిషికిమాట యిచ్చారట — పెళ్ళిచూపులకు వస్తామని. తనపరువు నిలబెట్టదలిస్తే ఆ చూపులకు వెళ్ళివచ్చిన తరువాత 'నీ ఏదు పే దో నీవే ఏడుద్దువుగాని' అని అన్నారు. అంటే నాన్న ఆలోచన ఏమిటో అర్థ మయిందా మామయ్యా. ఆ అమ్మాయి అందచందాలకూ, వా ళ్ళిచ్చే కట్నా లకూ నేను లొంగిపోతానని ఆశపడ్డా రన్నమాట. చెప్పానుకదూ మానాన్నకు నే నింకా పసివాడినే నని సినీమాకు తీసికెళ్ళమని ఏడిచే పిల్లవాడితో, ఈ సినిమా వద్దులే, రేపు మంచి సర్కసు వస్తుంది దాని కెళ్దాం, అని ఏదోమాటలు



చెప్తే వూరుకుంటాడు. నేనూ ఆలాగే పట్టుపత్తే మొన్న పెళ్ళిచూపులకు వెళ్ళక నని అనుకున్నారు. నాన్న అంతగా తప్పలేదు..."

కోపంతో ఏదో అనబోయాడు సీతారామయ్య. ఏదో తప్పుచేసినవాడిలా తలవంచుకుని చేతివేళ్ళు చూసుకుంటూ చెప్పుకుపోతున్న వేణును చూచి కాస్త తమాయించుకున్నాడు.

"ఇంటికి రాగానే అమ్మ వాళ్ళ ఆస్తి-అంతస్తూ, ఆ మ్మాయి అందచందాలు వర్ణిస్తుంటే నా మాటకూడా ఖచ్చితంగా చెప్పేశాను "పెళ్ళంటూ చేసుకుంటే రాజేశ్వరినే చేసుకుంటాను మీ పెద్దవాళ్ళ కలహాలతో మా జీవితాలు నాశనం చేయకండి. మీకు మీ పట్టుదలలే ముఖ్యమో, నేను ముఖ్యమో తేల్చి చెప్పమను నాన్నని." అని చెప్పాను. అమ్మన్నకు ఏం చెప్పిందో, ఎలా చెప్పిందో, ఏమో, తెలియదు. నాన్న ఈ రెండు రోజులనుండీ ముభావంగానే వుంటున్నారు. మళ్ళీ ఏ పెళ్ళిమాపుల ప్రసక్తి లేదు నా కింక ఈ ముసుగులో దెబ్బలాట యిష్టంలేదు మామయ్యా. మీ అభిప్రాయంకూడా ఏమిటో తేల్చుకోవాలని వచ్చాను. ఏమంటారు మామయ్యా." అని ఆత్రంగా అడిగాడు వేణు

సీతారామయ్య పెద్దగా విరగబడి నవ్వాడు. ఆ నవ్వులో ఎంతో తృప్తి వుంది.

"బావుందయ్యా! నీవు మీనాన్న మాట లెక్కచెయ్యనంటున్నావు మా అమ్మాయిమాత్రం నా మాట వింటుందని ఎలా చెప్పగలను! ఇప్పుడు పెద్దవాళ్ళ ఇష్టాయిష్టాలతో పనేముందయ్యా, దాన్నే అడిగి కనుక్కో-మరి." అంటూ చిన్న చురక వేసాడు.

"రాజీ, రాజీ" అంటూ లోపలకు రాబోతున్న వేణు గుమ్మంచాటునేవున్న రాజేశ్వరిని చూచాడు.

"అమ్మదొంగా యిక్కడేవున్నావా?" అంటూ దగ్గరకు వస్తున్న వేణుకు అందకుండా తప్పించుకుని డాబామీదకు పారిపోయింది రాజేశ్వరి

"రాజీ, నీతో మాట్లాడాలి, కాసేపు ఇక్కడే కూర్చుందామా" అన్నాడు వేణు డాబామీదకు వచ్చి.

రాజేశ్వరి పరుగుపరుగున వచ్చి వేణును గట్టిగా కౌగలించుకుంది చేజారిపోయిన రత్నం తిరిగి లభించినంత సంతోషంగావున్నది రాజేశ్వరికి

"ఇంకేమీ చెప్పనవసరంలేదు వేణూ, నేనే నిన్ను తప్పుగా అర్థంచేసుకున్నాను-క్షమించవూ? ఈ కొద్దిసేపూ నే నెంత యాతన అనుభవించానో నీ కెలా చెప్పను వేణూ''అంటూ అతని హృదయంలో తలదాచుకుంది.

"పిచ్చిపిల్లా" అంటూ తన కౌగిలిని మరింత బిగించాడు వేణు. ఆ కౌగిలిలో రాజేశ్వరి అనుమానాలన్నీ తీరిపోయాయ్ వేణుకు కావల్సిన అంగీకారం కూడా దొరికిపోయింది,

దట్టంగా పట్టిన శ్రావణమేఘాలకు చల్లటిగాలి తోడురాగా పెద్దవాన ప్రారంభమయింది.

---



(గత సంచిక తరువాయి)

ఎండ వస్తోంది. కానీ నిలవటం లేదు

ఎండని మబ్బు, మబ్బుని ఎండ తరుముకుంటూ, దోబూచులాడుతున్న మిశ్రమ వాతావరణం ఏర్పడింది

రాత్రి నిద్రలేమితో, ఆలోచనాభారంతో అలసివున్న నాకు ఆ చల్లటిగాలి, హాయిగా. సేద తీరుస్తున్నట్టుగా వుంది.

బైట. వరిచేలు చెరుకు, తమలపాకుల కూరగాయల తోటలు ఒకదానివెంట ఒకటి వేగంగా రీలులా పరుగెత్తుతున్నాయి. ఎంతో పచ్చగా, సుందరంగా వున్న ఆ పరిసరాలు కళ్ళకెంతో హాయిని కల్పించసాగాయి.

---

యద్దనపూడి సులోచనారాణి

---

## జరిగిన కథ

[కృష్ణవేణమ్మగారికి, తనకూతురు మీనాని, జడ్జిగారిభార్యకు మేనల్లుడైన సారధికి ఇవ్వాలని కోరిక మీనా, ఈ సంబంధంపట్ల తన అయిష్టతను, తండ్రికి తెలియచేస్తుంది. సారధి రాబోతున్న సమయంలో తల్లి, స్నేహితురాండ్రతో కలిసి డార్జిలింగ్ మొదలగు ప్రాంతాలకు వెళ్ళవలసివచ్చింది. మీనాకూడా, సారధిని తప్పించుకోవాలని చూస్తుంది. వంటమనిషి తాయారమ్మ కాశీలో ఉన్న కూతురుకి జబ్బుఅని తెలిసి, ప్రయాణమయినప్పుడు, తనూ తోడుగా ప్రయాణమైంది. కాని తాయారమ్మ ఒప్పుకోదు. తండ్రి మీనాను ఆమె మేనత్త యింటికి వెళ్ళమని సలహా యిచ్చి, మేనత్తగురించి వివరాలన్నీ చెప్తాడు. మీనా, మేనత్తగారి వూరుకి బయలేరుతుంది. — ఇక చదవండి.]

ఎంత హాయిగా అన్పించినా మనసులో ఎలాగో వుండనే వుంది.

పరుగుపందెం ప్రారంభించినవాడు తను చేరాల్సిన గమ్యస్థానం దగ్గరపడిన కొద్దీ ఎలా ఆత్రుత, ఆందోళనా చెందుతాడో నా స్థితికూడా అలాగే వుంది

దగ్గరకు వస్తున్నా. వచ్చేస్తున్నా. చెవుల్లో ఎవరో వూదిచెబుతున్నట్టుగా వుంది

నే నిలా వెడుతున్నట్టు అమ్మకి తెలుస్తే?

తెలియనీ!

నే నిదివరకులా భయపడను.

నే నిప్పుడు కృష్ణవేణమ్మ చేతిలో కీలుబొమ్మని కాను.

లాయర్ హనుమంతరావుగారి ఏకైకపుత్రిక మీనాక్షిని.

నా కా సమయంలో నాకేదో దృఢమైన వ్యక్తిత్వం వచ్చిన ట్టయింది.

కొంచెం నిటారుగా కూర్చున్నాను. బస్సు మళ్ళీ ఆగింది. అలా ఆగటం అప్పటికి నాలుగోసారి.

"యిదేనండి అడ్డరోడ్డు," అన్నాడు కండక్టర్.

వులిక్కిపడ్డాను.

"దిగుతారా?" ఎంత మర్యాదగా అడిగాడు.

చకచకా దిగాను.

నా పెట్టె, బెడ్డింగు క్రిందకి దింపారు.

నేను చూస్తుండగానే బస్సుకదిలి, దుమ్మురేపుకుంటూ వెళ్ళిపోయింది. నే నలాగే చూస్తున్నాను.

బస్సు క్రమేపీ దూరమై, చిన్నచుక్కగామారి పూర్తిగా అదృశ్యమైపోయింది.

నేను నిలబడినవైపునకు అభిముఖంగానే నిమ్మలూరు. 5 కి. మీ. అని కర్రకి పాతిన ఒకబోర్డువుంది. దానికి కావాలని ఆ చెక్కని బిగించారు కాబోలు. ఒక మేకు వదులై ఆ బోర్డు వ్రేళ్ళాడుతోంది ఏం మనుష్యులు, యింతమంది యీ రోడ్డుమీద తిరుగుతారు. ఒకచిన్న మేకుతెచ్చి దాన్ని సరిచేయకూడదూ— అన్పించింది.

ఒకసారి పరిసరాలన్నీ కళ్ళతోనే కలియ జూపాను.

చుట్టూ దిగంతాల వరకూ వ్యాపించి వుందా అన్నట్టు పచ్చటి పైరు. నున్నగా సిల్కులా మెరుస్తున్న ఆ ఆకుపచ్చటి వరిచేలమీద సయ్యాట లాడుతున్నట్టుగా చిరుగాలుల అలలు అలలుగా తేలిపోతున్నాయి ఒక్క నిముషం నా ఆత్మ సర్వం మరిచి, యీ శరీరాన్ని విడిచి ఆ గాలిలో ఐక్యమైపోవాలని తపించింది.

చుట్టూరా నిశ్శబ్దం. భరించలేనంత ప్రశాంతత.

మనిషి ఏకాకి అనే వైరాగ్యం ప్రశ్నించే మౌనం.

ఆ మౌనంలో నుంచి సుందరంగా వినిపిస్తోంది, హుషారుగా. గాలి పాడుతున్న యీల పాట.

హఠాత్తుగా గుర్తుకు వచ్చింది నాకు.

ఆడపిల్లని, వంటరిదాన్ని.

ఒంటిమీద నగా, నట్రా వున్నదాన్ని.

యిలా ఒక్కదాన్ని ఇక్కడ ఎంత సేపు నిలబడాలో!

యిలాటి వాతావరణం మనిషిలో కానిబుద్ధులు ప్రకోపింపచేస్తుంది.

ఈ గాలిలో ఏదో మత్తు వుంది.

ఎవరైనా నా కంఠం పిసికేస్తే?

నగలకోసమే అయితే అవన్నీ వలిచి మూటకట్టి చేతులో పెట్టి నమస్కారం చేస్తాను. కానీ—కానీ ఛ—ఛ కొత్తగా వ్యక్తిత్వం తెచ్చుకున్న నేను ఎంత చెత్తగా ఆలోచిస్తున్నాను. ఉఁహు అలాటి దేం జరగదు.

ఎవరైనా వెనకగా వచ్చి ఏ కత్తితోనైనా వెన్నులో గుచ్చితే?

ఆ నిముషంలో నేను కాలక్షేపంకోసం హుషారుగా చూసిన డిటెక్టివ్ సినిమా లన్నీ కళ్ళముందు గిరగిరా తిరిగినాయి.

నా వెన్నులో యెవరో పొడవటానికి సిద్ధంగా వున్నట్టే అన్పించింది. వెనక్కు తిరిగాను.

ఎదురుగా పైజామా లాల్చీ వేసుకుని వున్న వ్యక్తి కన్పించాడు.

నేను గిరుక్కున వెనక్కి తిరగటంతో అప్పటివరకూ తదేకంగా నన్నే గమ నిస్తున్న అతను వెంటనే ఏమీ తెలియనివాడిలా తికమకగా చూసాడు.

నేను అతనివైపు వెర్రిదానిలా చూసాను

ఇతను ఇక్కడెందుకు దిగాడు?

నా వెనకే ఎందుకు నిలబడ్డాడు!

నా వైపే అంత పరీక్షగా ఎందుకు చూస్తున్నాడు.

నా కళ్ళకి నల్లద్దాల చలువజోడు వుంది కాబట్టి నా కళ్ళలో కలవరపాటు అత నికి కన్పించలేదు. థ్యాంక్‌గాడ్? లేని ధైర్యం తెచ్చిపెట్టుకుని దర్పంగా అడిగాను "నేను నిమ్మలూరు వెళ్ళాలి ఇక్కడ బండీలాటి దేమైనా దొరకుతుందా?"

అతను క్షణంసేపు నా వైపు రెప్పవాల్చకుండా చూసాడు.

ఆ తర్వాత చకచకా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

నే నడిగింది అతనికి విన్పించ లేదా?

చెవిటివాడా? లేక మూగవాడా? మాట్లాడదేమిటి?

అతను వెళ్ళినవైపే చూస్తున్న నాకు అతను సరాసరి రోడ్డుకి ఆ వైపువున్న పాకలోకి వెళ్ళటం కన్పించింది

ఆ చుట్టుప్రక్కల ప్రదేశానికి మానవ సంచారానికి, ఆ పాక ఒక్కటే నిదర్శ నంగా వుంది.

రెండు నిట్టాళ్ళమీదలేచి నిల్చిన్నపాక.

అది కాఫీహోటలో లేక కిళ్ళీకొట్టో లేక రెండూనో తెలియదు; కానీ ఆ పాక తడికలకి అంగుళంమీద మేర ఖాళీలేకుండా సినిమాపోష్టర్లు అంటించబడివున్నాయి. వాటిలోని హీరోలు, హీరోయినులు రకరకాల పోజుల్లో, అసహజంగా, వికృతంగా వున్నారు.

ఇక్కడెక్కడా బండీలాటి దేదీ లేదు.

నాన్నగారు తప్పకుండా దొరుకుతుం దన్నారు.

ఇప్పుదేం చేయటం!

కర్తవ్యంకోసం సీరియస్‌గా ఆలోచిస్తున్న నా వైపు ఆ పాకలోంచి పది సంవత్స రాల కుర్రాదొకడు సోడా బాటిల్ పుచ్చుకుని రంయ్‌మంటూ పరుగెత్తుకువచ్చాడు. నా దగ్గరగావచ్చి ఆగిపోయినవాడు, 'సోడా తాగుతారా?' అంటూ నా సమాధానంకోసం చూడకుండానే కొట్టేయబోయాడు.

నేను వెంటనే ఆపుచేస్తూ 'వద్దు' అన్నాను.

"వద్దా? ఆయన యిమ్మన్నారే," అన్నాడు.

"ఆయనా! ఎవరాయన?" అన్నాను

"కృష్ణారావుగారు."

"కృష్ణారావ్? ఎవ రా కృష్ణారావ్?"

కుర్రాడు నే నడగటంతోగల తీవ్రతకి కాబోలు, తెల్లబోయి ఒకడగు వెనక్కు వేసి నిలబడ్డాడు.

"సోడా, గీడా తాగటానికి నే నేం కడుపునొప్పితో బాధపడటం లేదని చెప్పు," అన్నాను కోపంగా.

రాస్కెల్! ఎంత ఇన్సల్ట్! బస్సులోనుంచి నా వెంట దిగిందేకాక డైరక్టగా సోడాకూడా పంపేస్తున్నాడు. నే నీ దేశానికి పరదేశినని బాగా తెలిసిందిలా వుంది. అందుకే ఆ చొరవ. దగ్గరనేరానీ చెబురను. సోడాకుర్రాడు ఏమనుకున్నాడో ఏమో.

మారు మాట్లాడకుండా వెనక్కి పరుగెత్తాడు.

'ఇదుగో. నిన్నే' వెనకనుంచి పిలిచాను.

వాడునిల్చి ఆశగా తిరిగిచూసాడు.

సోడా కావాలంటాను అనుకున్నాడు కాబోలు.

'ఇక్కడెక్కడా బళ్ళులేవా?' అన్నాడా.

'లేవు. రెండెద్దుల బళ్ళున్నాయిగాని, కిరాయమీద వెళ్ళిపోయినాయి. ఇప్పుడు రావు,' అనేసి పరిగెత్తాడు.

అక్కడ అతనితో ఏం చెప్తాడో ఏమో.

ఆ కృష్ణారావు అన్న అతను నవ్వుతూ వెనక్కుతిరిగి నావైపు చూపి జేబులోంచి డబ్బుతీసి మళ్ళీ అటుతిరిగి వాళ్ళకిచ్చాడు.

ఇంతలో పాకవెనకనుంచి, ఎత్తుగా, రథంలావున్న రెండెడ్ల బండీ ఒకటి వయ్యారంగా, మెల్లగా రోడ్డుమీదకి వస్తోంది.

దాన్ని చూడగానే నా మొహం విప్పారింది. బండి ఖాళీగావుంది. నా భయం అంతరించింది.

గుండెలు తేలికపడినాయి.

బహుశా ఆ బండీలో నేను వెళ్ళవచ్చు ననుకుంటా.

తెల్లగా, బలంగా, ఎత్తుగావున్నాయి ఎడ్లు.

బండికి కట్టినగుడిసె కొత్తదిగా, అందంగావుంది.

లోపల చారల జంఖానాపరిచి మెత్తటిప్రక్క పరిచివుంది. బండీముందు నల్లగా, పొట్టిగా, లావుగావున్న ఒకతను మోకాళ్ళమీదికి గట్టిగా కట్టిన పంచెతో, బనీనుతో, నోట్లో బారెడుచుట్టతో నిదానంగా నడిచివస్తున్నా డతను అదేదో పుస్తకంలో హీరో నాయకుడిలా వున్నాడు.

అతను తాడులాటి దానితో ఆ ఎడ్లని పట్టుకోలేదు.

అయినా అవి పెంపుడుకుక్కల్లా నమ్మినబంటుల్లా అతనివెనకే వస్తున్నాయి నా కా దృశ్యం చూడముచ్చటగా వుంది.

"ఇదుగో విన్నే-" చప్పట్లుచరిచి పిలిచాను.

అతను నా దగ్గరగా వచ్చాడు.

బండికూడా అతని వెనకాలే వచ్చి ఆగింది.

"ఇదిగో తాతా! యీ బండీ యెవరిది? యెక్కడికి వెడుతుంది? అని అడిగాను. అతను నోట్లోచుట్ట క్రిందపడిపోయేటంత ఆశ్చర్యంగా చూడసాగాడు

"విన్నే అడిగేది నేను నిమ్మలూరు వెళ్ళాలి. ఇది అక్కడికి వెడుతుందా?"

"ఆ! వెళుతుంది. మీరు నిరభ్యంతరంగా యిందులో యెక్కచ్చు." వెనుకనుంచి విన్పించింది.

తిరిగి చూశాను. ఆ విలన్ కృష్ణారావు బండి దగ్గరగా వస్తున్నాడు

అతని చెరోచేతిలో నా పెట్టె, బెడ్డింగ్ వున్నాయి.

"యీ బండీ ఆ వూరే వెడుతోంది."

చేత్తో సామానుని బండీలోపెట్టి పైకితోస్తూ అన్నాడు.

నాకు శరీరం భగ్గుమంది. ఏమిటో జబర్దస్తీ!

నన్నడక్కుండా, నా యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా నా సామాను బండీలోపెట్టే అతని చొరవకు మండిపోయింది.

చేదుపదార్థం నోట్లో పెట్టుకొన్నదానిలా ముఖంపెట్టి నిలబడ్డాను.

"ఎక్కండి," అన్నాడు.

నేను బండివైపు చూశాను.

అది చాలా ఎత్తుగావుంది.

ఎలా ఎక్కటం?

"నేను సాయంపట్టేదా?" ఎంతమర్యాదగా అడిగాడు కృష్ణారావు.

"సాయమా? ఎలా?" అన్నాను.

అతను ఏంచేస్తాడో నేను గ్రహించగలిగేలోపలే రెండుచేతుల్తో నా నడుం దగ్గరపట్టి పైకి ఎత్తి బండిలోకి తోశాడు.

చప్పున లోపలకమ్మీ పట్టుకున్నాను.

లేకపోతే జారిక్రిందపడి వుండేదాన్ని.

అలా కూలేసి వదిలేశాడు దునన్న.

బండిలో సరిగ్గా కూర్చున్న నేను కళ్ళజోడుతీసి చక్రమన్నట్టు వెనక్కుతిరిగి మిర్రిచూశా. కానీ ఏం లాభం! వేస్ట్. ఫ్యూర్ వేస్ట్. అతను నా వైపుచూడలేదు. అప్పటికే నా కళ్లెదుట లేకుండా పక్కకి వెళ్ళిపోయాడు. స్కౌండ్రల్, ఇడియట్. ఇంకొక్క నిమిషం నా కళ్ళెదుటవుంటే కాలి చెప్పులతో పూజచేసి వుండేదాన్ని.

"వీరయ్యా, నువ్వు నడు. నేను తొట్లోకూర్చుంటా," అన్న స్వరం విన్పించింది.

"చిత్తందొరా," అంటున్నాడు వీరయ్య.

నేను బైటకి తొంగిచూశా. ఎవరూ కన్పించలేదు.

మళ్ళీ యిటు తిరిగేసరికి కృష్ణారావు బండీ చక్రంమీదనుంచి ఎక్కి ముందు కూర్చున్నాడు.

ఏమిటీ! ఇతనుకూడా వస్తున్నాడా నాతో!

ఆశ్చర్యంతో కొయ్యబారిపోయాను.

అత నేదయినా అసభ్యంగా ప్రవర్తిస్తే! ఏం చెయ్యటం?

చూస్తాను. వీరయ్య వుండగా అంత సాహసం చేయగలడా?

వీరయ్య నా ప్రాణదాతలా, అంగరక్షకుడిలా బండివెంట నడవసాగాడు.

దూరంగా చేలల్లో అక్కడక్కడా మనుష్యులు కన్పిస్తున్నారు.

ఎరుపు, నీలం, వంగపండురంగు యిలాటి ముదురురంగు చీరలు కట్టున్న ఆడవాళ్ళు కొంతమంది వంగి ఏమిటో పైకి పారేస్తున్నారు.

బహుశా కలుపుతీయటం అంటే అదేనేమో అనుకున్నా.

బండీ వరిచేలమధ్య తెల్లగావున్న రోడ్డుమీద యిసకలో సర్రుమని శబ్దంచేస్తూ, చక్రాలగుర్తులు గీసుకుంటూ సాగిపోయింది.

గుండెలు బిగబట్టి కూర్చున్న నాకు ఆ పరిసరాలు, ఆ ప్రకృతిసౌందర్యం ఇంతక్రితంలా అంత ఆనందంగా, అత్యద్భుతంగా అన్పించలేదు. వరదలోపడి కొట్టుకుపోతున్న వాడికి ప్రాణభయంతప్ప నీటిలో తిరుగుతున్న సుడిగుండాల అందం వాళ్ళకేం తెలుస్తుంది!

* * * *

ఓచెంప విలన్ కృష్ణారావుని కనిపెడుతూనే, యింకోవైపు చుట్టుప్రక్కల పరిసరాలని గమనించటం ప్రారంభించాను.

కనుచూపు మేరవరకూ అదే పచ్చదనం.

ఆకుపచ్చటి పైరుమీదనుంచి వీస్తున్న గాలిలో చెప్పలేనంత హాయి, వర్ణించ నలవికానంత సుఖం కన్పిస్తున్నాయి.

మానసికంగా కానీ, శారీరకం గానీ అలిసిపోయిన వ్యక్తికి యీ చోటులో యిట్టే సేదతీరవచ్చు.

ఎంతో విశాలమైన యీ భారతదేశం అంతా యిలా సస్యశ్యామలం అయిపోతే ఎంత బాగుంటుంది!

మన దేశానికి యీ ఆకలి దారిద్ర్యాన్నుంచి విముక్తి ఎప్పుడో!

మనిషికి తిండిలేమికంటే మించిన మహానరకం యింకేముంది? ఎడ్లు, వయ్యారంగా, విదానంగా, ఆలోచనలో పడినట్టు మెల్లగా నడుస్తున్నాయి.

సిటీలో ఎల్లవేళలా కారులో రంయ్ మంటూ దూసుకుపోవటానికి అలవాటుపడిన నాకు, యీ రెండెడ్లబండి ప్రయాణం బొత్తిగా నత్తగుల్ల నడకలా అన్పించసాగింది.

కాలం ఏడో ఆగిపోయినట్టే వుంది.

అయినా ప్రతిపనీ యింత నిదానంగా చేసుకుంటూపోతే మనిషి ప్రగతిని ఏం సాధించ గలుగుతాడు.

శుభం నిర్వర్తించాల్సిన పనులు చకచకా ముగించేసుకుని, కాలం మిగుల్చుకున్నప్పుడేకదా కొత్తవిషయాలు నేర్చుకోటానికి, సాధించటానికి సమయం మిగిలి అవకాశం అంటూ ఏర్పడేది. త్వరిత గమనానికి అలవాటుపడిన యీ తరానికి విదానం బద్ధ శత్రువులా కన్పించటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ప్రతిదానికీ తొందర. అర్జెంట్. రాకెట్ వేగం కావాలి యీరోజుల్లో పుస్తకాలు తీసుకోండి మొదటిపేజీ మొదలుపెడితే – ఆగకుండా చకచకా చివరిపేజీ తీసేవరకూ పాఠకుణ్ణి చదివించేసాలా వుండాలి.

సినిమాలు చూడండి. ప్రేక్షకుడికి ఏది, ఏమిటి అనే ఆలోచన్లు రాకుండా కత్తి యుద్ధాలో, గుఱ్ఱపుస్వారీలో, ఏడుపులో, పెడబొబ్బలో, నవ్వులో, రీలువెంట రీలు పరుగెత్తాలి. థియేటర్లో కూర్చున్న కొద్దిసేపు వాళ్ళకి ఆలోచించేందుకు సమయం అందనివ్వకూడదు,

ఇదివరకులా రైళ్ళలో రోజులతరబడి ప్రయాణంచేసే ఓపిక యిప్పుడెవరికి వుంది?

అసహనం అంతరించటానికి కారణం ఏమిటి?

న్రరున దూసుకుపోతూ, గంటల ప్రయాణాలవి, నిముషాల్లో తేల్చేసిగమ్యస్థానం చేర్చగలిగిన విమానాలేగా.

ఒకనాటికి యివికూడా పాతపడే రోజులు రావచ్చు

యీ ప్రపంచంలో కొత్త అనేదాని ఆయుష్షు చాలా అల్పం. ఈ రోజువుదయిం నూతనమైన విషయం సాయంత్రానికి పాతపడిపోయే వేగంలోకి వచ్చి పడ్డాం

వీటికంతకీ మూలకారణం ఏమిటి ?

మన తాత ముత్తాతల కాలంలో నిండుగా, నూరేళ్ళపంటగా అనుభవించే యీ జీవితం యీ నాడు అనారోగ్యంతో, అడుగడుగునా ఎదురయే ప్రమాదాలతో క్షణ భంగురంగా తయారైంది.

మనిషికి జీవితం బుద్బుదప్రాయం అన్న సత్యం అర్థమైనకొద్దీ. దీన్ని అన్ని విధాలా అనుభవించాలనే ఆరాటం, ఆశా ఎక్కువైపోయినాయి.

అసలు నాకనుమానం. భూమి తనచుట్టూతాను తిరిగే వేగంలోకూడా ఏదయినా మార్పు వచ్చిందేమో

ఆ మార్పే మనుష్యులమీద, వారి స్వభావాలమీద యిలాటి ప్రభావం చూపుతోం దేమో

ఎప్పుడూ యింతే.

ఒక్కనిముషం వూరికే కూర్చున్నానా!

నా బుర్ర యిలాగే గందరగోళంగా తయారవుతుంది.

ఆలోచనల్లు రాకెట్లలా ఒకదాన్ని మరోటి ఢీకొట్టుకొనేంత తీవ్రంగా దూసుకుపోతూ వుంటాయి.

కూలింగ్ గ్లాసెస్ తీసిచేత్తో పట్టుకుని వాటిని అటు యిటూ వూపుతూ ఆలోచనల జాలులోపడి వేగంగా జారిపోతున్న నేను, కృష్ణారావు తలతిప్పి యిటు చూడటంతో నేనుకూడా చివ్వున తలతిప్పి చూసాను.

అతను నవ్వుతూ ఏదో అనబోయాడు.

నేను పదునుపెట్టిన జంట కత్తులు గురిచూసి ఒక్కసారి విసిరినట్టు, తీవ్రంగా, చురచురా చూసాను.

అతని ముఖంలో నవ్వు ఎగిరిపోయింది

కనుబొమ్మలు ముడిచి నావంక విచిత్రంగా చూసాడు.

ఏదో అనబోయాడు.

మళ్ళీ ఏమనుకున్నాడో ఏమో. చటుక్కున ముఖం త్రిప్పేసుకున్నాడు.

నేనుమాత్రం యింకా అతన్ని అలాగే పరీక్షగా చూడసాగాను.

వెనుకనుంచి చూస్తే అతనితల, ఆ జుట్టు దువ్వుకున్నతీరు, ఆ భుజాలు, ఆ కూర్చోటం కాస్త అందంగానే కన్పించాయి.

బాగుంది. విలన్లలో మాత్రం అందమైనవాళ్ళు లేరా?

ఆ మాటకొస్తే అమెరికా అధ్యక్షులని హత్యచేసిన హంతకులలో యిద్దరు ముగ్గురు చాలా అందంగా వున్నారు.

సినిమాల్లో కన్పించే విలన్లలోకూడా చాలామందికి కనుముక్కుతీరు బాగానే వుండటం నేను చూసాను.

ఈ విలన్లలోకూడా రెండురకాలవాళ్ళున్నారు.

వాళ్ళలో మొదటిరకం.

వీళ్ళు గుబురుమీసాలు, వుబ్బినబుగ్గలు, ఎర్రజీరలున్న కళ్లు, గళ్ళ లుంగీతో భీకరాకారంగా చూడగానే యిట్టే తెలిసిపోతారు.

రెండోరకం విలన్లు. వీళ్ళు అందంగా, హుందాగా, నీట్‌గా, పక్కా పెద్ద మనుష్యుల్లా వుంటారు. వీళ్ళ బుద్ధులు విషసర్పాలే. ఈ కృష్ణారావు అందమైన విలన్ కావచ్చు.

మన సంఘంలో అసలు యీ రెండోరకం విలన్లతోనే పెద్దబాధ వచ్చిపడింది.

మొదటిరకాన్ని చూడగానే భయపడిపోతాం. ఝడుసుకుని దూరంగా పారిపోతాం.

రెండవరకం వుందే- వాళ్ళనసలు గుర్తుపట్టటమే కష్టం. ఒకవేళ గుర్తుపట్టినా, వాళ్ళని విలన్లని ప్రపంచానికి ఋజువు చేయటానికి చాలాశక్తులు, యుక్తులూ కావాలి.

నిమ్మలూరు వెళ్ళగానే యీ కృష్ణారావు వుదంతం కనుక్కోవాలి.

అప్పటివరకూ పదినిముషాలకోసారి వాచీ చూసుకుంటున్న నేను ఇరవయ్యోసారి చూసుకున్నాను.

దూరంగా వూరిలాటిదేదో కన్పించసాగింది.

అందమైన వరిచేలని అంతంచేస్తూ కుడివైపున పెద్దతోట లాంటిది మొదలైంది. దానిచుట్టు యినపముళ్ళ తీగ ఫెన్సింగ్‌లా అల్లబడి వుంది. దానికి అక్కడక్కడా గుబురుగా అడవితీగెలేవో అల్లుకుని వున్నాయి. మామిడితోటలా వుంది. దట్టంగా, ఎత్తుగా, పెరిగివున్న మామిటిచెట్ల శిఖరాగ్రాలు కన్పిస్తున్నాయి.

లోపల యింకా ఏ మొక్కలున్నాయో ఏమో। తోట ప్రక్కనుంచి బండీ వెళుతుంటే రకరకాల వాసనలు మిళితమైన సువాసన వకటి ముక్కుపుటాల్లో ప్రవేశించి వూపిరితిత్తులు విశాలం చేసుకుని యింకాస్త గాలిపీల్చేలా చేస్తోంది.

"వీరాయి నేనిక్కడ దిగుతాను, నువ్వు అమ్మాయిగారిని యింటికితీసుకెళ్ళు." అన్నాడు కృష్ణారావు

"చిత్తందొరా" వీరాయి బండీముందుకు వెళ్ళాడు.

కృష్ణారావు బండీ ఆపి దిగేసాడు.

వీరాయి బండీముందు నడవసాగాడు.

జోడెడ్లబండీ అతని వెనక పెంపుడుకుక్కలా బైలుదేరింది. కృష్ణారావు చక చక అడుగులు వేస్తూ తోటవైపు నడక ప్రారంభించాడు. అతను ఒక్కసారి వెనక్కి తిరిగి చూస్తాడేమో కాస్త ప్రసన్నంగా, కృతజ్ఞత తెలియబరుస్తున్నట్టుగా చూద్దాం అనుకున్నా.

కానీ అతను వెనక్కి తిరగలేదు

అతని ఖర్మ నాకేం.

నేను మొహం యిటు తిప్పుకున్నాను.

బండీ వందగజాలు దాటి మలుపు తిరిగిందోలేదో వూరు ప్రారంభమైంది. అది బహుశా అవూరికి చివరి అవటంవల్లనేమో ఆ చుట్టుప్రక్కల అంతగా యిళ్ళులేవు. ఎదురుగా రోడ్డుకి కుడివైపుగా పెద్ద బావిఒకటి కన్పిస్తోంది. దానికి రెండు గిలక లున్నాయి బావిచుట్టూ ఆడవాళ్ళు చాలామంది వున్నారు. ఒకళ్ళిద్దరు గిలకమీద నుంచి బరబరా బకెట్లు లాగుతున్నారు. ఇంకా కొంతమంది బావి అంచుకి దిగువునకూర్చుని బిందెలని పరపరా తోముతున్నారు నూతిలోంచి నీళ్ళు తోడుతున్నవాళ్ళు బకెట్లుఎత్తి ఆ భుజంమీద యీ భుజంమీద పోసుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ స్నానాలు చేస్తున్నారు. నేను కూర్చున్నబండీ ఆ బావిపక్కగానే రాసాగింది ముందుగా, బిందె తోముతున్న ఒకావిడ యీ బండీని బండీలో వున్న నన్ను చూచి ప్రక్కనున్నావిడని మోచేత్తోపొడిచింది. ఆవిడ తిరిగి చూచింది. చూడగానే యింకోయిద్దరిని సైగచేసి పిలిచి నావైపు చూపించింది, మొత్తానికి క్షణంలో అంతా చేస్తున్న పనులు మాని యిటువైపు చూడసాగారు.

నేనుకూడా చిరునవ్వుతో వాళ్ళవైపే చూడసాగాను.

పల్లెటూరులో యిలా గుంపుగాచేరిన వ్యక్తులనే కాబోలు అమ్మలక్కలు అంటారు.

వాళ్ళందరినీ పరిశీలించే అవకాశం యివ్వకుండా బండీ ముందుకు సాగి పోయింది.

వెనకనుంచి ఒకావిడపిల్చి కేకవేస్తూ అడిగింది.

"వీరాయి! ఎవర్రా?"

"అమ్మాయిగోరు," వెనక్కు తిరగకుండానే జవాబుయిచ్చాడు వీరాయి

"ఏవూరు?"

"పట్నం."

వాడి జవాబులకి నాకు నవ్వొచ్చింది. నిజంగా నాపేరేమిటో నా వూరేమిటో వాడికి తెలియదు. కానీ వాడి జవాబులు తెలియనట్టుగా లేకుండా గడుసుగా వున్నాయి.

బండీ వూరులోకి ప్రవేశించింది. అన్నీ చిన్న చిన్న యిళ్ళు. చాలావరకూ పాకలే. దాదాపు అన్నియిళ్ళకి వీధిలో కూర్చోటానికి అనువుగా అరుగులున్నాయి.

పశువులని పాలకి తోలుకుపోతున్న గొడ్లకాపర్లు కొంతమంది నా బండివెనక ప్రొసెషన్‌గా బైలుదేరి కొంతదూరం వరకూవచ్చి వదిలి వెళ్ళారు.

బజార్లలో ఆట్టే జనంలేరు. వీధుల్లో సందడేలేదు. అక్కడక్కడా కొంతమంది కూర్చుని వున్నారు. ఒకళ్ళిద్దరు అప్పుడే నిద్రలేచినట్టు సూచనగా వీధి అరుగులు ఎక్కి ముఖప్రక్షాళన చేస్తున్నారు.

యిదేమిటి? పల్లెటూరి వాళ్ళంతా వేకువఝామునే లేచి కాలకృత్యాలు తీర్చుకుని తమ తమ పనులకి వెళ్ళిపోతారని నాన్నగారు చెప్పగా అనేకసార్లు విన్న నేను విఋంగా విస్తుపోయాను.

బద్ధకస్థులకి పట్నవాసుల, పల్లెటూరు అనే భేదం లేదేమో!

నేను బాగ్ తెరిచి నాన్నగారు వ్రాసియిచ్చిన కాగితం చూసుకున్నాను. వీధి మధ్యగా గ్రామపంచాయితీ బోర్డు అన్న ఆఫీసు కన్పించింది. దానితర్వాత లైబ్రరీ కెదురుగావున్న సందులో ప్రవేశించి కొద్దిదూరం వెళ్ళిన తర్వాత కుడివైపు తిరగాలి. అక్కడ మరోచిన్న సందు వస్తుంది.

బండీ యీ సందులో ప్రవేస్తుండగా నేను కాగితంమడిచి బాగ్‌లో పెట్టేసి ఆత్రంగా ఆవీధిలోకి చూడసాగాను.

నాగుండెలు గుబగుబ లాడుతున్నాయి.

అంతర్యం నిండా అర్థంగాని ఆరాటం.

ఏదో కొందర. భయం.

నాకళ్ళు ఆవీధిలో ఎడమవైపు పెద్ద రావిచెట్టువున్న యింటికోసం వెతక సాగాయి.

ఖర్మ! నాన్నగారు చెప్పలేదు.

ఆవీధిలో అలా రావిచెట్టువున్న యిల్లు ఒకేవరసలో రెండువున్నాయి. అందులో ఏది

మొదట రావిచెట్టువున్న యింటి గుమ్మంముందు నిలబడి ఒక వయసుమళ్ళిన ఆవిడ యిటే చూస్తోంది.

రెండో చెట్టువున్న గుమ్మంలో నలుగురు స్త్రీలు నిలుచుని వున్నారు, బహుశా వాళ్ళే అయివుంటారు.

ఎందుకంటే నాబండీని చూడగానే నిలబడిన ఆపిల్లల్లోఒక చిన్నపిల్ల లోపలికి పరుగెత్తింది.

బండీ సరిగ్గా ఆ యింటిముందుకేవచ్చి ఆగింది.

పిల్లలంతా బిలబిల లాడుతూ బండీముందుకే వచ్చారు. (సశేషము)

Printed and published by A. Sudhakara Rao for Yuva Publications, Hyderabad -1
and printed at Yuva Press, Public Garden Road - Hyderabad - 1. Phone 36336
Controlling Editor : Sri "CHAKRAPANI"

